# ప్రభుత్వాన్ని నడుపుతున్నది ఎవరు?

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

ఈ మధ్య ఓ మిత్రుడు బొంబాయి నుంచి వచ్చి ఢిల్లీ రైల్వే స్టేషన్‌లో దిగాడు ప్రధాన మంత్రి ఇంటి నుంచి ఎంతో దూరంలో లేనటువంటి ఇంటికి వెళ్ళడానికి ఆటో రిక్షా మాట్లాడు కున్నాడు ఆ ఆటో రిక్షా డ్రైవర్ ఇరవై రూపాయలు అడిగాడు అది మామూలు కంటే రెట్టింపు

ఇది పచ్చి మోసమని నా స్నేహితు డన్నాడు

ప్రధాన మంత్రి అయితే కోట్లకు కోట్లు గడించి తప్పుకు పోవచ్చు నేను పది రూపాయలు ఎక్కువడిగితే మాత్రం మోసం చేస్తున్నానని మీరనుకుంటారు అన్నాడా డ్రైవర్ కోపంతో

నేను మొన్నీ మధ్య ఎవరు ఎవరిని మోసం చేస్తున్నారో తెలుసుకుందామని ప్రయత్నించాను మనం జర్మన్‌లనో స్వీడ్‌లనో మోసగిస్తే తప్పేమీ లేదని కొందరు వాదిస్తారు పరాయి వాళ్ళ నుంచి కమీషన్ల ద్వారా సొమ్ము చేసుకుంటే ఏమవుతుందని వాళ్ళు అడుగుతారు కాని నిజానికి ఇందుకు వ్యతిరేకంగా జరుగుతున్నది జర్మన్‌లు స్వీడ్‌లే మనను మోసం చేస్తున్నారు ఎందుకంటే చివరికి తుక్కుగా తేలబోయే పరికరాలకు వాళ్ళు మననుంచి చుక్కల నంటేటటువంటి దర వసూలు చేస్తున్నారు ఈ లూటీని వాళ్ళూ భారత దేశంలోని పాలక పక్షానికి చెందిన మనుషులూ చేరి సగం పంచు కుంటున్నారు మనకు 30 కిలో మీటర్ల బదులు 20 కిలో మీటర్ల దూరం మాత్రమే పేల్చగలిగే టటువంటి తుపాకులు అందుతాయి యుద్ధంలో పనికిరాని జలాంతర్గాములు అందుతాయి ఎగరడానికి ఉపయోగపడని విమానాలందుతాయి పైగా మన రాజకీయ వేత్తలు వాళ్ళ నుంచి డబ్బు తీసుకున్నారు కాబట్టి వాళ్ల నోళ్ళు మూతబడే ఉంటాయి గనుక మనం వాటి గురించి పల్లెత్తు మాట అనలేం

ఐతే ఇది కూడా సంపూర్ణ సత్యం కాదు జర్మన్లు స్వీడ్‌లు మనను మోసగిస్తూండ వచ్చు కాని వాళ్ళు ఈ పని మన డబ్బుతో నే చేస్తున్నారు కాని వాళ్ళ డబ్బుతో కాదు వాస్తవంగా చెప్పాలంటే మనను మోసగిస్తున్నదీ ఖజానాను దోచేస్తున్నదీ కాంగ్రెస్ రాజకీయ వేత్తలే ఎందుకంటే వాళ్ళు ఈ ఆటలన్నింటినీ పన్ను చెల్లింపు దార్ల డబ్బుతో అంటే మీ డబ్బుతో నా డబ్బుతో ఆడుతున్నారు ఈ మొత్తం లావాదేవీలలో వినియోగ పడుతున్నటు వంటిది మనడబ్బే

ప్రతి సంవత్సరం ఎంత డబ్బు ఇట్లా స్వంత బొక్కసాలకు చేరుతున్నది? నల్లదనపు ఆర్థిక వ్యవస్థ గురించి పరిశోధించడానికి ప్రభుత్వం నియమించి నటువంటి కమిటీ విదేశాలలో కూడబెట్టుకున్న దోచిన సంపదను అంచనా వేయడానికి నిరాకరించింది అక్కడికక్కడ అంటే స్విట్జర్లాండ్‌లో నాసౌలో హాంగ్‌కాంగ్‌లో అధ్యయనాలు జరపకుండా అటువంటి అంచనా వేయజాలమని ఆ కమిటీ వాళ్ళు చెప్పారు కానీ ఎగుమతి దిగుమతుల మీద 10 శాతం దొంగరవాణా సరుకుల మీద 20 నుంచి 40 శాతం వరకూ ఇట్లా పెరిగి పోతూ ఉండవచ్చునని వాళ్ళు అన్నారు అంటే ప్రతి సంవత్సరం 30 వేల కోట్ల రూపాయలకు మించి ఉండే ఎగుమతి దిగుమతుల మీదనే ఈ అక్రమ సంపాదన మూడు వేల కోట్ల రూపాయలు ఉండి ఉంటుంది

ఇక దొంగరవాణా విషయానికొస్తే మీరు కూడా నేను వేసినంత సరిగానే అంచనా వేయగలరు ఆ మధ్య ఒకసారి బొంబాయిలో ఒక వ్యక్తిని అరున్నర కోట్ల రూపాయల కరెన్సీ నోట్లతో పట్టుకున్నారు ఆయన వాటిని విదేశాలకు దొంగరవాణా చేసేటందుకై తన కార్యాలయంలో సిద్ధం చేస్తున్నాడు రెండు సంవత్సరాల క్రితం, అప్పటి గుజరాత్ ముఖ్యమంత్రి శ్రీ సోలంకి కి స్నేహితుడైన ఒక అహ్మదాబాద్ వ్యాపారి హాంగ్‌కాంగ్‌కు సూట్ కేసుల నిండా కరెన్సీ నోట్లు పట్టుకు పోతుండగా పట్టుకున్నారు కొన్ని అంచనాల ప్రకారం దొంగ రవాణా వ్యాపారం విలువ సాలీనా 5000-8000 కోట్ల రూపాయలకూ మధ్య ఉంటుంది అంటే దీంట్లో మిగుల్చుకునే డబ్బు వెయ్యికోట్ల రూపాయల దాకా ఉంటుంది

ఈ అన్ని అంకెలనూ కలిపితే సాలీనా ఐదు వేల కోట్ల రూపాయలు అనే అంకె వస్తుంది అది మన ఎగుమతుల విలువలో దాదాపు సగం ప్రతి సంవత్సరం దేశం నుంచి బైటికి వెళ్ళి పోతున్న అక్రమ విదేశీ మారక ద్రవ్యం ఐదు వేల కోట్ల రూపాయలన్న మాట అంటే రోజుకు పది కోట్ల రూపాయలకు పైగానే నన్నమాట ఇందులో ఒక్క పైసా కూడా ప్రభుత్వంలో ఎవరో ఒకరికి తెలియకుండా బైటికి పోదు ఆవ్యక్తి బొంబాయిలోని ఒక కిందిస్థాయి కస్టమ్స్ అధిగారి అయినా కావచ్చు లేదా కొత్త ఢిల్లీలోని కాంగ్రెస్ పార్టీ నాయకులలో ఉన్నతస్థాయి వ్యక్తి అయినా కావచ్చు– ఆయనను ఉన్నత స్థాయి వాడని మీరు అనదలచుకుంటే – ఎంత ఉన్నత స్థాయి అనేటటు వంటి విషయం మనకు ఈ మధ్య బైట పడిన వివాదాల నుంచే తెలుస్తున్నది నిజానికి ఈ బైట పడిన వివాదాలు అవగింజలో అరవయ్యవ వంతు ఉంటాయని శ్రీ విశ్వనాథ ప్రతాప్ సింగ్ మనకు గుర్తు చేస్తున్నారు మన దేశాన్ని పీల్చి పిప్పి చేసారు సరిగా ఫిలిప్పైన్స్‌ను కూడా మార్కోస్. అతని మిత్రులు ఇటువంటి పద్ధతిలో నే కొల్ల గొట్టారు ఇప్పుడు సాగుతున్నటువంటి పరిస్థితులు ఇదే పద్ధతిలో కొనసాగితే భారతీయుల యాజమాన్యంలో దేశంలో కన్నా బైటే ఎక్కువ సంపద ఉంటుంది

ఏవిషయం గురించీ ప్రభుత్వం తీవ్రంగా పట్టించుకుంటున్నట్టు లేదు కనుక ఈ వ్యవహారంలో ప్రభుత్వ సాధికారత చాలా స్వల్పంగానో లేదా శూన్యంగానో ఉన్నది బహుళ జాతి సంస్థల విషయం తీసుకొంది ఢిల్లీలో జరిగిన పెద్ద ప్రదర్శనలో దేశాన్ని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తున్నారని బహుళ జాతి సంస్థలను శ్రీ రాజీవ్ గాంధీ విమర్శించారు అదే రోజు బహుశా అదే సమయంలో రాజీవ్ గాంధీ మిత్రులు న్యూయార్క్‌లో ఒక సమావేశంలో ప్రసంగిస్తూ బహుళ జాతి సంస్థలు ఇతోధికంగా భారతదేశంలో ప్రవేశించి పరిశ్రమలలో పెట్టుబడి పెట్టాలని ఆహ్వానిస్తున్నారు (మే 17న ఎకనమిక్ టైమ్స్ పత్రిక రాజీవ్ గాంధీ ప్రదర్శన వార్తను న్యూయార్క్‌లో ఆయన స్నేహితుల సమావేశం వార్తను మొదటి పేజీలో అచ్చువేసింది) ఈ స్నేహితు లెవరు? ఆర్ పి



గోయెంకా రతన్ టాటా రాహుల్ బజాజ్ ఇక అమెరికన్లతో ప్రత్యేక సంబంధాలు ఉన్నాయని చెప్పబడే ఎక్కడ పడితే అక్కడ ప్రత్యక్ష మయ్యే శ్రీ ఎల్ కె ఝా కూడా ఉన్నారనుకోండి

ఇప్పుడిక మే 17 నాటి వార్తా పత్రికలు చూడండి పై ముగ్గురు పెద్ద మనుషులు వారి వ్యాపారాలు తమ స్వంత ప్రయోజనాల కోసం జాతీయ ప్రయోజనాలను దెబ్బతీయ డానికి ఎంత మాత్రం సంకోచించరని శ్రీ విశ్వనాథ ప్రతాప్‌సింగ్ అన్నారు ఆయనకు అస్థిరత గురించి వ్యాపారం గురించి కూడా ఎంతో కొంత తెలుసని మనం ఊహించవచ్చు పైన ఉటంకించిన మాటలు నావికావు కొన్ని నెలలక్రితం వరకు ఈ దేశపు ఆర్థిక మంత్రిగా ఉన్నటువంటి ఇప్పటికీ ప్రదానమంత్రికి పార్టీ సహచరుడుగా ఉన్నటు వంటి శ్రీ విశ్వనాద ప్రతాప్‌సింగ్ చెప్పినవి

కనుక బహుళ జాతి సంస్థల విషయంలో మన వైఖరి ఏమిటి లేదా రాజీవ్ గాంధీ వైఖరి ఏమిటి? టబ్బులకోసం వచ్చి మొత్తం వ్యవహారంతో విసుగెత్తిన బాడుగ ప్రేక్షకుల ముందర ఇండియా గేట్ దగ్గరి మైదానంలో ఆయన బహుళ జాతి సంస్థలపై బహిరంగంగా దాడి చేస్తారు ఆయన మనుషులు విదేశాలకు వెళ్ళి న్యూయార్క్‌లోనో మరొక చోటనో సమావేశాలు ఏర్పాటు చేసి అమెరికన్ బహుళ జాతి సంస్థలను భారత దేశానికి ఒక్కుమ్మడిగా రావలసిందిగా ఆహ్వానిస్తారు ఎందుకంటే సమయం మించి పోతున్నదని. జపాన్ వాళ్ళు ఆక్రమించేలా ఉన్నారని వాళ్ళంటారు మరి ఈ వ్యక్తులనే జాతి వ్యతిరేకులని మన మాజీ ఆర్థిక మంత్రి విమర్శిస్తున్నారు ఆయన టాటాల పేరు ప్రస్తావించారు గోయెంకాల పేరు ప్రస్తావించారు డి సి ఎం పేరు ప్రస్తావించారు అందరి గురించి స్పష్టంగా పేరు పెట్టి చెప్పారు ఇక ఈ వృత్తాన్ని పూర్తి చేసేటందుకే రాజీవ్ గాంధీ విశ్వనాథ ప్రతాప్‌సింగ్‌పై దాడి చేస్తారు పేరు చెప్పి కాదనుకోండి ఎందుకంటే పేరు చెప్పాలంటే కొంత ధైర్యం ఉండాలి ఐనా బహుళజాతి సంస్థలను విమర్శించినట్టు గానే రాజీవ్ గాంధీ వి పి సింగ్‌ను కూడా విమర్శిస్తారు

దీనంతటి నుంచీ మనం ఏమి అర్థం చేసుకోవాలి? మనకు ఒక ప్రభుత్వం ఉన్నదా లేదా? దానికి బహుళ జాతి సంస్థల గురించి ఒక విదానం ఏదో ఒక విదానం ఉన్నదా? జాతీయ ప్రయోజనాలను దెబ్బతీయ గలరనే ఆరోపణ ఉన్న వ్యక్తులు విదేశాలకు వెళ్ళి బహుళ జాతి సంస్థలను ప్రదానమంత్రి దృష్టిలో అతి పెద్ద విచ్ఛిన్నకర శక్తులను ఎలా ఆహ్వానించ గలరు? ఇలా జరిగిందంటే కారణం ప్రభుత్వాన్ని నిజంగా టాటాలు గోయెంకాలే నడుపుతూ తమ ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తుంటే రాజీవ్ గాంధీ తోలుబొమ్మ లాగ ఆడడమేనా? ఇది చాలా భయానకమైన ఆలోచన కాని అంతకన్నా మనం నిర్ధారణకి రాదగిన దేమీ కనిపించటం లేదు □

## ముఖచిత్రం

29–4 మే సంచిక మా అభిమాన నటి రమ్యకృష్ణ ముఖచిత్రంతో మమ్మానందింపజేసింది ప్రమశంకర్ గారికి మా ధన్యవాదములు

– సి ప్రకాశ్‌బాబు సూళ్ళూరుపేట

## వేయిపడగలు

శ్రీ విశ్వనాథవారి వేయిపడగలు నవలను ధారావాహికంగా ప్రచురించుచున్న ఆంధ్ర సచిత్ర వారపత్రిక వారికి నా అభిమాన నమస్సుమాంజలులు

ధర్మ సూక్ష్మమైనదీ సంప్రదాయసిద్ధమైనదీ చిక్కని చక్కని బావనా బలముతో రమణీయ సమాసబూయిష్ఠమై అలరారే ఈ నవల ఆనాడు ఈనాడే కాదు ఏనాడైనా ఆంధ్ర బాష అలరారు పర్యంతము ఆనాటికానాడు అబిమానుల బలమును పుంజుకొని నూత్న వినూత్న సంప్రదాయ విశేషములకు ఆలవాలమై విరాజిల్లును

– బులుసు సోమన్న, టి కొత్తపల్లి

* * *

వేయిపడగలులాంటి అమూల్యమైన నవలా సంపదని జాతి గర్వించేలా తెలుగు సాహితీవనంలో చిరస్మరణీయమైన అద్వితీయమైన అపూర్వమైన ఆనాటి విశ్వనాథ సత్యనారాయణగారి రచనని కలలో కూడా వూహించని విధంగా పాఠకులకు ముఖ్యంగా ఈ తరం పాఠకుల కోసం మీరందిస్తున్నందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు

– హిమబిందు షోర్వకర్

## సీరియల్స్

ప్రేమసాగర మథనం కొత్త రవీంద్రబాబుగారి సీరియల్ ప్రారంబంలోనే మాకెంతో నచ్చింది నారాయణరావు గతం ఆసక్తికరంగా వుంది సందీప్ తండ్రి కోరికను తీర్చగలడా? అని సందేహం కలుగుతోంది

– ఐరేని శ్రీనివాస్‌గౌడ్ రామాయంపేట

* * *

ప్రేమసాగర మథనం సీరియల్ మొదటి సంచికే ఆసక్తికరం గా సాగింది ముందు ముందు ప్రేమసాగర మథనాన్ని ఊహించుకుంటున్నాం

– పి సోమశంకరరావు బి దొడ్డవరం

* * *

కొత్త సీరియల్ ప్రేమసాగర మథనం ఎంతో బాగుంది రచయిత డాక్టర్ కొత్త రవీంద్రబాబు గారికి మా కృతజ్ఞతలు ఆయనతో పరిచయం కూడా చాలా బాగుంది

– ఎన్ చిరంజీవి వీరవరం

* * *

కొత్త సీరియల్ ప్రేమసాగర మథనం ప్రారంబంలోనే ఆకట్టుకుంది! రచయితగార్కి దన్యవాదాలు!

– రాళ్ళపల్లి బాస్కరరావు విశాఖపట్నం

* * *

డాక్టర్ కొత్త రవీంద్రబాబు గారి ప్రేమసాగర మథనం ఆదిలోనే నన్ను ఆకట్టుకున్నది

– అక్కల సౌబాగ్య కొల్లాపూర్

* * *




కొత్త సీరియల్ డా కొత్త రవీంద్రబాబు ప్రేమసాగర మథనం అందిస్తున్నందుకు నా ధన్యవాదాలు – ఎస్ మహమ్మద్ రఫీ కాశీబుగ్గ

## కథలు

నటి రమ్యకృష్ణ ముఖచిత్రంతో వెలువడిన సంచిక మనోరంజకంగా వుంది ఆశయానికి అడ్డు గోడలు కథ వాస్తవానికి దగ్గరగా వుంది సందేశాత్మకంగా వుంది

– మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం

* * *

29 మే – 4 జూన్ 87 సంచికలో ఆశయానికి అడ్డు గోడలు కథ బాగుంది

– ఎన్ శ్రీనివాసులు పర్లాకిమిడి

* * *

29 మే 4 జూన్ 87 సంచికలో ఆశయానికి అడ్డు గోడలు" సీతోపదేశం' కథలు బాగున్నాయి

– జంపన విశ్వనాథరాజు విశాఖపట్నం

* * *

మంత్రవాది మహేశ్వర్‌గారి "సీతోపదేశం కథ కడుపుబ్బ నవ్వించింది నిజజీవితంలో ముకుందరావులాంటి వ్యక్తితో అదే సమస్యతో చిక్కుకుని చివరకు నేను కథలోలా కార్డు' చిట్కా ఉపయోగించి వసూలు చేసుకున్నాను అదే విధంగా కథలో చదవడం జరిగింది ఇకనైనా ముకుందరావు లాంటి వ్యక్తులు కళ్ళు తెరిస్తే కథకు సార్థకత ఏర్పడుతుంది రచయితగారికి నా ధన్యవాదాలు

– కె వి నాగేశ్వరరావు నార్తురాజాపాలెం

* * *

29 మే 4 జూన్ రమ్యకృష్ణ ముఖచిత్రంతో వెలువడ్డ సంచికలో సీతోపదేశం కథ ముకుందరావులాంటి వారికి గుణపాఠం

– ఎం బి రమేష్‌కుమార్ మహబూబ్‌నగర్

## 'పెద్ద కథ

29 మే– 4 జూన్ 87 – రమ్యకృష్ణ ముఖచిత్రం కడు రమ్యంగా వుంది వడ్డీ పెద్ద కథ రెండు వారాలు చదివాను వడ్డీ వ్యాపారంలో గల బాగోగులు బార్యాభర్తల మధ్యగల సంభాషణలు – వాగ్వివాదం మెచ్చుకోతగ్గది రచయితకు నా అభినందనలు

– మరువాడ సూర్యప్రకాశం కాశీబుగ్గ

## వ్యాసాలు

రమ్యకృష్ణ ముఖచిత్రం గల పత్రికలో విక్టోరియా ఫాల్స్ వ్యాసం చాలా బాగుంది వ్యాస రచయితకి నా అభినందనలు

– కొప్పర్తి శంకర్ కారంచేడు □


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు : (1938-1972)

26 జూన్-2 జూలై '87

శ్రీ ప్రభవ నామ సం జ్యేష్ఠ బ అమావాస్య

సంపుటము 79 : సంచిక 43

ముఖ్య సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు

మతుకుమల్లి మాధవరావు

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు | 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు | 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

### ముఖచిత్రం

విజేత విక్రమ్ లో వెంకటేష్ ఫరా

### కథలు :



### సీరియల్ నవలలు.



### వ్యాసాలు, శీర్షికలు

# మీరు సిమెంట్ కొనబోతున్నారా?



అయితే హైదరాబాద్ లోని ప్రముఖ తాపీ మేస్త్రీ శ్రీ॥ కాశయ్యా గారు ఏమంటున్నారో చూడండి.

"నేను కడుతున్న ప్రతి ఇల్లు కంచు కోటే ఎందుకంటే నేను వాడుతున్నది విష్ణు సిమెంట్ విష్ణు సిమెంట్‌తో స్లాబ్ వేస్తే మూస ముంచుగా ఊడ దీసినా గర్భంలో పచ్చి అనేదే ఉండదు విష్ణు సిమెంట్‌తో ప్లాస్టరింగ్ చేస్తే, చక్కటి నునుపుదనం చిక్కటి నల్లరంగుతో గాలి బీట్లు లేకుండా ఉండి నాకు యజమాని నుంచి మెప్పుని సంపాదించి పెడుతుంది కట్టడాలు విపరీతంగా జరుగుతున్న ఈ కాలంలో విష్ణు సిమెంట్ నాకు ఎంతోకాలాన్ని, మా యజమానికి ఎంతో డబ్బును ఆదా చేసి నాకు చేతి నిండా ఊపిరి సలుపనంతగా పని కలుగ చేసింది. విష్ణు సిమెంట్‌కి ఇవే నా ధన్యవాదాలు






## శ్రీ విష్ణు సిమెంట్ లిమిటెడ్

గుల్‌మొహర్ ఎవెన్యూ రాజ్‌భవన్ రోడ్ హైదరాబాద్-500 482

# నిత్య నూతన సీరియల్

## కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ



# వేయిపడగలు

ఆ నాడు ప్రొద్దు కొంచెము దిగజారి రుక్మిణమ్మా రావు గారి అద్దాల బండి ధర్మారావు యింటికి వచ్చెను తన వాకిట ఆగిన బండి ఎందుకు వచ్చెనో అని సావిత్రమ్మగారు తొందరగా పోయి వాకిట నిలచెను రాణీ బండి దిగి లోనికి వచ్చుచుండెను తానెరిగి ఉన్నంతవరకు రాణీగారు ఎప్పుడును తన యింటికి రాలేదు నేడింత అకారణ హఠాద్వ్రయ ఏల వచ్చెనో సావిత్రమ్మగారికి తెలియలేదు

ఆమెకు కూర్చుండుటకు పాత రత్న కంబళము పై నుండి తీసి పరచిరి అది శాస్త్రిగారి మంచి రోజుల నాటి చిలుకు రాణీ ఆసీన అయ్యెను సావిత్రమ్మ గారు మామీద అమ్మగారికి దయగలిగినదేలకో! మేమింత నోచుకొన్నామా? తమరు వచ్చిన, మా యింట మరియాద చేయుటకు కూడ ఏమియులేదే అనెను

రాణీ మీ కోడలుగారిని చూచుటకు వచ్చితిని

అభ్యంగనము చేసి, తల్లివి రెండు మూడు నగలు పెట్టుకొని నలిగి మరీ సొగసుగా ఉన్న రంగాజమ్మ గారిచ్చిన చీర కట్టుకొని కనులకు కాటుక,

(గత సంచిక తరువాయి)

మొగమున చుక్క మీద అద్దిన కుంకుమతో బాలవలె అరుందతి చనుదెంచెను రాణీ ఆమెను చూచి ఆమె సౌందర్యమున కచ్చెరువుపడెను ఈమె ఏ జమీందారులింటనైన ఉన్నచో ఎంత ఐశ్వర్య వంతురాలయ్యెడిదో! ఈ లక్ష్మీదేవి యీ యింటికి శాస్త్రిగారి లక్ష్మి తొలగిపోయిన తరువాత వచ్చినదేమో! ఆ సౌందర్యమొక విలక్షణ మయినది పొంగి, వఱదలు కట్టి, మేన తాల్చిన నగలు చీరయను ఒడ్డులు చాలక వానిని త్రోసి పొంతపొలాలప్పైకి దూకి వానిని ముంచుట లేదు అంత సౌందర్య వాహినియు కూలంకషమయ్యు కూలచ్ఛేద హేతువు కాక, మహా విస్తారత యందే ఒక వినయ మవలంబించి గట్టు లోదిగి ప్రవహించు చున్నది అరుంధతి వచ్చి కూర్చున్నది రాణీ నీ పేరేమమ్మా అనెను అరుంధతి చెప్పెను

రాణీ మీ ఆయన పేరేమిటి?

అరుంధతి సిగ్గుపడెను

రాణీ అంతటి వివేకము గల పురుషునకు భార్య వైతివి అదృష్టవంతురాలవు ఆయన ఎట్లు చెప్పిన అట్లు వినవలయు సుమా! లేక పోయిన చెడిపోయెదవు విన్నచో చెప్పవలయునా! గిరిక చూడుము మహా భక్తురాలయినది ఆమె ముందు పూర్వపు భక్తులు చాలరేమో అనిపించుచున్నది గిరికో! ఏమి గిరికో!

అరుం గిరిక ఎవరండీ?

రాణీ రత్నగిరి కూతురు

అరుందతికి మొన్న తన భర్త చెప్పిన దానికి ఈమె నేడు అన్నదానికి సరిపోయినది కాని దేవదాసి అంత భక్తురాలా? ఆమెను చూడవలయును ఆమె బాగుపడుటకు తన భర్తకు ఏమి సంబంధము?

రాణీ తలసి తోటలో గంజాయి మొక్క పుట్టదు కాని నీకొక మాట చెప్పెదను ధర్మారావు బంగారపు తండ్రి ఆయన నీవు నోచుకొన్న నోము పంట నీ వరుంధతి ఆయన వసిష్ఠులుగా మెలగ వలయును. అప్పుడు గిరికకన్న నీవే అదృష్టవంతురాలవు కావచ్చును

రాణీ తన మెడలో ఉన్న చంద్రహారము తీసి



చేతిలో పుచ్చుకొని ఉండెను మరల ఎమో మాటాడుచుండెను ఎచ్చటి నుండియో దర్మారా వంతలో ఇంటికి పచ్చి రాణిని చూచి ఆశ్చర్యపడి అమ్మా! నేడు మీరు మా ఇంటికి వచ్చితిరి బాగీరది పిచ్చుకుంటు మిదికి ప్రవహించెను బాబుగారు పోయిన తరువాత మాకీ అదృష్టము కలుగుట కిదే మొదటిసారి అమ్మా! న్యాపేద యింటికి వచ్చితిరి మీకు కూర్చుండు టకు తగిన పీఠమైన ఉంచలేము క్షమించవలయును అని అందే నిలబడెను అరుందతియు లేచి నిలుచుండెను రాణి యిద్దరను కూర్చుండబెట్టెను

రాణి మీ యిల్లాలిని చూచి పోవుటకు వచ్చితిని గిరిక చెప్పినది

దర్మా గిరిక మూన్నాళ్ల నుండి యిచ్చటికి పచ్చుటలేదు

రాణి వచ్చుట లేదని ఆమెయే చెప్పినది

క్రొత్తలో మీ దంపతుల సుఖమును తాను చెఱచుట కిష్టము లేక వచ్చుట లేదట

దర్మా (నవ్వుచు) తమ దంపతుల సుఖము క్రొత్తలో నేను చెఱుపుదునని వచ్చుటలేదు కాబోలు! అది వట్టి దొంగ

రాణి దేవదాసికి పెండ్లి అయినదా? అవును, వారిలో కొందరు పెళ్ళిళ్ళు చేసుకొనుచుండిరి నాకు చెప్పలేదే?

దర్మా అదికాదు అదికాదు

దర్మారా వచట నుండి లేచి అమ్మా! ఇప్పుడే వచ్చెదను అని గదిలోనికి పోయెను అరుంధతియు లేచి మగడు చనిన వైపు చూచెను మగడు రమ్మని చేసన్న పిలచెను ధర్మారా వామెతో నాలుగు పువ్వులును ఫలములను రాణిగారికి ఇమ్మని చెప్పి తాను లోనికి పోయెను అరుంధతి మందారములు చేమంతులు మొగలి రేకులు కలిపి, చక్రకేళీలు గెలలో మిగిలినవి పది తీసుకొనిపోయి రాణిగారి ముందర ఉంచెను రాణి నవ్వి తన చేతిలోని హారమును అరుందతి కీబోయెను అరుంధతి గ్రహించుటకు సంశయించెను రాణి ఫరవా లేదమ్మా! నా ఆనందము కొలది నే ఒసంగుచుంటిని, తీసికొమ్ము అనెను అరుంధతి సిగ్గు పడుచున్నది గాని చేసాచలేదు రాణి ఓహో! బర్త గారి అనుమతి కావలయును కాబోలు! బాబూ! అని ధర్మారావును పిలిచెను ధర్మారావు వచ్చెను బాబూ! నీ బార్య నే నీ కానుక యిచ్చుచుండగా పుచ్చుకొనుటలేదు నేను నీ బార్య కీయ తగనా? నీ బార్య నా వద్ద నుండి పుచ్చుకొన తగదా? చెప్పుము అనెను ఆ బార్యా బర్తల చూపు లెవరికి తెలియకుండ కలసికొని మాటాడినవి అరుంధతి చేసాచెను రాణి నేను నీ కీయ నమ్మా! మా బాబు తీసికొని నీ మెడలో వేయవలయును అని ధర్మారావు చేతికి ఆ హారమిచ్చెను అతడును తీసికొని సిగ్గుపడెను

రాణి నేనును మీ అమ్మ వంటిదాననే నీ మీ అమ్మగార్ల మధ్య సృష్టికర్త ఉన్నాడు నీనా మధ్య వేణుగోపాలస్వామి ఉన్నాడు నేను నీ జనని వంటిదానను పెద్దవాండ్రము చూచి సంతోషింతుము అంతియే మే మింక ఏమి చేయగలము?

దర్మారావు చంద్రహారము వంక చూచెను దానికయిదు పేట లున్నవి వెల అయిదు నూటయేబదులు చేయవచ్చును క్రొత్తగా మెరుగు పెట్టినట్లున్నది అతని వ్రేళ్ళు వణకినవి

సావిత్రి నాయనా! పిల్ల మెడలో వేయుము ఆమెకు చూడవలెనని ఉన్నది

ధర్మారావు హారమును భార్య మెడ నలంకరిచెను ఇద్దరును సిగ్గుతో సిగ్గులు చిరునవ్వుతో చిరునవ్వులు

రాణి బాబూ! పాఠశాలలు తెరచి ఎన్నాళ్ళయినది?

ధర్మా : (ఆలోచనతో) నెల నెలా పదిరోజులయినది

రాణి : మూడు రాత్రులనిద్దురలు ఇచ్చుట కూడ అయినవి కదా! రెండు మూడు రోజులలో బయలుదేరిపోయి కళాశాలలో ప్రవేశించుము ప్రవేశించుట కెంత డబ్బు కావలసి ఉండును?

దర్మారావు దిగ్భ్రాంతుడైపోయెను ఈ అకాల సంపద్వర్షము కురియునని అతనికి తోచలేదు అతడు మౌనము వహించెను

రాణి వంద రూపాయలు కావలయునా?

దర్మా అక్కరలేదండి ఏబది రూపాయలు చాలును

రాణి వంద రూపాయలు రేపు పంపించెదను మంచి రోజు చూచి బయలుదేరి పొమ్ము బి ఏ పరీక్ష అయిన తరువాత చూచుకొనవచ్చును నీవు స్వామి మీద పద్యములు వ్రాసితివట? గిరిక చెప్పినది అవి తరువాత చూపింతువు కానిలే

దర్మారావునకు ఆశ్చర్యము మీద ఆశ్చర్యము తరువాత కొంత సేపటికి రాణిగారు వెడలిపోయిరి

**రాత్రికి గాలిలేక బిగించినది, గదిలో ఉండలేక దొడ్డిలో మంచము వేసికొని నూతన దంపతులు శయనించిరి తెగ ఉక్కపోసి అరుంధతి రైక ఊడదీసెను ధర్మారావు పయ్యెదను ఉండనీయలేదు భార్య పైట వేసికొనుట, భర్త తీసి వేయుట పదిసారు లయిన తరువాత ఆమె అటులే ఉంచినది**

వంపు తిరిగిన చక్కని మెడ మీద చంద్రహారము నదీ సైకతముల కోడెత్రాచు వలె అందములు చిమ్మినది పూర్ణచంద్రుని పదునారు కళలు చిమ్మిన వెన్నెలలు హారము బిళ్ళల మీద పడి చింది కాంతులు దర్మారావు కనులలో కొట్టెను దర్మారా వా కాంతులను చేతులతో మరియు చిమ్మ కొట్టెను అరుంధతి అతని చేతులు పట్టుకొనెను అతడు వంగి హారమును ముద్దు పెట్టుకొనెను హారవ్యాజమున అతడు తన ఎడద సర్వస్వము చూరగొనుచుండెను అరుందతి హృదయ గ్రంది ఆమె ఎరుగకుండ సంపూర్ణముగా శిదిలమై పైని వెన్నెలలు కాయు చందురుని వలె సర్వకళాస్రుతి పొందెను పోసిన చెమ్మట విసరుటకు అరుందతి చీర చాలలేదు ఆమెకు చేతులు నొప్పి పెట్టినవి దర్మారావు సంవాహనము చేసెను ఆమె పరిహరించెను ధర్మారావు మంచముదిగి అరుందతి వంక చూచుచుండెను

అరుం: ఏమిటి అట్లు చూచెదరు?

ధర్మా పైన ఆ చంద్రుడు క్రింద ఈ చంద్రుడు ఇద్దరును పదారు కళలు నిండినవారే వానికి మచ్చ ఉన్నది వీనికి లేదు నీవు కళంకరహితవు సర్వకళాశోబితవు పున్నమ నాటి చందమామవు

ఒక చిన్న గాలి తెర సన్నగా తారాడెను

అరుం దేవదాసికి పెండ్లి అయినదా? ఆ రహస్య మేమిటి?

దర్మారావేమో రహస్యముగ ఆమె చెవిలో చెప్పెను ఆమె వెంటనే లేచి చీర దరించి పాద ప్రక్షాళనము చేసి కనులు తుడుచుకొని స్వామి ఆలయాబి ముఖముగ తిరిగి నమస్కారము చేసెను ఇక్కడ కూడ మూడు రాత్రులగుట చేత మరునాడే తన తండ్రి తన్ను తీసికొని పోవును దేవదాసిని చూచుట ఎట్లు? తన బర్తను వదలిపోవుట ఎట్లు? ప్రాణము నిల్పుట ఎట్లు?

అరుం మీరు మరల చదువులకు పోయెదరా?

దర్మా నాలుగయిదు రోజులలో పోయెదను

అరుం నన్ను తీసికొని పోరా?

దర్మా లేవ దీసికొనియా?

అరుం ఇంచుమించుగా అట్లే అయినది కదా? విచార మెందుకు? ఏ ఊరిలో చదివెదరు? బి ఏ సగ మిదివరకే చదివిరట కదా మీరు?

ధర్మా ఆ సగమును మరల చదువవలయును బందరయినచో ఎరిగి ఉన్న చోటు గుంటూరు దగ్గర అని చూచుచున్నాను

అరుం నన్ను వదలిపోయినచో నే నొప్పుకొనను

దర్మా ఒప్పుకొనక ఏమి చేసెదవు? గొంతుక మీద ఎక్కి త్రొక్కెదవా? శిరస్సున ఎక్కి నృత్యము చేయుదువా?

**అరుందతి పోయి అతని మెడ కౌగలించుకొని మొగములో మొగ ముంచెను.** తన్నిశ్వాసపరీమళ తరంగము చెక్కిలిపయి ఆడెను చేమంతికా కేతకీ కస్తూరీ ప్రియాశరీర పరిమళములు సన్నని గాలులు పండు వెన్నెలలు ముప్పేటలు పడెను

దర్మారావు గుంటూరులో చదువుచుండెను హాస్టలులో బోజనము గుంటూరు వెళ్లినప్పటి నుండియు ధర్మారావు తెలుగులు చదువ నారం

---

జరగిన కథ 11 సుబ్బన్నపేట జమిందారు కృష్ణమనాయని మరణానంతరం రంగారావుగారికి పట్టాబిషేకం జరుగుతుంది రత్నగిరిని సబలో రామేశ్వరముగారు అవమానిస్తారు దేవదాసి గిరికను బలవంతముగా తీసుకురమ్మని కాసా వానిని పంపుతాడు ఆమెరాదని కాసా వానిని పంపి వేస్తాడు దర్మారావు దర్మారావు గురించి సబలో చర్చ జరుగుతుంది రంగారావుగారు రామేశ్వరమును మందలిస్తారు పట్టాబిషేకానికి పది లక్షలు ఖర్చు తేలుతుంది ధర్మారావు పైన రత్నగిరి పైన ప్రతీకారము తీర్చుకోవాలని అనుకుంటాడు రామేశ్వరము రుక్మిణమ్మా రావుగారు కబురు పంపగా కోటలోనికి వెడతాడు ధర్మారావు ధర్మారావు బార్య అరుంధతికి భర్త మీద మంచి అబిప్రాయము లేదు మొదటి రాత్రి మొండికెత్తిన అరుంధతిని ఆమె తల్లి దండ్రులను నిందిస్తాడు దర్మారావు సుబ్బన్న పేట వచ్చిన తరువాత అరుందతికి బర్త మీద ఉన్న అపోహలు తొలగిపోతాయి అరుంధతికి ఇంటిలో పాము కనపడుతుంది దర్మారావు తన ఇలవేల్పు సుబ్రహ్మణ్యేశ్వర స్వామిగా బావించి నమస్కరిస్తాడు అరుంధతి కూడా నమస్కరిస్తుంది




యస్ యన్ యం –కావలి

2 సంవత్సరముల క్రితం తలలో నీరు చేరి వున్నందున మద్రాస్‌లో డాక్టర్లు తలపై భాగంలో రెండు వైపులా రంధ్రములు చేసి నీరు తీసివేసినారు అప్పటి నుండి యిప్పటి వరకూ ఏవిధంగా బాధలేదు కానీ ఆపరేషన్ చేసి నీరు తీయక ముందు మజ్జిగ వాడితే జలుబు వచ్చేది ఇప్పుడు అదే విధంగా మజ్జిగ వాడితే జలుబు చేస్తోంది సన్నగా తల నెప్పిగా వుంటోంది

అలా మజ్జిగ పడనప్పుడు దాని వాడకం మానటం మంచిది. దీనికి ప్రత్యేక చికిత్స లేదు మళ్ళీ తలలో నీరు చేరిందని అనుమానం అక్కరలేదు

వి. యల్ – పలమనేరు

ఆడవాళ్ళకు సహజంగా పొత్తికడుపు మొత్తంవిపరీతంగా పెరుగుతాయి కదా! వాటిని తగ్గించటానికి ఏ ఎక్సర్‌సైజులు చేయాలి? ఆడవాళ్ళు రజస్వల కాక పోవటం అంటూ వుంటుందా? అటు వంటి వాళ్ళు పిల్లలు కనటానికి యోగ్యులు కారా?

ఇలా పెరగకుండా ఉండటానికి రోజూ కొద్ది దూరం నడుస్తూ ఉండటం, ఆహారం తగ్గించటం, ఐస్ క్రీములు, చాక్లెట్లు వాడక పోవటం, మలబద్ధకం రాకుండా చూచుకోవటం అవసరం

కొందరికి హార్మోనుల ప్రభావం వల్ల రజస్వల కాకపోవటం జరగవచ్చును

ఓవరీలలో ''ఓవం' (స్త్రీ బీజం) ఉత్పత్తి అవుతూ ఉంటే రజస్వల కాక పోయినా పిల్లలు పుట్టే అవకాశం ఉంటుంది

పి యు కె – నక్కలపల్లి

నా వయస్సు 20 సంవత్సరములు నాకు మయోపియా కంటి జబ్బు ఉన్నది దృష్టి రోజ రోజుకీ మందగిస్తున్నది మూడు సంవత్సరముల క్రితం –3 5 పవర్ లెన్సు వాడితే ఇప్పుడు – 6కు పెరిగింది యిలా ప్రతి సంవత్సరమూ పెరుగుతూ వున్నది నాకు పగలు కంటి రాత్రి వస్తువులు మసకగా కనిపిస్తున్నాయి

మీరు వెంటనే నిపుణులైన నేత్ర వైద్యులకి చూపించ వలసి ఉంటుంది కెరటో కోనస్ అనే నేత్ర రోగం ఉన్నప్పుడు ఇలా వెంట వెంటనే పవర్ పెరిగే అవకాశం ఉంటుంది

'మయోపియా' ఉన్నవారికి రాత్రిపూట వస్తువులు మసకగా కనిపిస్తాయి

కె ఎల్ – నర్సీపట్నం

మా అమ్మ వయస్సు 45 సంవత్సరములు అమెకు ఒక సంవత్సరము నుండి ఒళ్ళు దురదలుగావుంటున్నవి ఎన్ని మందులు వాడినా తగ్గుటలేదు చర్మ వ్యాధుల నిపుణులు ఫైన్‌లోన్ క్వాడెర్మ్, లివర్ కార్టు అయింట్ మెంటులు వాడమన్నారు అవి వాడినన్ని రోజులు కొంత తగ్గినట్లుగా వుంటుంది వాడక పోతే మళ్ళీ మామూలుగా వస్తున్నది ఈ దురదలు శాశ్వతంగా తగ్గే మార్గం తెల్పండి

కాల్షియం మాత్రలు, విటమిన్ 'సి' మాత్రలు, క్లోర్ ఫెనిరమిన్ మాలియేట్ మాత్రలు వైద్యుల సలహా ప్రకారం వాడండి సీరం కాల్షియం బిలురుబిన్ పరీక్ష, లివర్ ఫంక్షన్ టెస్టులు చేయించి ఫలితాలను వైద్యులకి చూపించండి □

బించెను కళాశాలలో సంస్కృత శాఖ తీసికొనెను అదివఱ కతనికి భాగవతము మీద ప్రీతి ఇప్పుడు భారతము చదువ మొదలుపెట్టెను ఒకనాడు రాత్రి భోజనము చేసి పండుకొని లాంతరు తలగడ వద్ద ఉంచి అరణ్య పర్వములో చివర సావిత్ర్యుపాఖ్యానము చదువుచుండెను చదివినకొలదియు అతని కెట్టెప్రగ్గడ పోకడ క్రొత్త రుచులు చవిచూపెను పోతన్నగారి మార్గము వేరు పోతన్నగారు కథ చెప్పు తీరు వేరు చంద్రవంశపు రాజుల యితిహాసములో తారా శశాంకుల కథ, పురూరవ శ్చక్రవర్తి కథ - యివి చదివినకొలది అతని కానందముగా ఉండెడిది 'ఒక వేయి తలలతో ఉండు జగన్నాధుని బొడ్డు తమ్మిని బ్రహ్మ పుట్టెమొదల అని అరంభించిన హస్తమమృత మయమనిపించెను కథలో ఒక చోటి నుండి ఒకచోటికి దూకుట చమత్కారము తోడి మాట్లాడించుట, బ్రహ్మ అన్న మాటలు, బుధుడన్నవి, పురూరవసుని ఊర్వశీ సంవరణము, వారికేళి, అమె నింద, అతని విరహము - పూర్వము ధర్మారావునకు సారస్వత శిరోరత్నము లనిపించెను ఇప్పుడు కాకపోలేదు ఇది ఒక క్రొత్తదిగా నున్నది కథ దాటించుటలేదు నెమ్మదిగా అన్ని విషయములను వరుసగా చెప్పుటయే, చెప్పుటలో కుదించి చెప్పుట ఈ సమాసముల కూర్పు వేరు ఈయన ఏరుకొను శబ్దములే వేరు ఎక్కడివో సన్నని మాట లేటి కూర్చినట్లున్నది

చివరకు పోను పోను సావిత్రీ యమధర్మరాజుల సంభాషణము రమ్యాతిరమ్యముగా ఉండెను అమె పొగడ్తలు విచిత్రముగ నుండెను 'యముడంద్రు నిన్ను నార్యులుయమింతు భూతముల గాన నట్లనుట దగున్, శమనుండవైతి కల్మష శమనంబున చేసి నీవు జలజాప్తసుతా' వేద ఋక్కువలెనున్నది యీ పద్య భావము

నామరూపాదులన్నియు క్రియా జన్యములు అందులో సర్వ దేవతలకును వారి వారి క్రియా హేతువులై అయా మహాత్ముల అధికారములు, నామములు కలిగెను ఇది పూర్వ ఋషులు దర్శించిరి అవి గుంపించిరి మరల ఈనాడు సావిత్రి ఆ తత్త్వ మెరిగినదయ్యెను సృష్టి రహస్యమంతయు బీజ రూపముగా అమె మనస్సునందు నిలిచెను ధర్మారావేల సంతోషించకుండును? క్రమ క్రమముగా అమె మీద ధర్మారావునకెట్లు ప్రేమ పుట్టినదో అది ఎట్లు వ్యక్తపరచెనో! అమె, భగవంతుడైన అతడిచ్చిన చనువెంత సొగసుగా ఉపయోగించుకొనెనో! ఒకసారి కన్న ఒకసారి అమె మాటాడిన మాటలలో అది ఎంత కనపడెనో చదివినకొలదియు అతనిని వివశుని చేసెను ఇట్టి రచన అతడది వరకు చూడలేదు అహా! కవిత అనగా ఒక పద్యము వ్రాయుటలో లేదు ప్రతి పద్యము అంత సొగసుగా వ్రాసి కావ్యమునంతయు ఒక విచిత్ర సూత్ర వ్యాప్తిగా తత్సూత్రమనేక పుష్ప శోభితము చేయు కావ్యము ఇట్టిదనియు నిర్ణయించలేక మనస్సులో ఉయ్యేలలూగు

చుండెను క్రొత్తగా అతని మనోభావము విస్తరించుచుండెను ఆ విస్తరింపు అతడొదిగించుకొనలేక త్రిప్పలు పడుచుండెను కాలము కడచినగాని ఆ భావములతని హృదయములో స్థిరపడియెుదుగవు.

ఆ కళాశాలలో ఒక ఉపాధ్యాయుడుండెను అయన రంగు వేసిన అడ్డ చారలు గల గుడ్డ తలపాగ చుట్టి, ఒక నల్లని కోటు తొడిగి వచ్చుచుండెను మనిషి పొడుగుగా ఉండును పిల్లలతనిని పాములవా'డని వేళాకోళము చేయుచుందురు ఒకనాడు తరగతిలో కూర్చుండగా ఒక కుర్రవాడల్లరి చేసెను అయన బుడబుక్కల వానివలె ఏమిటి ఆ అల్లరిఅనెను వాడు మరి పాములవాండ్రకు బుడబుక్కల వారికి సరిపోయినది అనెను అయనకు కోపము వచ్చి ఈ క్లాసంతయు ఫూల్సు గాడిదలు, బుద్ధిలేనివారు అని విజృంభించెను దానితో తక్కిన వారందరూ ఎదురు తిరిగిరి వారందరు అయన క్లాసునకు పోరాదని కట్టుకట్టిరి. ఇది బి ఎ మొదటి తరగతిలో జరిగెను ఆ కాలేజీలో బి ఎ అపుడు క్రొత్తగా పెట్టిరి కట్టు కట్టినను కొందరు క్రైస్తవ



## విశ్వనాథ పాఠం

శుచిముఖి = ప్రభావతీ ప్రద్యుమ్నము" కావ్యములో ఒక పాత్ర

శయ్య = పదముల పరస్పర మైత్రి

ప్రభావతి = ప్రభావతీ ప్రద్యుమ్నము

పింగళివారు = పింగళి సూరన్న

కూలచ్ఛేదము = గట్టు కోయుట

పిచ్చుకుంటు = కాళ్ళు లేనివాడు

సంవాహనము = ఒత్తుట

విద్యార్థులును కొంద రుపకార వేతనము గ్రహించుచున్న వారును కళాశాలకు రానే వచ్చిరి ఆ ఉపాధ్యాయుడధ్యక్షునితో ఫిర్యాదు చేయగా అయన రాని వారందరకు శిక్ష విధించెను వారు తక్కిన క్లాసులకు కూడ పోకుండ కట్టు కట్టిరి అట్లు మూడు దినములు కడచెను ప్రిన్సిపాలు వీరిని మరియు శిక్షించు మార్గములు తక్కిన ఉపాధ్యాయులతో కలసి అలోచించుచుండెను విద్యార్థులకు ముందు మార్గమేమియు తోచలేదు ధర్మారావునకు ఇందులో ఎక్కువ జోక్యము లేక పోయినను తక్కిన వారితో అతడు కూడ పాఠశాల మానెను

తాను రాణిగారి దనముతో చదువుచు అమె అనుమతి లేకుండ మానవచ్చునా అని ధర్మారావు విచారించుకొనెను మాననిచో తోడివారతనిని పిఱికివాడని ద్రోహిఅని ఎత్తిపొడుతురు తక్కిన విద్యార్థుల వైపునుండి చూచినచో
మానకుండుట శోచనీయము కళాశాలా శిక్షాపద్ధతి నుండి చూచినచో మానుట మంచిదికాదు కళాశాల విద్యార్థులు పెద్దమనుష్యులు వారిని ఏమియు అనరాదనియు అధికారులు సూత్రించినదే కదా! ఆ సూత్రములు పది చోట్ల పది రకములుగా ఉన్న వేల? ఈ పాఠశాలలలో అన్న పేరే చిత్రము దానియర్థ మిదమిత్థమని నిర్ణయించరాకున్నది అది అధికారుల బట్టి మాఱుచుండును ఒక చోట ఊపిరి పీల్చుట తప్పు ఒక చోట ఏదియు తప్పుకాదు విద్యార్థుల బ్రతుకులు ఉపన్యాసకుల చేతులలో ఉన్నవి

ఆ మరునాడును పాఠశాలకు పోవుట మానిరి ఇంతలో కళాశాలాధ్యక్షుడు మాట్లాడుటకు రమ్మని జట్టు నాయకులకు కబురంపెను వారు వెళ్ళిరి రెండునాళ్ళు రాయబారములు జరిగినవి సంధి కుదిరినది యథా ప్రకారముగా గదులు నిండినవి

ధర్మారావునకీ, చదువులు,ఈ నాటకములును పరిహాసాస్పదములుగ ఉండును. కాని జీవనోపాధికీ రోజులలో వేరొక మార్గము తోచలేదు చదువు చుండెను

మరునాడు ప్రభావతీ ప్రద్యుమ్నము తెచ్చెను ఆ రాత్రి అది పఠించెను కళాపూర్ణోదయ మన్న చెప్పరానంత గౌరవముండెడిది ప్రభావతి చదివిన తరువాత కళా పూర్ణోదయము మీద చాల గౌరవము తగ్గెను కల్పన కళాపూర్ణుని కథలోనిదే చాల కష్టమైనది కాని శయ్యయు పద్య రచనా నైపుణియు, శబ్దము లేఱుకొనుశక్తియు, పలుకుబడియు ప్రభావతిలో పరమోత్కృష్ట దశయందున్నవి పూర్ణమున పద్యములు దారాశుద్ధిగా నడచును ధారాశుద్ధి కళా ప్రాథమికులయిన కవులయందు గోచరించును కవిశయ్య పరిపక్వమైన కొలది పద్యమందు కుదింపు హెచ్చును పెద్ద భావము కొద్ది మాటలలో జెప్పుటకు ప్రయత్నించును శక్తిమంతములయిన మాటలేఱుకొనును. ఉపశ్రుతి నిక్షేపించుట, కథ దాని మీద నిర్మించుట

శుచిముఖి సృష్టియు అద్భుత రామణీయకముగా ఉన్నవి శుచిముఖి మాట నేర్పు ప్రౌఢమైనది సవతి పోరు ఘటించుటకు అంకురార్పణంబిది ఓహోహో ఏ బందు వ్యూహం బంతయు వచ్చినట్లయ్యెను "ఖాయైన కొంతమేల్మా రాయణ నీ మనముకంటి ఇట్టి ముద్దారు పలుకులన్నియు శుచిముఖి పలుకుబడి ముందు దివిటీ ముందు దీపములట్లయ్యెను ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రణయ కోపము గోత్ర స్ఖలనము ప్రద్యుమ్నుని రసజ్ఞత దర్మారావునకు రసమును పుక్కిలింతలను తెచ్చెను అట్టి భాగములు నేటి కసభ్యములుగా అగుచున్నవి

గాఢమైన శీలము చచ్చిన కొలది ప్రాణములు ప్రతి సంగతిలో లోతులు వాంఛించవు పై పై మెరుగులతో తృప్తిచెందును అదియే నాగరకత అని విఱ్ఱవీగును అతని మనస్సులో ప్రబావతికి సాంధ్ర సారస్వతమున పట్టాబిషేకమైనది నాల్గునాళ్ళు ప్రబావతి అతనిని వెన్నాడెను

ఆశీర్వాదము ను క్రైస్తవ విద్యార్థి - తన సహపాఠి షేక్స్పియరు కన్న సృష్టిలో గొప్పవాడుండడు అని ఒకనాడు వాదించెను ధర్మారావు పింగళివారి తరఫున వాదించెను అతడొప్పుకొనలేదు

దర్మా సృష్టిలో లేదేమిటి? సృష్టిలో నీకే మూల తెలియును? కాళిదాసు కన్నకవి లేదని మీ పాశ్చాత్యులు ఒప్పుకొనినదే అంత సులువుగా లేదని, ప్రపంచకములో లేదని అనుట యింగ్లీషుతో వచ్చిన గోల పత్రికలలో చూడలేధా! ఎవరో పెద్ద యాత్రగానిని వస్తాదును, కవిని తీసికొని వారు పాశ్చాత్య దేశములో బెద్దవారయిరా ప్రపంచక మంతలో వీరే అనునది యూరోపే కాక ప్రపంచమున్నది అచ్చట ఏ విద్యలోనైన అదికాధికులు గలరు యూరోపే ప్రపంచము కాదు అట్లనుట విశాల బావము లేకపోవుట ఏమో అనిపించుచున్నది తరువాత నీ యిష్టము

అతడు మనమిద్దఱ మీ విషయమున కలియము అసలు ప్రదానాంశమందే మన యిద్దఱకు కలియలేదని వెడలిపోయెను ఇట్టి మరికొన్ని ప్రసంగముల చేత ధర్మారావునకు పూర్వాచార పరాయణుడనియు తర్కమునకు నిలువడనియు సాటి వారలలో పేరు వచ్చెను అతడేమి చేయును?

ఒక పాఠ్య గ్రంథములో పాశ్చాత్య నాగరకతను గూర్చి వివేకానందస్వామియో ఎవరో వ్యతిరేకముగా వ్రాసినదున్నది అది బోధించువేళ క్రైస్తవ విద్యార్థులందరకు కోపము వచ్చి ఆ పుస్తకము చించి కాళ్ళతో మట్టించిరి అది హైందవులకు కోపహేతువయ్యెను వారికి వీరికి బెడిసిపోయి అదికారుల వఱకు పోయెను హైందవ విద్యార్థులు మఱల కట్టు కట్టిరి అధ్యక్షుడు వారందరను శిక్షించెను వారందరు వచ్చి ధర్మారావును సలహా అడిగిరి ధర్మారా విట్లు చెప్పెను మనము వారి కళాశాలలో చదువుకొనుచున్నాము కాన వారి యిష్ట ప్రకారమే నడువవలయును జరిమానా లిచ్చి రేపటి నుండి కళాశాలకు నడువుడు చదువు మానరు కదా మఱి

ఒకడు ఏమండీ! వారు ప్రతి దినము మన మతము గూర్చి నిందించుట లేదా? మన ఆచారములు బాగుండుట లేదని వారు మాత్రము వాదించుటలేదా?

ధర్మా, ఇక్కడ ఎవరిని అడిగెదవు? మన ఆచారములు చెడ్డవని మనవారే నిందించు చుండగా మనమందఱము వారినే ప్రతి విషయమున అనుకరించుచుండగా వారిఆచారములే గొప్పవని రుజువగుచున్నవి అయినను నీ చేతిలో అదికారమున్నచో నీ మాట సాగును అధికారము వారిచేత ఉంచి నీవు వృధా వాగ్వ్యయము చేసినచో ఏమి లాభము? నీ కుద్యోగము కావలసినన్నాళ్ళు వారిని అనుసరించనే వలయును ఆలోచించుము ఎదిరించి నీవేమైనను చేయగలవా? కలిగినచో రేపు వారు నీ మాటయే విందురు. మీరందఱు రేపటి నుండియు చదువు మానెదరా? అప్పుడు వారు మీ దగ్గరకు వచ్చి బతిమాలుదురు చెప్పుడు!

ఎవరును మాటాడలేదు అయువుపట్టు చూచి నొక్కుచున్నా రని తలచి ఎవరి దారిన వారు పోయిరి.

ఒకనాడు ప్రొద్దుననే లేచి ధర్మారావు స్నానము చేసి ఉతికిన బట్టలు తాల్చి, జేబులో ఒకరూపాయి వేసికొని రైలుస్టేషనుకు వెళ్లెను అచ్చట ఒక పొట్టివాడు నల్లనివాడు బక్క పలుచనివాడు వివేకవంతమయిన మొగము కలవాడు ఇతనికై ఎదురు చూచుచుండెను. అతడు రైలు వచ్చినది టికెట్లు నేనే కొన్నాను రా పోద మనగా ఇద్దరును రైలెక్కిరి రైలు ఫిరంగిపురము వద్ద దిగి కొండవీడు ఖిల్లాకు మార్గము అడిగి ఆ దారి పట్టిరి అంతవఱకు ధర్మారావు మాట్లాడలేదు పైరుగాలి తగిలినంతనే అతని ఆత్మ సహజ ప్రకృతిని అవలంబించెను అతడు పసివాని వలె చేని గట్లవెంటనే పరువెత్తుటయు ఏ మొక్క కనపడిన ఆ మొక్క కొరుకుటయు, మన్ను యధేచ్ఛముగ తీసికొని చేతులలో ఉంచుకొని పాఱవేయుట చేయుచుండెను అమితోత్సాహమున ఉండెను దారివెంట పద్యములు పాడుచుండెను జాము ప్రొద్దెక్కెను

రాఘవరావు ఒయ్యోయి ధర్మా! మనకివ్వేళ కూటి ప్రాప్తిలేదు

ధర్మా ఈ పల్లెలో సెనగపప్పు, బెల్లము కొనుము తించుపోదము కొండమీద చెరువున్నదన్నారు కదా!

రాఘు మనవాండ్రిద్దరు కూడ ఉండినచో ఎంత బాగుండెడిది? వారు లేకపోవుట వల్ల సగము సరదా చచ్చిపోయినది

(ఇంకా ఉంది)

# శ్రీ చెరుకూరి పూర్ణచంద్రరావు కాలధర్మం

విజయా పిక్చర్స్ అదినేత, ఆంధ్రపత్రిక, అమృతాంజన్ సంస్థల డైరెక్టర్‌లలో ఒకరు అయిన శ్రీ చెరుకూరి పూర్ణచంద్ర రావు (80) జూన్ 7వ తేదీన మదరాసులో కన్నుమూసారు ఆయనకు బార్య శ్రీమతి రామతులశమ్మ కుమారులు శ్రీ భాస్కరరావు శ్రీ హరినాదబాబు కుమార్తె శ్రీమతి సీతారామమ్మ ఉన్నారు

శ్రీ పూర్ణచంద్రరావు కృష్ణాజిల్లా పెరిశేపల్లిలో రైతు కుటుంబంలో జన్మించారు 1949లో విజయవాడలో విజయా ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్ పేర చలన చిత్ర పంపిణీ సంస్థని నెలకొల్పారు తర్వాత దానినే విజయా పిక్చర్స్‌గా మార్చారు విజయా వారి షావుకారు చిత్రాన్ని తమ పంపిణీ సంస్థ మొదటి చిత్రంగా విడుదల చేసారు నాటి నుంచి నేటి వరకూ విజయావారి చిత్రాలన్నిటికీ విజయా పిక్చర్స్ వారే పంపిణీ దారులుగా ఉన్నారు ఎ వి యం సంస్థ నిర్మించిన చిత్రాలలో కూడా చాలా వరకూ విజయా పిక్చర్స్ వారే విడుదల చేశారు

శ్రీ పూర్ణచంద్రరావు ఆంధ్రప్రదేశ్ చలన చిత్ర వాణిజ్య మండలి అద్యక్షులుగా పని చేసారు



శ్రీ పూర్ణచంద్రరావు గారి భౌతిక కాయానికి జూన్ 8వ తేదీన విజయవాడలో అంత్యక్రియలు జరిగాయి ఫిలిం పరిశ్రమకి చెందిన పలువురు ప్రముఖులు బంధు మిత్రులు సంస్థల సిబ్బంది ఆయన భౌతిక కాయానికి శ్రద్ధాంజలి ఘటించి వారి కుటుంబానికి తమ సంతాపాన్ని, సానుభూతిని వ్యక్తం చేసారు □

# ఇదీ అదేనా?

## ఇల్లిందల సరస్వతీదేవి

రఘురామ్ ఆ రోజు ఆఫీసులో కూర్చోలేక స్కూటర్‌మీద ఇంటికి వచ్చి బజర్ నొక్కాడు కాని తలుపు తెరుచుకోలేదు

అతడికి తల నొప్పి విపరీతంగా వచ్చి అక్కడే ఒక మాత్ర వేసుకుని కాఫీ తెప్పించుకుని తాగాడు కాని–కుర్చీమీద కూర్చోలేక ఆఫీసరుకు చెప్పి ఇంటికి వచ్చాడు

ఎంతసేపటికీ తలుపుతెరుచుకోకపోతే విసుగు పుట్టి ఇటూ అటూ చూశాడు అది మూడవ ఫ్లోరు ఫ్లాట్ అందరూ తలుపులు మూసుకుంటారు కాని తెరిచిపెట్టుకోరు అతడికి అకస్మాత్తుగా మనసుకు తట్టింది–తన దగ్గర ఒక డూప్లికేట్లు తాళంచెవి జేబులో ఉండాలని వెంటనే తలుపు తెరుచుకొని మళ్ళీ లాక్‌చేసి మంచంమీద వాలిపోయాడు కొంతసేపటికి నిద్రకూడా పట్టింది

అతడు మామూలుగా ఐదున్నర లేక ఆరు గంటలకు ఇంటికి వస్తాడు కాఫీ తాగి టి వి చూస్తూ కబుర్లు చెప్పుకుంటూ ఎనిమిది గంటలకు భోజనం చేస్తారు రఘురామ్, ప్రతిమలు

అందుకే ప్రతిమ షిఫాన్ చీర కట్టుకుని పర్సు ఊపుకుంటూ వచ్చి తలుపు తాళం తీసింది తలవంచుకునే డ్రెస్సింగ్ రూములోకి వెళ్ళి చీర మార్చుకుని కాఫీ తయారు చేయటానికి వంటయింట్లోకి వెళ్ళింది కాఫీ తయారవుతుండగా రాత్రి వంటకు కూరలు తరిగిపెట్టుకుంది

చేతి గడియారం చూసుకుంటే ఐదున్నర దాటింది ఇంక రఘు వస్తాడనుకుంటూ బెడ్‌రూమ్‌లోకి వచ్చిన ప్రతిమ పక్కమీద పడుకున్న రఘును చూసి తెల్లబోయింది

ఎప్పుడు వచ్చారు? రాగానే పడుకోవటమేమిటి?

అతడిని లేపింది కళ్ళునలుపుకుంటూ లేచాడు

టైమెంత?

మీ చేతి గడియారం ఉందిగా? ఆరు గంటలయింది ఇంకా యింటికి రాలేదేమో అనుకుంటున్నాను

నేను రెండు గంటలకే ఇంటికి వచ్చాను

నేను ఫస్టు ఫ్లోరులో కుసుమ వచ్చి పిలిస్తే వెళ్ళాను అప్పటికి ఒకటిన్నర

నాకు తల నొప్పిగా ఉంటే సెలవుపెట్టి వచ్చేశాను ఫాను వేసుకున్నాను నిద్రపట్టింది .

కాఫీ తాగండి బడలికపోతుంది

ఇద్దరు బల్ల దగ్గరికి వెళ్ళి రెండు బిస్కట్లతో కాఫీ తాగారు భోజనాల తరువాత హిందీ కథ చూపించారు టీ. వి లో కట్నాలమీద ఆఫీసుతో ఐదువేలు డిపాజిట్ కట్టాలని కథా నాయకుడు తండ్రిని అడుగుతాడు కట్నం బాపతు డబ్బు మామగారిని అడగమని తండ్రి సలహాయిస్తాడు మా నాన్న యిచ్చే స్థితిలో లేడని భార్య అనగానే తల్లిదండ్రుల ప్రోద్బలంతో కథానాయకుడు భార్యమీద కిరోసిన్‌పోసి అగ్గిపుల్ల గీస్తాడు

అబ్బబ్బ ఎప్పుడు టీవీ పెట్టినా ఇవే నాటకాలు పేపరు తెరిస్తే ఇవే కథలు–ఇవే వార్తలు విసుగుపుడుతోంది అతడు టివీని మూసేసి మళ్ళీ పక్కమీద వాలిపోయాడు

ఇది జరిగి వారం రోజులయిందో లేదో ఒకనాడు రఘు ఇంటికి వచ్చాడు ఆనాడు ఫైల్సు యింటికి తీసుకువచ్చాడు ఆఫీసులో పనికావటంలేదు ఎప్పుడూ ఎవరో విజిటర్సే ఎద్దడి. ఫైల్సు మూసి మాట్లాడి పంపించటంతో అవి తరగటంలేదు

ప్రతిమ ఇంట్లో లేనట్టుంది డూప్లికేట్‌తో తలుపు తెరుచుకొని లోపలికివెళ్ళాడు వాటిని బల్ల మీద పడేసి, కాఫీ కలుపుకు త్రాగాడు, కిటికీలో నుంచి చల్లటి గాలి వీస్తోంది ఫైల్సు చూసుకుంటు న్నాడు

ఆనాడు ప్రతిమకు ఆరు గంటలయింది యింటికి రావడానికి గబగబా తలుపు తీసింది ఎదురుగా ఫైల్సు చూసుకుంటూ రఘు కనబడ్డాడు

మాట్లాడకుండా వంట యింట్లోకి వెళ్ళి ఖాళీ కాఫీ కప్పు చూసినా మళ్ళీ కాఫీ కప్పుతో వచ్చి తీసుకోండి అన్నది,

అతడు మాట్లాడకుండా తీసుకున్నాడు ఆమె కూడ మాట్లాడకుండానే లోనికి వెళ్ళిపోయింది

ప్రతిమకు పక్క బిల్డింగులో ఉన్న కల్పనతో అనుకోకుండా స్నేహమయింది. మొదట ప్రతిమ యింటికి కల్పన తన అన్న రమేష్‌తో టెలిఫోను కోసం వచ్చింది. అతడు మొహమాట పడుతూనే టెలిఫోను చేసుకున్నాడు అలా మూడు నాలుగు సార్లు టెలిఫోన్లు చేసుకుని ఆమెను తమ యింటికి రమ్మని పిలిచారు వాళ్ళకూ, ప్రతిమకూ అనుకూలమైన సమయం మధ్యాహ్నం పన్నెండు నుంచి నాలుగు గంటల వరకు మొదట కబుర్లతో ప్రారంభమైన సమావేశం క్రమంగా పేకముక్కలాటగా మారింది ముగ్గురితో ప్రారంభమైన పార్టీ ఐదూ ఆరూ మంది వరకూ పెరిగింది అందులో ఇద్దరు మగవాళ్ళు–రమేష్ కాక

అబ్బ ఆట విసుగుపుట్టకుండా వుండాలంటే మధ్యమధ్య స్నాక్సు డ్రింక్సు వుండాలి అన్నాడు మహేంద్ర.

ఒక రోజు రమేష్ తెప్పించాడు రెండో రోజున మహేంద్ర తీసుకునే వచ్చాడు మూడవ అతడు పాపం పర్సు లేనివాడు స్నాక్సు, డ్రింక్సు బిల్లు క్రమంగాముప్పైనుంచి ఏభయికి పెరిగింది

ఆడవాళ్ళ కభ్యంతరమయితే తీసుకోకండి అన్నాడు మహేంద్ర ఒకవిధంగా ప్రోత్సహిస్తున్నట్టూ రెచ్చగొట్టుతున్నట్టుగా

ఆ మాట అత డనగానే ముగ్గురు ఆడవాళ్ళకూ రోషం వచ్చింది మేమేం తక్కువ? మేమూ మీతో సమానంగా తీసుకోగలం అంటూ పోటీబడ్డారు

ఒకరోజు మహేంద్ర డబ్బుపెట్టి ఆడితే మజాగాని–ఇదీ ఒక ఆటేనా? చప్పగావుంది అన్నాడు

పాపం ఆడవాళ్ళను వదిలిపెట్టరా? మూడవ అతను

మేమేమంత డబ్బుల్లేకుండా ఏడుస్తున్నామా? అన్నారు మహిళామణులు

మాకూ స్వాతంత్ర్యం వుంది మా కిష్టం వచ్చిన ఖర్చులు మేమూ పెట్టుకోగలం అన్నారు

అప్పటి నుంచే ఆట రంజుగా సాగుతూ వచ్చింది ఏమీతోచదంటూ విసుక్కునే ప్రతిమలో కూడా ఉత్సాహం పొంగులు వారుతున్నది చాలా సంతోషంగా వుంటోంది. రఘురామ్ ఆఫీసు నుంచి ఆలస్యంగా వస్తే ఇదివరలో కోపగించుకునేది ఇప్పుడు ఆలస్యంగా వస్తే బాగుండుననుకుంటోంది

అక్కడికి మూడు ఫర్లాంగుల దూరంలో ఒక కాంటీను వుంది ఆ కాంటీను అన్ని రకాల డ్రింక్సూ టిఫిన్లూ భోజనాలూ కూడా సప్లై చేస్తుంది చీటీరాసి పంపిస్తే, కాంటీను బాయ్ తీసుకు వస్తాడు

రోజులు ఆనందపారవశ్యంలో గడుస్తున్నాయి ముగ్గురు మహిళామణులు కూడా బిల్లును పంచుకుంటున్నారు

ప్రతిమ తనకు యింటి ఖర్చులకోసం రఘురామ్ యిచ్చిన డబ్బులో ఇటుదిటూ అటుదిటూ సర్ది బిల్లులు కడుతోంది నలుగురిలో చిన్నతనమని పించుకోవటం ఆమె కిష్టంలేదు ఇంటి ఖర్చులతో పాటు ఈ పై ఖర్చులు ఆట ఓడిపోవటాలతో ఎక్కువయ్యాయి ఒకసారి వేలి వుంగరం–మరొక సారి చేతిగాజు–ఇప్పుడు ప్రాణ మ్మీదికి వచ్చింది బిల్లు ఏది అమ్మాలి? మెడలో నల్లపూసల హారమా?

ఆమె కేటూ తోచటంలేదు అందులో మరొక బాధ–చెందేరి చీరలవాడు డబ్బుకోసం వస్తున్నాడు ఇచ్చేటప్పుడు బ్రతిమిలాడి ఉన్నప్పుడే యివ్వండి అంటూ యిచ్చిపోయాడు ఇప్పుడు ప్రతిరోజూ వస్తున్నాడు డబ్బుకోసం

ఏం చెయ్యాలి?

పార్టీకి వెళ్ళకుండా వుంటే? ఆమాట అనటానికి తనకే అవమానం ఒకవేళ ధైర్యం తెచ్చుకుని అన్నా–బాకీలు చెల్లించి వెళ్ళమంటారు అదింకా అవమానకరం

ఆమెకు పార్టీలో కూర్చున్నంతసేపూ ఉత్సాహంగా ఉన్నట్లే వుంటుంది కాని ఇంటికి వచ్చిన తరువాత ఎక్కడలేని భయమూ పుట్టుకొస్తోంది.

రఘురామ్ మామూలుగా ఆఫీసు ఫైల్సు చూసుకోవటమూ తన రొటీన్ ప్రకారం ఆఫీసుకు వెళ్ళటం, ఇంటికి రావటమూ ఎప్పుడైనా భార్యను తీసుకుని షికారు కెళ్ళటమూ—అంతే

ప్రతిమకు పార్టీలో ఎత్తిపొడుపులు ఎక్కువైనాయి

ఏమండీ మీవారు ఏమయినా బాధపెడుతున్నారా? ఏమిటండీ—ఈరోజుల్లో కూడా భర్తలకు భయపడటమేమిటండీ?? అయినా చూడండి విదేశాలలో స్త్రీలు యింటిపని చేసినందుకు జీతాలడుగుతున్నారు మీరు చేసే పనికి ఎంత జీతమిచ్చినా చాలదు మీరు ధైర్యం తెచ్చుకోవాలి

అసలే రోషము గల ప్రతిమకు ఆ మాటలు రోజూ వింటుంటే నిజమనిపించటం మొదలు పెట్టింది

ఆ నెలలో అతడు ఇంటి ఖర్చులకని ఇచ్చిన డబ్బుతో చెందేరి చీరల వాడికి సగం బిల్లు చెల్లించింది కొంత వరకూ కాంటీన్ బిల్లు చెల్లించింది ఇప్పుడు కాంటీనుబాయ్ బిల్లు కోసం తిరుగుతున్నాడు అప్పటికా గండం గడిస్తే చాలని రెండు రోజుల తరువాత రమ్మనమంది

రెండు గంటలకు మామూలుగా రఘురామ్ ఇంటికి వచ్చేసరికి ప్రతిమ లేదు తాళం తీసుకుని లోపలికి వెళ్ళి గ్లాసెడు మంచినీళ్ళు తాగాడు ఎందుకో ఆ నాడతడికి వక్కపొడి వేసుకోవాలనిపించింది అల్మేరా తెరిచి వక్కపొడి నోట్లో వేసుకుని ఆ డబ్బా కింద ఉన్న కాగితం ఏమిటని చూశాడు

ఆ బిల్లు ప్రతిమారామ్ పేరు మీద ఉంది

సోడా బుడ్లు స్నాక్సు బీర్ బాటిల్స్ మొదలైన వాటి బిల్లు ఫిబ్రవరి నెలలో రు 200/-లు ఫ్లాట్ నెం పేరు సరిగానే ఉన్నాయి ఈ బిల్లు ప్రతిమకా?

అతడికి కంపరమెత్తినట్లుగా ఉంది ఆ బిల్లు చూడగానే

ఇది నిజమా?

ప్రతిమ బీర్‌కు అలవాటు పడిందా?

ఒంటరిగానా? ఎవరితో నయినానా?

ఎంత కాలం నుంచి?

డబ్బు ఎక్కడిది?

సరిగ్గా మామూలుగా వచ్చే వేళకే ప్రతిమ వచ్చింది మామూలుగా అతడిని పలకరించింది కాఫీతో పాటు టిఫిన్ చేసి పిలిచింది

మాట్లాడకుండా పెట్టింది తిని మళ్ళీ బల్ల దగ్గర కొచ్చి కూర్చున్నాడు రఘురామ్

అతడి మౌనం చూసి ఆమెకు అనుమానం వచ్చింది





## గడుసులోకం —బాబు







ఎంత సేపు చూస్తారు ఫైళ్ళు? విసుగు పుట్టటం లేదూ? చూసే వాళ్ళకే విసుగ్గా ఉంది?'

విసుగా? విసుగు పుడితే ఎలా? జీతం రావాలా ఖర్చులకు?

అందరూ ఇలాగే చేస్తారా?

అందరి చేతలకూ నేను జవాబులు చెప్పగలనా? మన యింట్లో జరిగే వాటికే జవాబు చెప్పలేకుండా ఉన్నాను గాని – ఇంక బయటి వాళ్ల సంగతా?

మనింటి సంగతా? ఏమిటది?

ఏమిటా? అల్మేరాలో పక్కపొడి డబ్బా క్రింద ఉన్న బిల్లుకు నేను జవాబు చెప్పగలనా? ఇంట్లో ఇంకా ఏమేమి జరుగుతున్నాయో నేను చెప్పగలనా?

ప్రతిమ అపరాదిలా నిలబడదలచుకోలేదు

అవును కాంటీను బిల్లు వచ్చింది

చెల్లించావా?

ఎలాగో చెల్లిస్తాను

'డబ్బు

నా కిచ్చిన దాంట్లో ఖర్చు పెడతాను ఆ మాత్రము స్వాతంత్ర్యం లేదా?

అసలు ఆ బిల్లు ఎక్కడిది? ఎప్పటిది? సందర్భం ఏమిటి?

నిలదీసి అడిగేటప్పటికి ప్రతిమ అహం దెబ్బతిన్నది మరి ఆగలేకపోయింది

ఎక్కడిదయినా – ఎప్పటిదయినా – ఏ సందర్భమయినా ఆ బిల్లు నాదే నేను చెల్లించాల్సిందే

అంటే నీ దగ్గర డబ్బేది? ఇంటి ఖర్చులకే కదా నేనిచ్చింది?

ఇంకా అడుగుతాను మీ రిచ్చి తీరాలి

నేను చాల్లా బిల్సు కట్టాలి నీవడిగినా నా దగ్గర డబ్బు లేదు

డబ్బెందుకు లేదు? పది వేల కట్నం

## ఇదీ అదేనా?

తీసుకున్నవాళ్ళు కూడా యిట్లాగే మాట్లాడతారా? బార్య డబ్బడిగితే ఇవ్వనని మొండికేస్తే ఎలా?

ఆ బిల్లులో ఉన్న బీర్ బాటిల్సుకు నేను డబ్బివ్వాలా? కట్నం బీర్ బాటిల్సు బిల్లు కోసమా?

అవ్వను తీసుకున్నప్పుడు యిచ్చితీరాల్సిందే!

మాటామాటా పెరిగింది ఘర్షణగా మారింది ఆమె పంతం తగ్గటంలేదు పార్టీలో తనకు చిన్న తనమనిపిస్తుంది అందరూ ఎగతాళిచేస్తారు నవ్వుతారు ఆ మహేంద్ర అందరికంటి చిన్నచూపు చూసి అవమానపరుస్తాడు

ఇంతకూ యిస్తారా? యివ్వరా?

నా బడ్జెట్‌లో బీర్ బాటిల్సు లేవు

ఇంతేనా?

అంతే మరి

దీని ఫలితం చవిచూస్తారు

దూకుడుగా వెళ్ళింది అక్కడనుంచి అతడను కున్నాడు పడగ్గదిలోకో లేక వంటయింట్లోకోనని

మరికాసేపటికి దబ్బుమన్న చప్పుడు వినబడ్డది రోడ్డుమీద పెద్దకేకలు

అతడు ఏమిటో చూడాలని బాల్కనీమిది నుంచి తొంగిచూశాడు ప్రతిమ తల చితికిపోయింది రక్తం వరదలైపోతున్నది

ఆ ఫ్లాట్సులో ఉన్నవాళ్ళేకాక ఆ బజారంతా పోగయింది అందులో ప్రతిమ పార్టీవాళ్ళంతా ఉన్నారు

ఎవరో పోలీసుస్టేషనుకు ఫోనుచేశారు పోలీసు వ్యాను వచ్చింది ఇన్స్పెక్టరు అడిగినమీదట నలుగురూ నాలుగురకాలుగా చెప్పారు అందులో వరకట్నం వేదింపు ఎక్కువగా వినబడ్డది

రఘురామ్ కిందికి రాగానే ఆయనే నండి భర్త అని చూపించారు

రఘురామ్‌ను ఇన్స్పెక్టరు అనేకరకాల ప్రశ్నలు వేశాడు

నాకేం తెలియదు మీలాగా నేనూ యిప్పుడే చూస్తున్నాను నా కంతా అయోమయంగా ఉంది నేను ఆఫీసుఫైల్సు చూసుకుంటుండగా పెద్ద చప్పుడయింది బాల్కనీలో నుంచి చూసి దిగి వస్తున్నాను

ప్రతిమ దేహాన్ని పోస్టుమార్టమ్‌కు పంపించారు రఘురామ్‌ను వ్యాను ఎక్కించుకున్నారు పోలీసు వారు

మళ్ళీ పోగయిన జనం ఎవరికి తోచిన మాటలు వాళ్ళు అన్నారు కొందరు వాదించుకున్నారు మొత్తంమీద అందరూ కట్నంకోసం వేదింపేనని నిశ్చయంచేశారు

రామరామ ఈ దారుణ హత్యలకు ముగింపెప్పుడో? డబ్బుకోసం వేధించి తీసుకు రాలేదని పైనుంచి తోశాడు కిరసనాయిల్‌తో కాల్చినా పైనుంచి తోసినా ఒకటేగా?

ఇంక ఆడపిల్లలు పెళ్ళిళ్ళు చేసుకోరు

యువకులను ఏంచేసినా పాపంలేదు

ఆడపిల్లకు సమానహోదా ఎప్పుడొస్తుందో?

గంటకుపైగా ఊహాగానాలు చేసిన ప్రేక్షకులు ఎవరితోవన వారు వెళ్ళిపోయారు

పత్రికలలో ఘోరమంటూ వార్తలు ఆఫీసులో రిమార్కులు బందుజాలంలో రఘూ ఇంతేనా? అనే ప్రశ్నార్థకాలు ఇచ్చిన కట్నానికి మూడింతలు కూతుళ్ళ పెళ్ళిళ్లకని డబ్బు తీసుకున్న మామగారు కూడా రఘు అఘాయిత్యం చేశాడని తిట్టిపోశాడు

రఘు చేయని తప్పుకు తల వంచుకుని గోడవైపు తిరిగి కూర్చుని యావజ్జీవ కారాగార శిక్షను అనుభవిస్తున్నాడు □

# ఆమెకి కూడా సంరక్షణ కావాలి

పొద్దున్నే టిఫిన్ చేయడం. పిల్లల్ని బడికి పంపడానికి సిద్ధం చేయడం. మధ్యాహ్నం వంట. బజారుకు వెళ్ళి సరుకులు తేవడం, యిల్లు సర్దుకోడం, కుటుంబం వారి మంచీ చెడూ చూసుకోడం.... ఇలా నాకు లేచింది మొదలు పడుకునే వరకు పనే.

అందుకే నాకు హార్లిక్స్ అవసరం.

రోజంతా చకాచకా పని చేసుకోడానికి అవసరమైన సత్తువనిచ్చే పోషకశక్తి హార్లిక్స్‌కి ఉంది. నేను సాయంకాలాలు నా కుటుంబంతో సరదాగా గడిపేందుకు అవసరమైన తాజాదనం నాకు లభిస్తుంది.



గృహిణికి శక్తినిచ్చే పానీయం

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం. పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?




మంచి పుష్టికరమైనది

HMM-9241 TEL

సీరియల్

# ప్రేమసాగరమథనం

డాక్టర్ కొత్త రవీంద్రబాబు



(గత సంచిక తరువాయి)

అందరికీ తెల్లవారినా సిరివాడలోని రాఘవ సదనమ్‌లో వున్న వ్యక్తులకు మాత్రం నిద్ర మత్తు వదల లేదు

రాఘవరావు రెండో భార్య ఇందిర కింద అంతస్తులోని ఎయిర్ కండిషన్డ్ బెడ్‌రూంలో యూఫోం బెడ్ మీద కాంపోజ్ బిళ్ళ కలుపుకు తాగిన జిమ్ టానిక్ మైకంలో మగత నిద్రలో వాలి వున్నది

రెండో అంతస్తులోని ఎయిర్ కండిషన్డ్ బెడ్‌రూంలో ఇందిర రెండో కొడుకు రంగ వళ్ళు తెలియని నిద్రలో గుర్రు పెడుతున్నాడు

మూడో అంతస్తులోని బెడ్‌రూంలో ఇందిర కూతురు రాణి హాలీవుడ్ సినిమా స్టార్ బొమ్మలు మంచంచుట్టూ వుంచుకుని నిద్రలోనే మధురాతి మధుర ప్రణయ సన్నివేశాలలో పాల్గొంటున్నట్లు కలలు కంటున్నది

నాలుగో అంతస్తులోని బెడ్‌రూంలోకి తెల్లవార బోయే ముందే వచ్చి పడుకున్నాడు ఇందిర పెద్ద కొడుకు సుందర్ కాబరే డాన్సర్ రీటాతో రాత్రంతా గడిపి ఆ అలసట తీర్చుకోటానికి యింటికి వచ్చి బట్టలన్నా మార్చుకోకుండా పడి మొద్దు నిద్ర పోతున్నాడు

నాగరాజు హడావిడిగా రాఘవ సదనమ్ లోకి అడుగిడుతూ అక్కా! అక్కా! అంటూ కేకలు పెట్టాడు

పనిపిల్ల వచ్చి అమ్మగారు యింకా నిద్ర లేవలేదు అని చెప్పగానే అతడు సరాసరి ఇందిర బెడ్‌రూంలోకి వెళ్ళాడు

అక్కా! అక్కా! బిగ్గరగా పిలిచాడు నాగరాజు

ఏమిట్రా నాగూ? అంది ఇందిర కళ్ళు తెరవకుండానే

నువ్వేమో యిక్కడ మొద్దు నిద్ర పోతున్నావు! అవతల నీ సవతి కూతురు మన రహస్యాలు శత్రువుల కమ్మి కోటీశ్వరురాలవుతున్నది!

ఆ! నిజంగానా? అంటూ లేచి కూర్చున్నది ఇందిర

అవునక్కా! నిన్న విలూ పేరుతో బాంక్‌లో ఎనిమిది లక్షలు డిపాజిట్ చేయబడింది తెల్లవారు జామున నా గోడౌన్ మీద రెయిడ్ జరిగింది!

అసి బడవా! చూస్తూ వూరుకున్నావంటరా నాగూ! పట్టుకుని తగిన పరాభవం చేయక పోయావా?

ఆంధ్ర దేశాన్ని యావత్తూ గడగడలాడించే నాగరాజు తలుచుకుంటే విలూని ఏమైనా చేయగలడు

కాని బావగారు ఏమైనా అనుకుని పోతారనీ

పిచ్చి నాగూ! అదా నీ భయం! ఆవిషయం నేను చూసుకుంటాను నీకు అపకారం తలపెట్టిన ఆ రాక్షసికి తగిన పరాభవం చెయ్యి!

అయినా మీ బావగారు డాలీ వలలో పడి పెళ్ళాం పిల్లలు యిల్లూ వాకిలీ సర్వం మర్చి పోయారు ఇప్పుడాయనకు ఎప్పుడో చచ్చిన మొదటి పెళ్ళాం కూతురు గుర్తుంటుందంటావా?

సరేనక్కా! వస్తాను! అన్నట్లు మరిచాను! రాణి ఎక్కడ?

రాణి పేరెత్తగానే ఇందిర ముఖం మాడిపోయింది క్షణకాలం మరుక్షణంలో తేరుకుని రాణి ఇంట్లో లేదు! వాళ్ళ స్నేహితురాళ్ళతో కలసి విశాఖపట్నం వెళ్ళింది అంది

నాగరాజు వెళ్ళిపోగానే మంచం మీద నుండి లేచి అస్తవ్యస్తంగావున్న చీరె సవరించుకుని సోఫాలో కూర్చుంది

ఎంత తమ్ముడైనా నాగరాజు కళ్ళు రాణి మీద పడటం ఇందిరకిష్టంలేదు

బిడ్డని దేశంలోకెల్లా కోటీశ్వరుడికిచ్చి పెళ్ళి జరిపించాలి! నా తల్లి మహారాణిలా వైభోగం అనుభవిస్తుంటే చూచి ఆనందించాలి! రాణి ముఖంలో రాచకళవున్నది! తుమ్మితే వూడే ముక్కులా స్మగ్లింగ్ వ్యాపారమూ ఒక వ్యాపారమేనా?

అబద్ధ మాడి అయినా రాణి నాగు కళ్ళ బడకుండా కాపాడుకోవాలి అనుకుందామె

సవతికూతురు విలాసినిని నాగరాజు వెంటబడి వేధించటం కళ్ళారా చూచి వూరుకున్న ఇందిర కన్నబిడ్డ రాణి విషయం వచ్చే సరికి ఎక్కడ లేని జాగ్రత్తలు తీసుకుంటుంది

తమ్ముడు యింటికి వచ్చినప్పుడు రాణి అతని కళ్ళ పడకుండా అన్ని జాగ్రత్తలు తీసుకుంటున్నదామె రాణి విశాఖపట్నం వెళ్ళిందని అబద్ధం చెప్పింది కూడా ఆవుద్దేశంతో నే!

కాని ఇందిర పడిన శ్రమ అంతా వృధా అయింది! హఠాత్తుగా మెలకువ వచ్చి కిటికీ తెరలు తీసి కిందకు చూసిన రాణికి ఎంబాసిడర్ కారెక్కి వెడుతున్న మామయ్య కనపడ్డాడు

మంచం మీద దిండ్లు పెట్టి పైన దుప్పటికప్పి గది తలుపు గడి వేసి బాత్‌రూంలో నుండి బయటకు వచ్చి మేడ వెనక మెట్ల కుండా చకచక దిగి వీధి చివరన వున్న టాక్సీ ఎక్కి నాగరాజు గెస్ట్ హౌస్ దగ్గరకు వెళ్ళిందామె

పోర్టికోలో కారు దిగుతున్న మేనమామను గేటు దగ్గర్నుండే హాయ్ రాజూ! అంటూ ఎల్లుగెత్తి కేక వేసి పిలిచిందామె!

**జరిగిన కథ - 4** నారాయణరావు తన అక్కను హత్య చేశానని, ఆమె కూతురిని ఆదుకొమ్మని కొడుకు సందీప్‌కు చెప్పి కన్నుమూస్తాడు సందీప్ విజయవాడ చేరి కోటికి పడగెత్తిన రాఘవరావు గురించి పొట్ట కూటికి సేల్స్ గరల్‌గా పనిచేస్తున్న విలాసిని గురించి తెలుసుకుంటాడు విలాసినిని సవతి తల్లి తమ్ముడు నాగరాజు వేధిస్తున్నాడని తెలుసుకుంటాడు తాను తెచ్చిన ఎనిమిది లక్షల రూపాయలు విలాసిని ఖాతాలో జమ చేస్తాడు ఆమెపై అత్యాచారం జరపబోయిన నాగరాజు మురాను చితకతన్ని ఆమెను రక్షిస్తాడు నాగరాజు ముఠా అక్రమ స్థావరం మీద పోలీసులు దాడి చేస్తారు

రాణి కేక వినపడగానే వెనుదిరిగి చూసాడు నాగరాజు

గేటు అవతల టాక్సీ గేటు వద్ద రాణి కనపడగానే అతనికి అక్క తనకు అబద్ధం చెప్పిందని అర్థం అయింది జీవితంలో ఎందరో సుందరాంగులతో శృంగార క్రీడలు నెరపిన అతనికి వాసన లేని కాగితం పూవులా అందవిహీన మైన రాణి అంటే ప్రత్యేక మైన ఆకర్షణ ఏమీ లేదు!

వయసులో వుంది మేనగోడలు - వరస వుంది విలాసిని వేటలో విసుగెత్తి నప్పుడు బోర్ కొట్టకుండా కాలక్షేపానికి పనికొస్తుంది - కాకపోతే రాణితో ఒకటే చిక్కు!

ఒంటరిగా వున్నప్పుడు నువ్వు ఫలానా హాలీవుడ్ ఏక్టరువు! ఈ పంచె లాల్చీ తీసేయ్! బేదింగ్ ట్రంక్స్ వేసుకో!

ఆ! అదీ! అలా వుండాలి లవ్ ఎట్ ఫస్ట్ సైట్ సినిమాలో హీరో హీరోయిన్ను అమాంతం ఎత్తుకున్నట్లు నన్ను ఎత్తుకుని గిరగిరా తిప్పు! అలా తిప్పుతూనే డబుల్ కాట్ వద్దకు నడువు

ఇప్పుడు అచ్చం హాలీవుడ్ హీరో సిల్వెస్టర్ స్టాలోన్‌లా వున్నావు! అంటూ మేనమామను ముద్దులతో ముంచెత్తుతుంది యవ్వనారంభంలో అదుపూ లేకుండా విశృంఖలంగా మనసును దాడి చేసే సెక్సు వాంఛలను తీర్చుకోవటానికి మేనమామను వుపయోగించుకుంటుంది రాణి!

సెక్స్ మేనియాక్‌లా ప్రవర్తించే మేన గోడలు తాకిడి తట్టుకోవటం ఆవిషయాలలో ఎంతో అనుబవం గల నాగరాజుకే సాద్యం అయేది గాదు!

అట్లని అతనికి రాణి అంటే మనసులో పూర్తిగా వ్యతిరేకత వున్నదని కాదు!



# ప్రేమసాగర మథనం

ఆయాచితంగా వస్తున్న ఆనందాన్ని కాదనే మూర్ఖుడు కాడతను! డబ్బుతో పొందగల అనుభవాలను చవి చూచి మొఖం మొత్తి గులాబి బాలలాటి విలాసిని ఎడ ఆకర్షింప బడ్డాడతను వివాహం చేసుకోకుండా ఆమె తనకు దక్కదన్న ఆలోచనతో ఓపికగాఆమెను దారిలోకి తెచ్చుకొని వొప్పించి వివాహం చేసుకోవాలని నానా అవస్థలు పడుతున్నాడు గాని ప్రయోజనం శూన్యంగా కనపడ సాగింది! ఆ శూన్యాన్ని భర్తీ చేయటానికా అన్నట్టు రాణి తన యవ్వన సహజ విశృంఖల విహారానికి మేనమామను వుపయోగించుకుంటున్నది!

మేనమామను సిల్వెస్టర్ స్టాలోన్‌గా వూహించుకుంటూ రాణి, రాణినే విలాసినిగా వూహించుకుంటూ నాగరాజు ఎదుటి వాళ్ళను మోసగిస్తున్నామని తమని తామే మోసం చేసుకుంటూ వస్తున్నారు

పరస్పర వంచనా శిల్పంతో కూడిన వారిరువురి విచిత్ర ప్రేమ సరాగం – శరీరావసరాలను తీర్చుతూ పబ్బం గడుపు కోటానికి మాత్రం పనికొస్తున్నది!

హాయ్ రాణీ! అన్నాడు నాగరాజు ఆలోచనలనుండి తేరుకుని!

పో! నేన్నీతో మాట్లాడను గాక మాట్లాడను ఇంటి కొచ్చి నా రూంకు రాలేదు సరిగదా నిన్ను చూసి వెంటబడి వస్తే పిలిచినాక ఎంతో సేపటికి గాని పలకవు! నువ్వు మంచి వాడివి కానేకాదు! నువ్వు నన్ను సరిగా ప్రేమించడం లేదు! నీతో పచ్చి! నువ్వు సిల్వెస్టర్ స్టాలోన్‌లా ఏం వుండవు

లవ్ ఎట్ ఫస్ట్ సైట్ సినిమాలో కామెడీ విలన్ జాకబ్‌లా వున్నావు!

వె వ్వె వ్వే!

ఓహ్! అదా నీ కోపం రాణి ఏది అని అక్కనడిగితే స్నేహితులతో విశాఖపట్నం వెళ్ళిందని చెప్పింది అందుకని ఇలా వచ్చాను

పో రాజూ! నీ వన్నీ అబద్ధాలు

కాదు,నిజం బేబీ!

ఈ మమ్మీ ఒకటి దొరికింది! అయినా ఆవిడెవరు నీకు అక్కయ్యే గదా!

నాకు అక్కయ్య అయితే నీకు మమ్మీ కాదా? అంటూ గెస్ట్‌హౌస్ లోపలకు నడిచాడు నాగరాజు

అతను అలసటగా సోఫాలో కూర్చోగానే వెళ్ళి అతని పక్కనే కూర్చుని అతని మీద వాలిపోతూ

రాజూ! అంటూ ముద్దుగా పిలిచింది రాణి

రాణీ బేబీ! నా మనసేం బాలేదు! అన్నాడు నాగరాజు విసుగ్గా నిజానికి అతని గోడౌన్ మీద రెయిడ్ జరుగుతున్న యీ సమయంలో రాణి తన పక్కన వుండటం యిష్టంగాలేదు

మామయ్యా! రాజు అంకుల్! నీ మనసు బాగా లేదా? నీకు మనసుంటే గదా అది బాగుండక పోవటానికి నీ మనసు ఆ డర్టీక్రీచర్ విలూ చుట్టూ ప్రదక్షిణలు చేస్తూ వుంటుంది

ఆ డర్టీక్రీచర్ ఎంత పని చేసిందో చూసావా రాణీ!

ఉహు! నాకేం తెలుసు! నువ్వింకా చెప్పలేదుగా

స్మగ్లింగ్‌లో నాకు కాంపిటీషన్‌గా వున్న ఆ సన్నీ గాడి దగ్గర ఎనిమిది లక్షలు తీసుకుని నిన్న బాంక్‌లో డిపాజిట్ చేసింది నా గోడౌన్ రహస్యాలు కాస్తా వాడికి చెప్పింది! తెల్లవారే సరికి పోలీసులు గోడౌన్‌ను రెయిడ్ చేసారు! కనీసం పాతిక లక్షల సరుకు జప్తు అయి పోతుంది పెద్ద వాళ్ళ చేతులు తడపటానికి మరి అంతకంత కర్చవు తుంది!

ఆ! దానికంత పొగరెక్కిందా! వుండు యిప్పుడే కాంతి ఎంపోరియంకు వెళ్ళి దానికి తగిన శాస్తి చేస్తాను అంటూ నాగరాజు పిలుస్తున్నా వినకుండా వెళ్ళిపోయింది రాణి

రాణి అవతలకు వెళ్ళగానే ఢిల్లీ డయల్ చేసి మంత్రిగారి పి ఏ బందువుతో మాట్లాడి రెయిడ్ వలన తన పేరు బయటకు పొక్కకుండా వుండేట్లు తనకు ఏ విధమైన కష్టం రాకుండా వుండేట్లు ఏర్పాట్లు చేయమని కోరాడు

ఆత్మరక్షణో పాయం చూసుకున్నాక అతని మనసు శత్రు శిక్షణో ద్వేగంతో నిండిపోయింది!

సన్నీగాడి కంత కొవ్వెక్కిందా! నేను కళ్ళు తెరిస్తే మాడి భస్మమై పోతాడు వీడెంత? వాడి స్మగ్లింగ్ వ్యాపారమెంత?

వీడి రహస్యాలు గుట్టుమట్టు అన్నీ వివరంగా తెలుపుతూ హైదరాబాద్ మెసేజ్ పంపుతాను

వీడి తాత గాడెవడు రక్షిస్తాడో చూస్తా! దెబ్బకు రెండు దెబ్బలన్నట్టు కోటి మురాను పంపి సన్నీగాడి మనుష్యులందర్నీ చితక బాదిస్తా!

సన్నీగాడ్ని బాగా భయపెట్టమని వీలుంటే సఫా చేయమని చెప్తా! దాంతో గాని అందరకూ నాగరాజు అంటే ఏమిటో తెలిసి రాదు అనుకుంటూ పండ్లు పటపట నూరాడు నాగరాజు

* * * *

గురూ! నాగరాజు గోడౌన్ మీద రెయిడ్ మొదలయింది! బావ యుక్తంగా అన్నాడు సాంబు

ఎప్పుడు? మనసులో పొంగి పొరలుతున్న ఆనందాన్ని అణచుకుంటూ యదాలాపంగా అడిగాడు సన్నీ కాలు మీద కాలు వేసుకుంటూ!

తెల్లవారే పాటికి హైదరాబాద్ నుండి ఎర్ర చీమలు వచ్చి పడ్డాయి

దాదాపు పాతిక లక్షలు సామాను దొరుకుతుందని అంటున్నారు

పోనీయ్! ఈ దెబ్బతో ఆ నాగులు గాడి గీర వదుల్తుంది! ఇన్నాళ్ళు ఫీల్డులో నా కెదురు ఎవరు? అన్నట్టు ప్రవర్తించాడు

పోలీసులు వాడిని అరెస్టు చేసారా?

లేదు గురూ! గోడౌన్ జాకబ్ గాడి పేరు మీద వుంది పోలీసులు జాకబ్ లాడ్జి మీద రెయిడ్ చేసేసరికే అతను సైనైడ్ మింగి ఆత్మహత్య చేసుకున్నాడు!

ఆత్మహత్యా? హత్యా? రహస్యాలు పొక్కకుండా నాగులు గాడే వాడ్ని సఫా చేయించి వుంటాడు!

ఇలాటి వాటిలో వాడిది అందె వేసిన చెయి గోడౌన్ రెయిడ్ చేసి ప్రయోజనం ఏముంది? కొండను తవ్వి ఎలుకను పట్టినట్టు పాతిక లక్షలు సరుకు జప్తు చేసినంత మాత్రాన నాగులు గాడికి పోయే దేముటుంది?

గురూ! ఎందుకయినా మంచిది! మీరు జాగ్రత్తగా వుండండి! నాగరాజు అంటే నాగుపాముతో సమానం!

ఏమిట్రా సాంబూ! సన్నీకి పిరికి మందు పోయాలనుకుంటున్నావా? నేను తలుచుకుంటే నాగులు గాడిని నామరూపాలు లేకుండా చేస్తా

ఆ క్షణంలోనే గవర్నరుపేట మ్యూజియం రోడ్డులో వున్న సన్నీ పుస్తకాల షాపు ముందు ఢాం మని పెద్ద శబ్దంతో పేలుడు వినవచ్చింది రోడ్డున వెళ్ళే వాళ్ళందరూ ఆగిపోయారు చుట్టు పక్కల యిళ్ళలోని చెట్ల మీద వున్న కాకులు బీతావహంగా కాకా అని అరుస్తూ చెల్లా చెదరుగా తిరుగసాగాయి చూస్తుండగానే పెద్ద పొగ షాపు ముందు పది గజాల వరకు రోడ్డును కమ్మి వేసింది

పొగకు ఆ చివర యీ చివర నిలబడి కళ్ళకు చేతులు అడ్డం వుంచుకుని వుండిపోయారు జనం

రిక్షాలో గాస్ సిలిండర్ తీసుకెళుతుంటే పేలింది! అన్నాడొకడు కళ్ళతో చూసినట్టు

కాదు! దీపావళి సామాను తీసుకెళుతుంటే దారిలో పేలిపోయింది!

ఎవరో బాగా శక్తివంతమైన అవుటు పేల్చారు

ఇంకెవరు! సన్నీయే అవుటు పేల్చి వుంటాడు

అవును ప్రతి సంవత్సరం కొన్ని వేల రూపాయల బాణ సంచా స్వయంగా తయారు చేసి పేలుస్తాడు

అవుట్ పేలిస్తే యింత పొగొస్తుందంట్రా వెర్రి మొఖమా! అది ఆటంబాంబు!

అవును! అందుకే అంత శబ్దం! అంత పొగ! సన్నీ ప్రత్యేకం తయారు చేయించి వుంటాడు

అదుగో పొగ తగ్గింది పదండి చూద్దాం జనం సన్నీ పుస్తకాల షాపు ముందు గుమిగూడారు అప్పటికే షాపులోని పుస్తకాలు యావత్తూ చెల్లాచెదురుగా పడిపోయాయి కొన్ని పుస్తకాలు రాక్‌లు తగలబడి పోతున్నాయి!



## రచయిత జవాబులు

ప్రఖ్యాత రచయిత, సుప్రసిద్ధ శస్త్రవైద్య నిపుణులు డాక్టర్ కొత్త రవీంద్రబాబు తమ సీరియల్ నవల ప్రేమసాగర మథనం పై పాఠకుల ప్రశ్నలకి సమాధానాలు యిస్తారు ఈ అవకాశాన్ని వినియోగించుకోదలచినవారు తమ ప్రశ్నలని రచయిత జవాబులు శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520003 అనే చిరునామాకి పంపవచ్చును వాటిలో రచయిత ఎంపికచేసిన ప్రశ్నలని, వాటికి ఆయన యిచ్చే సమాధానాలని వారంవారం ఈ సీరియల్ పేజీలలో ప్రచురిస్తాము ప్రతివారం రచయిత ఉత్తమంగా ఎంపికచేసిన ప్రశ్నని పంపినవారికి ఆయన రాసిన నవలలలో ఒకదానిని బహుమతిగా అందజేయటం జరుగుతుంది. పాఠకులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరని ఆశిస్తున్నాము —సం

నేల మీద పడి గిలగిల కొట్టుకుంటూ భయంకరంగా మూలగ సాగాడు సాంబు అతని వళ్ళు యావత్తూ కాలిపోయింది జుట్టూ కనుబొమలు కాలి చర్మం పెచ్చులూడి శరీరం వుబ్బిపోయి వున్నాడతను

సన్నీ కూర్చునే కుర్చీ కాళీగా వుంది! క్షణాల మీద నీళ్ళు బకెట్‌తో తెచ్చి సాంబు మీద గుమ్మరించారెవరో! మాడిపోతున్న వంటి మీద చల్లటి నీళ్ళు ఎడగానే ఆ షాక్‌కు సాంబు ప్రాణాలు పోయాయి

ఫైర్ యింజన్ వచ్చి ఆర్పే లోపల సన్నీ పుస్తకాల షాపు యావత్తూ మాడి మసి అయిపోయింది

రెప్పపాటులో మృత్యుముఖం నుండి తప్పుకున్న సన్నీ మనసు ముందు భయంతోను ఆ తర్వాత తీవ్ర ప్రతీకార వాంచతోనూ నిండిపోయింది

సాంబు జాగ్రత్తగా వుండమని హెచ్చరించిన క్షణంలోనే సన్నీ తన షాపుకు ఎదురుగా వున్న మేడ మీద ఒక యువకుడు నిలబడి అవుటు లాంటి దాన్ని ముట్టించటం చూసాడు

ఆ యువకుని ముఖం పరీక్షగా చూసిన సన్నీ అతను కోటిగాడని కిరాయి తీసుకుని మర్డర్లు చేస్తాడని గుర్తొచ్చింది!

అసంకల్ప చర్యగా అతను కుడి పక్కన వున్న బుక్ రాక్ ముందుకు తోసాడు బుక్‌రాక్ ముందుకు జరిగి కాళీ వచ్చింది చప్పున అందులో దూరబడి రాక్‌ను యదాస్థానంలో వుంచి ఎదురుగా వున్న తలుపు తీసుకుని షాపు పక్కన వున్న చిన్న సందులోకి వెళ్ళాడు

అతను పక్కకు తప్పుకున్న మరుక్షణమే స్మోక్ బాంబ్ వెనక కట్టిన అవుటు వచ్చి సాంబుని తాకింది

షాపంతా మంటలతోనూ బజారు పొగతోనూ నిండిపోయింది

సన్నీ క్షణం ఏమరపాటుగా వున్నా దిక్కులేని కుక్క చావు చచ్చేవాడు!

ప్రాణాలు కాపాడుకున్నానన్న సంతోషాన్ని నమ్మిన బంటు సాంబు మరణించాడనే దుఃఖం మింగేసింది ◆ (ఇంకా ఉంది)



యోగ నరసింహస్వామి ఆలయం

# తపఃస్థలి వేదాద్రి

పావన కృష్ణానది తీరం ప్రాచీనకాలం నుండి ఎన్నో ఆశ్రమాలు, గుహాలయాలకు నిలయమై తాపసిక వాతావరణం కలిగిఉంది. హిందువులే కాక, జైన బౌద్ధ ధర్మావలంబకులు కూడ ఈ నదీతీరంలో తపస్సు చేసుకున్నట్లు ఎన్నో ఆధారాలున్నాయి. కనుకనే కృష్ణవేణి తీరంలో ఆయా ధర్మాలవారు వివిధ ఆలయాలు నిర్మించుకున్నారు.

మహాబలేశ్వరం నుండి బంగాళాఖాతం వరకు మోరవ కొండ,శ్రీశైలం, ఏలేశ్వరం, శ్రీ పర్వతం (నాగార్జున కొండ), ముక్త్యాల, వేదాద్రి, అమరావతి, వడ్డమాను, విజయవాడ, ఉండవల్లి, శ్రీకాకుళం, హంసలదీవి మొదలయిన అనేక పుణ్య క్షేత్రాలు వెలసిల్లాయి. వీనిలో పౌరాణిక, సాంస్కృతిక, ఐతిహాసిక ప్రాధాన్యం కల వేదాద్రి ఒకటి. ఈ పుణ్యస్థలి విజయవాడ నుండి హైదరాబాద్ వెళ్ళే ప్రధాన రహదారిలో 'చిల్లకల్లు' అనే కూడలికి దక్షిణంగా పది కిలో మీటర్ల దూరంలో ఉంది.

## స్థల పురాణం

వేదాద్రి పంచనారసింహ క్షేత్రంగ ఖ్యాతిగాంచింది. ఇక్కడ జ్వాల, సాలగ్రామ, వీర, యోగానంద, లక్ష్మి నరసింహ మూర్తులు వెంచేసి యున్నారు. పూర్వము సోమకాసురుడనే రాక్షసుడు వేదాలను తస్కరించి సముద్రగర్భంలో దాగియుండగా, దేవతలు, మహర్షులు శ్రీమన్నారాయణుని కడకేగి జ్ఞాన నిధులైన వేదాలకు ముక్తిని కలిగింప చేయవలసిందిగా వేడుకున్నారు. అప్పుడు ఆది దేవుడయిన శ్రీ మహావిష్ణువు మత్స్య రూపమున అవతరించి సోమకాసురుని సంహరించి వేదములను తెచ్చి సత్యలోకంలో యథాస్థానంలో ఉంచాడు.

వేదపురుషుడు శ్రీమన్నారాయణునికి కృతజ్ఞాధి తన శిరమున వసింపుమని వేడగా, భక్త వత్సలు డయిన వైకుంఠధాముడు నృసింహావతారానంతరం అలాగే చేయుదునని మాట ఇచ్చాడు. తర్వాత వేదములు పావన కృష్ణవేణీ తీరంలో అద్రియై నిలువగా, లక్ష్మి వల్లభుడు జ్వాలానరసింహాకృతిలో వేదగిరి శిఖరము (వేదాద్రి)పై స్వయం వ్యక్త మయ్యాడు. ఈ మూలవరుల ప్రక్కనే పుట్ట పెరిగింది.

చుట్టూ కొండలు, అడవుల రమణీయ ప్రకృతి, కృష్ణానదీ తరంగముల ప్రశాంత వాతావరణంలో ఋష్యశృంగ మహర్షి ఇచ్చట కొంతకాలం తపస్సు చేశాడు.ఈ కొండ మధ్య భాగంలో నరసింహ స్వామి యోగరూపాన్ని ఋష్యశృంగ మహర్షి ప్రతి ష్ఠించి చరితార్థుడయ్యాడు.



స్వయం వ్యక్త జ్వాలా నరసింహస్వామి

కొంతకాలం తర్వాత సృష్టికర్త అయిన బ్రహ్మ సాలగ్రామరూపంలో ఉన్న నరసింహుని యోగ నరసింహునికి అభి ముఖంగ కృష్ణవేణి నది గర్భంలో ప్రతిష్ఠించాడు. యోగనరసింహ స్వామి పీఠము పైననే లక్ష్మీనరసింహ స్వామిని ఋష్యశృంగ మహర్షి తిరిగి ప్రతిష్ఠించి,లోక కల్యాణార్థం శ్రీవారి కల్యాణం జరిపించాడు. ఈ క్షేత్రానికి అనుబంధంగ తూర్పున 11 కిలో మీటర్ల దూరంలో గరుడాద్రిపై వీరనరసింహస్వామి వెలిసి యున్నాడు. కనుకనే ఈక్షేత్రం పంచనారసింహ క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది.

## ఐతిహాసిక ప్రసిద్ధి

వేదాద్రి ఆలయము, ప్రాకారాలు రెడ్డిరాజులచే నిర్మించబడినాయి. దాన ధర్మ దయాశీలు రయిన రెడ్డిరాజుల పాలనలో ఈ ఆలయము సకల వైభవంతో సర్వాంగసుందరంగ తీర్చబడి సర్వతో

లక్ష్మీ నరసింహాలయం





వేదాద్రి ఎడమ వైపు జ్వాలా నరసింహస్వామి వద్దకు మార్గము

ముఖాభి వృద్ధి చెందినట్లు చరిత్ర పుటలు తెల్పుతున్నాయి

వేదాద్రిని ఎర్రాప్రగడ దర్శించి స్వామివారిని మూడు రోజులపాటు సేవించి శ్రీనరసింహ స్తోత్ర దండకం పఠించి చరితార్థుడయ్యాడు ప్రముఖ వాగ్గేయకారులయిన శ్రీ నారాయణ తీర్థుల వారు ఈ పుణ్యస్థలిలో కొంతకాలం వసించి శ్రీస్వామి వారి పేర కొన్ని తరంగములు విరచించి తరించినట్లు చరిత్ర చెప్పుచున్నది కవి సార్వభౌముడయిన శ్రీనాద మహాకవి తన కాశీ ఖండం కావ్యంలో

వేదాద్రి నరసింహ విపుల వక్షస్థలీ
కల్హార మాలికాగంధలహరి

అంటూ ప్రస్తుతించాడు

ఇక్కడ లబించిన శిలాశాసనములు సామాన్య పాఠకునికి అందుబాటులో లేవు కాని వానిపై సూర్య చంద్ర అకృతులు మలచబడి ఉన్నాయి ప్రదాన అలయానికి ఉత్తరంగ చెంచులక్ష్మి అమ్మవారు ఈశాన్యంగ ద్వాదశ అళ్వారులు ఆగ్నేయంలో రాజ్యలక్ష్మి అమ్మవారు వేంచేసి ఉన్నారు

## అర్చనలు

వేదాద్రిలో శ్రీస్వామివారికి వైఖానసాగమాను సారముగా త్రికాలార్చనలు జరుగుతుంటాయి నిత్యోత్సవ పక్షోత్సవ, మాసోత్సవాలు ఎంతో వైభవోపేతంగ జరుగుతాయి ప్రతి సంవత్సరం వైశాఖశుద్ధ ఏకాదశి మొదలు పంచాహ్నికంగ శ్రీస్వామివారి తిరుక్కల్యాణము సర్వ శోబాయమానంగ జరుగుతుంది ముక్కోటి ఏకాదశి నుండి మూడు రోజులు అధ్యయనోత్సవాలు జరుగుతాయి సంవత్సరం పొడవునా ఎందరో యాత్రికులు ఈ క్షేత్రాన్ని దర్శించి స్వామివారిని సేవించి దన్యు



కొండపై జ్వాలా నరసింహస్వామి వద్దకు వెళ్ళే మార్గము

లవుతారు ఈ స్వామిని సేవించి సంతాన యోగ్యత పొందిన వారనేకులున్నారు

## మహిమలు

భక్తుల కామితార్థములు సత్వరంగా తీర్చుట

కృష్ణవేణి నది గర్భంలో సాలగ్రామ రూపంలో నున్న నరసింహస్వామి



నరసింహావతార వైశిష్ట్యం దీర్ఘ కాలిక మయిన శారీరక మానసిక రుగ్మతల వారు ఎందరెందరో వచ్చి నిత్యం –

సంసారసర్ప విషదుష్ట
బయోగ్రతీవ్ర
దంష్ట్రా కరాళ విషదగ్ధ
వినష్ట మూర్తేః!
నాగారి వాహన
సుదాబ్ధి నివాసశౌరే
లక్ష్మి నృసింహ
మమదేహి కరావలంబమ్!!

అంటూ స్వామివారిని సేవిస్తుంటారు

పావన కృష్ణవేణిలో స్నానమాచరించి ప్రతి రోజు స్వామివారిని 108 పర్యాయములు ప్రదక్షిణ చేసిన మండలము రోజులలో ఎట్టి వైపరీత్యము కూడ సంయమనము పొందును వివిధ రుగ్మతల నుండి విముక్తి పొందినవారు అనేకులున్నారు

## ఆలయ నిర్వహణ – వసతులు

ప్రస్తుతం ముక్త్యాల జమిందారు శ్రీరాజావాసిరెడ్డి చంద్రకుమార్ వంశపారంపర్య ధర్మకర్తగా వ్యవహరిస్తున్నారు వారి తల్లి శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారు ఆలయ నిర్వహణ చూస్తున్నారు ప్రభుత్వం కూడ ఇతోదికంగ తగిన సహాయ సహకారములందిస్తున్నది యాత్రికులు బస చేయుటకు గదులు కల్యాణ మండపము ఉన్నాయి జగ్గయ్యపేట విజయవాద నగరముల నుండి బస్సుసౌకర్యం ఉంది గుంటూరు నుండి మాదిపాడు బస్సులో వెళ్ళి గింజుపల్లి' అనే గ్రామం దగ్గర దిగి, నావలో కృష్ణవేణిని దాటితే వేదాద్రి పాదాల దగ్గర యాత్రికులుంటారు. సత్తెనపల్లి నుండి కూడ గింజుపల్లికి బస్సు సౌకర్యముంది

ప్రశాంత ఆధ్యాత్మిక వాతావరణానికి చిహ్నంగా [illegible]

వ్యాసం, ఫోటోలు: కొప్పుల షేక్ మహా లాలీ

# దారి.

ఖులుసు వెంకటేశ్వర్లు

ధర్మాసుపత్రి॥

సరిగ్గా మన ప్రపంచానికి మరో నమూనాలా ఉంది! లోకంలో జరుగుతున్న న్యాయాన్యాయాల్నీ- ధర్మా ధర్మాల్నీ పట్టించుకోని విరక్త చిత్తునిలా ఉంది ధర్మాసుపత్రి!

ఉదయం లేయెండల వెలుగులు ఆస్పత్రి గోడల్ని బంగారంలా భ్రమింప జేస్తున్నాయ్!

కబుర్లు చెప్పుకుంటూ - నవ్వులు విరజిమ్ము కుంటూ తెల్లని గౌన్లతో హంసల్లా వస్తున్నారు నర్సులు! వార్డులన్నీ మేలుకొంటున్నాయ్!

పాలకోసం గిన్నె పట్టుకుని అవుట్ గేట్ దగ్గరికి వచ్చింది చుక్కమ్మ! లచ్చిని పక్క వాళ్లకు చూస్తుండమని అప్పగించి-

ఆస్పత్రిలో రోగులకి పాలు ఇస్తారు! ఎనిమిదీ తొమ్మిది గంటలైతే కానీ రావు! అంతవరకు లచ్చి ఉండలేదు! గేటు దగ్గరికి అమ్మొచ్చే పాలు ఓ రూపాయివి పోయించుకొని- గేటు పక్కనే ఉన్న పోలయ్య హోటల్లో ఆ పాలు మరిగించుకొని పట్టుకెళుతుంది చుక్కమ్మ॥

చుక్కమ్మా! పిల్ల కెలాగుంది??

పాలగిన్నె చేతి కందిస్తూ రోజూ అడుగుతాడు పోలయ్య! చుక్కమ్మ ఓ వెర్రి నవ్వునవ్వి- అల్లాగే! అంటుంది!

దేశంలో ధర్మాసుపత్రులు నరక కూపాల్లా తయారైనాయ్! పేరుకు దర్మాసుపత్రులే - కానీ డబ్బు చూపించక పోతే అక్కడ ఏపనీ జరగదు! దనవంతులకీ గొప్పోళ్లకీ మాత్రం అక్కడ గొప్ప వైద్యం దొరుకుతుంది! స్పెషల్ రూములు స్పెషల్ ట్రీట్ మెంట్లూ - క్షణాల్లో రోగాన్ని నయం చేసుకొని కార్లో వెళ్లి పోతారు డబ్బున్న వాళ్ళైతే॥

సామాన్యులూ - బడుగుజీవులో॥ బెడ్ కోసం ఎదురు చూస్తూ కొందరు - డాక్టర్‌కోసం ఎదురు చూస్తూ కొందరూ- మృత్యువుకోసం ఎదురు చూస్తూ మరి కొందరూ - రోజులు దొర్లిస్తూ ఉంటారు! ప్రాణం మీది తీపితో కటిక నేలపై పడుక్కొని - చాలీ చాలని గుడ్డ కప్పుకుని బాదల్ని భరిస్తుంటారు!

దేశంలో అవినీతిని ఎక్కడైనా - వెదకవలసి వస్తుందేమో కానీ ఇక్కడ చప్పట్లు కొడితే ఓయని పలుకుతుంది॥

చుక్కమ్మ లచ్చి చేత పాలు తాగించింది! సగం పాలు తాగి ఇంక తాగలేనన్నట్లు తలూపింది లచ్చి!

చుక్కమ్మ బాదగా చూసింది కూతురివైపు

' ధైర్యం చెప్పేవాళ్లు లేరు! అయ్యో! అనే వాళ్లు లేరు! ఒక్కగానొక్కతె॥

పిల్లని ఆసుపత్రిలో అయితే ధైర్యంగా జాయిన్ చేసేసింది కానీ తర్వాత పిల్లని ఎల్లా రక్షించు కోవాలో తెలీని వెర్రి తల్లి చుక్కమ్మ॥

లచ్చి గొంతు మీద పుండు మరీ పెద్ద దైయింది॥ పిల్ల అస్థి పంజరంలా తయారైంది॥

రోజూ పొద్దున్నే లేచి బళ్లో ఇచ్చిన పాఠాలు ఒద్దిగ్గా పలకమీద రాసుకుని తల దువ్వించుకొని - కాటుకాబొట్టూ పెట్టుకుని చెంగు చెంగున బడికి పరుగెత్తే తన కూతురు కళ్లల్లో మెదిలింది చుక్కమ్మకి॥

ఎల్లా ఉండే పిల్ల ఎల్లా తయారైంది???

ముఖం మీద వాలిన ఈగని కూడా తోలుకో లేక నిస్త్రాణగా పడుకున్న లచ్చి కేసి చూస్తే చుక్కమ్మ కడుపు తరుక్కు పోయింది॥

* * * * *

చుక్కమ్మకి వెనక నా అన్న వాళ్ళెవరూ లేరు॥

టౌనుకి నాలుగు మైళ్ల దూరంలో ఉన్న ఓ పల్లెటూరు॥ ఇప్పుడిప్పుడే ఆ పల్లె టౌను ప్రబావంలో పడుతోంది॥ అక్కడికి ఏడాదిన్నర క్రితం చుక్కమ్మ లచ్చి ని తీసుకుని వచ్చేసింది॥

తాగుబోతు మొగుడితో చేసిన నాలుగేళ్ల కాపురానికి గుర్తుగా చుక్కమ్మ, కడుపున బడింది లచ్చి॥ చుక్కమ్మ మొగుడు మాత్రం సారానే నమ్ముకుని బతుకుని దానికే అమ్మేసుకుని - ఓ రోజు చుక్కమ్మని వితంతువును చేసి పరలోకాలకి వెళ్లి పోయాడు॥

సెంటర్లో దిగిన రెండ్రోజులు ఓ కాపీ హోటల్‌కు నీళ్ళు మోసింది చుక్కమ్మ॥ హోటల్ కట్టేసాక యజమాని రాజన్న నిన్నుంచుకుంటా నాతో ఉండిపోయే॥ అని బతిమాలుకున్నాడు! ఛీ! అదేం బతుకు॥ అంటూ కసిరి కొట్టింది రాజన్నని!

సొతంతరంగా బతకాలి! నీతిగా తలెత్తుకుని బతకాలి॥ నా బిడ్డ బతుక్కి ఓ సల్లని దారి చూపించాలి॥ అనుకొంది చుక్కమ్మ॥

మర్నాడే చెవి కమ్మలు అమ్మేసి ఓ గంపనిండా కూరలు పట్టుకుని దిగింది బస్సులోంచి!

రాజన్న హోటల్ పక్క గోని సంచీ పరిచి - కూరలన్నీ పేర్చి తన ఆశలకి శ్రీకారం చుట్టింది॥

విచిత్రం! కూరలన్నీ పల్లెల్లో పుట్టినవే! కానీ పల్లెలో కూరలు దొరకవు॥ అన్నీ టౌన్‌కి ఎగుమతి॥ చుక్కమ్మ రోజు విడిచి రోజు పట్నానికి వెళ్లి కూరలు తెచ్చి సెంటర్లో అమ్ముతుంది॥ చిన్న చిన్న ఉద్యోగులూ - వర్క్ షాపులో పన్జేస్తున్న కార్మికుల - బార్యలూ - చుక్కమ్మ కూరల మీదే ఆధార పడి పోయారు! కొత్తగా రెండు బోజన హోటళ్ళు కూడా వెలిసాయి సెంటర్లో॥ చుక్కమ్మ వ్యాపారం మూడు పువ్వులారు కాయలుగా సాగుతోంది॥

లచ్చిని బళ్లో చేర్పించింది చుక్కమ్మ!

చెవులకి కొత్త కమ్మలు చేయించుకొంది॥

ఏడాది మీద నాలుగు నెల్లు గడిచేసరికి చుక్కమ్మ చేతిలో మూడు వేలు కష్టార్జితం మిగిలాయ్॥

డబ్బు లెక్క చూసుకుంటుంటే అమ్మా! ఇక్కడేదో నెప్పిగా ఉందే॥ అంది గొంతు రాసుకుంటూ లచ్చి॥

చుక్కమ్మ వెళ్లి చూస్తే లచ్చి గొంతు మీద బిళ్ల కట్టినట్లు కన్పించింది॥

ఆక్షణం నుండే చుక్కమ్మ బతుకు బండి ఇరుసు బీటలు తీయడం మొదలయ్యింది॥

తెల్లారి చుక్కమ్మ కట్టు విప్పలేదు॥ లచ్చి తో ఆచారి ఇంటి వాకిట్లో నిలబడింది॥

ఆచారికి సర్టిఫికెట్ ఉందో లేదో ఎవరికీ తెలీదు! అతని తండ్రి ఆయుర్వేదం చేసే వాడు! ఆయన గతించాక మారుతున్న కాలానికి అనుగుణంగా ఆచారి సిరెంజి పట్టుకున్నాడు॥ ఊళ్లో సొంత ఇల్లూ ఓ యకరం భూమీ అమాయకులైన జనం - ఆచారి ఆస్తి॥

లచ్చిని పరీక్షించి ఏవో టాబ్లెట్లు రాసిచ్చాడు ఆచారి! ఓ ఇంజెక్షన్ ఇచ్చాడు॥ చుక్కమ్మ ఇచ్చిన పదిరూపాయల నోటు అందుకున్నాడు!

"రోజూ తీసుకురా వారం రోజుల పాటు! తగ్గిపోద్ది॥

చుక్కమ్మ తలూపి భైటకి వచ్చింది॥

తనకు ఏరోగానికీ వైద్యం తెలియదని అనదు ఆచారి! ఏదో తనకు తెలిసిన ఇంజక్షన్లు ఇచ్చి కాలయాపన చేస్తుంటాడు! తాను చేసే ఒక్కొక్క రోజు ఆలస్యం రోగికి ప్రాణాంతకం అవుతుందని తెలియదూ అతనికి?? తెల్సు॥ అదృష్టం కొద్దీ జబ్బు నయమైతే- రోగి దగ్గర నూట పదహార్లో - రెండొందలో బహుమతి వసూలు చెయ్యొచ్చునని ఆశ॥ ఈ ఆదాయాలు కాక ప్రతీ యేటా చేసే సత్యనారాయణ వ్రతం మీద వచ్చే చదివింపులు సరేసరి॥

వారం రోజులూ గొంతు వాపు అల్లాగే ఉంది లచ్చికి! పైగా ఆచారి చేసిన సూది మందులికి జబ్బురెండూ వాచి పోయాయ్॥ పిల్ల రాత్రీ పగలూ ఒకటే ఏడుపు॥ చుక్కమ్మకి కంటి మీద కునుకు లేదు॥

ఆచారి గారూ! ఏమీ తగ్గలేదండీ పిల్లకి?? పదో "రోజున నిర్భయంగా అనేసింది చుక్కమ్మ॥ పిల్ల బాదపడి పోతుంటే ఎన్ని రోజులు చూడగలదు??

అ... ...పం తెచ్చుకోలేదు! లొక్యుడు!! చిరునవ్వు నవ్వాడు!

ఇప్పటికే ఈ కేసు మీద వందరూపాయల్దాకా వచ్చాయ్– తన వల్ల అయ్యేలా లేదు అనుకున్నాడు ఆచారి మనస్సులో!

చుక్కమ్మా!! ఈ వాపేమిటో నాకూ అర్థం గావడం లేదు! డాక్టర్ రావుగారని నాకు బాగా తెలిసిన పెద్ద డాక్టర్ గారున్నారు పట్నంలో! ఆయనికి చూపిద్దాం! రేపు బయల్దేరు!! అన్నాడు ఆచారి చుక్కమ్మతో!!

ఈ మాట చెప్పడానికి పది రోజులు పట్టిందా??

ఆచారి మీద అంతులేని కోపం వచ్చింది చుక్కమ్మకి! కోప్పడే సమయం కాదు! తమాయించుకొంది!!

* * * * *

డాక్టర్ రావు టౌన్లో పేరున్న డాక్టర్!! దర్మాసుపత్రిలో చీఫ్‌గా పన్జేస్తూ ఉదయం – సాయంత్రం ఇంటి దగ్గర ప్రాక్టీస్ చేస్తూంటాడు!!

మర్నాడు

లచ్మీ – చుక్కమ్మా– ఆచారీ రావ్ గారి ఇంటి ముందు బెంచీపై కూర్చున్నారు!! రోగులు హాలంతా నిండి పోయున్నారు అప్పటికే!!

రెండు గంటల సేపు ఎదురు చూస్తే కాని లోపలికి పిలుపురాలేదు! చుక్కమ్మ పిల్లన్దీసికొని లేవబోయింది!!

చుక్కమ్మా! నువ్ రాకు! డాక్టర్ గారికి కోపమెక్కువ! ఎక్కువ మంది లోపలికి వస్తే చిరాకు పడతాడు!! నేను తీసుకెళ్తా! ఓ యాభై రూపాయలు ఇయ్యి!!

ఆచారి చేతిలో యాభై రూపాయలు పెట్టి బెంచీపై కూలబడింది చుక్కమ్మ!!

ఆచారి రావుగారి చేతిలో ముప్పై పెట్టి – ఇరవై జేబులో పెట్టు కున్నాడు! డాక్టర్ గారిచ్చిన అయిదు రూపాయల కమీషన్ కూడా ఎందుకు సార్! అంటూనే తీసుకున్నాడు! మందుల చీటీతో లక్ష్మిని తీసుకు బయటి కొచ్చాడు ఆచారి!!

ఈ మందులు వాడి మళ్ళీ వారం రమ్మన్నారు!!



చీటి చుక్కమ్మకి అందించాడు!

టైము చూసుకున్నాడు ఆచారి! ఈపాటికి ఇంటి దగ్గరుంటే ఓ యాభై సంపాదించే వాణ్ని! పోన్లే! నీ పనైనా జరిపించి పెట్టాను!! అన్నాడు అదోలా- నవ్వుతూ చుక్కమ్మ కేసి చూసి!!

బొడ్లో దోపిన గోతాం విప్పి ఇరవై రూపాయలు అందించింది చుక్కమ్మ!! వద్దులే అంటూనే నోటు అందుకున్నాడు ఆచారి!!

నేను బజారు పన్చూసుకొస్తాను! మీరు బస్సెక్కేయండి!! ఆచారి ఎటో వెళ్లి పోయాడు!!

మందుల ఖర్చుతో సహా అన్ని ఖర్చులూ లెక్కేసుకుంటే రెండొందలు దాటింది ఆరోజు!!

ఉస్సురని ఇంటికి చేరే సరికి రాత్రి ఏడుగంట లైంది!!

మళ్లీవారం మళ్లీ మామూలే!!

కూడూ కుమ్మూ లేకుండా ఉదయం తొమ్మిదింటి కెళితే - ఏవేవో పరీక్షలూ అవీ రాసి - సాయంత్రానికి పిల్లకి కేన్సర్! ఆపరేషన్ చెయ్యాలి! అన్చెప్పేడు డాక్టర్ రావుగారు!!

ఈ సారి కూడా చుక్కమ్మ డాక్టర్‌తో మాట్లాడ్డం కుదర లేదు! ఆచారే అన్నింటికి మధ్యవర్తిగా వ్యవహరించాడు! ఇక్కడ చేసిన పరీక్షలకీ- హాస్పటల్లో పిల్లని జాగ్రత్తగా చూడ్డానికీ - బెడ్డుకీ మొత్తం నాలుగు వందలు వసూలు చేసాడు ఆచారి - డాక్టర్ గారికని!!

ఆ నాలుగొందల్లో ఎవరికి ఎంత ముట్టిందో బగవంతుడికి తెలియాలి!!

దర్మాసుపత్రిలో ప్రభుత్వోద్యోగి అయిన ఆ డాక్టర్- ప్రభుత్వం ఈ మధ్యే ప్రైవేట్ ప్రాక్టీస్ మీద నిషేధం పెడితే తన తోటి డాక్టర్లతో పాటు సమ్మె చేసి ఆ హక్కును తిరిగి సాధించు కొన్న డాక్టర్ రావ్ ఫారిన్ రిటర్న్డ్ పట్నణం నడి బొడ్డున మూడు అంతస్థుల భవనం కట్టుకున్న ఆ మనిషి - ఆ ఉదయం రెండు గంటల్లో సంపాదించిన మొత్తం పన్నెండు వందల రూపాయలు!!

★ ★ ★ ★ ★

గిన్నే మంతా సద్దుకొని పిల్లని తీసుకుని

## "ఊబి"

వార్డులోకి అడుగెట్టిన చుక్కమ్మ ఆచారి మాటలకు తెల్లబోయింది!!

చుక్కమ్మా!! మనం డాక్టర్ గారికి డబ్బు కట్టేం కానీ మరి బెడ్లు ఖాళీ లేవు! నాల్రోజులు ఇక్కడే సద్దు కొందాం! బెడ్ ఖాళీ అయితే- మొదట మనకే ఇస్తారు! అయినా మనకి బెడ్ ముఖ్యమా? వైద్యం ముఖ్యం!! ఏవంటావ్??

పరిస్థితుల కసాయి కత్తికి తల వంచింది గొర్రె లాంటి చుక్కమ్మ!! వార్డులో గుమ్మానికి పక్కన - దుప్పటీ పరిచి లచ్మి ని పడుకోబెట్టింది!!

చుక్కమ్మా! ఓసారి ఇలారా!! ఆచారి బైటకు నడుస్తూ పిలిచాడు! చుక్కమ్మ బైటికి నడిచింది!!

ఆఁ మరేం లేదు!! రేపు పెద్దమ్మాయిని అత్తవారింటికి పంపించాలి! చీర కొనాలి! అందవలసిన డబ్బు అందలేదు! ఓ వంద సద్దితే అప్పగానే మళ్లీ ఇచ్చేస్తా!!

ఆపదలో ఉన్న మనిషిని దోచుకునే సంస్కృతి మనకెక్కణ్ణుంచి దిగుమతయ్యింది??

ఆ సంస్కృతిలో పండి పోయాడు ఆచారి!!

చుక్కమ్మ మారు మాట్లాడకుండా వందనోటు తీసి ఆచారి చేతిలో పెట్టింది!! ఆచారి వెళ్ళి పోయాడు!! ఆ డబ్బు ఇంకరాదని చుక్కమ్మకి తెలుసు!!!

తరవాత నాల్రోజులు గడిచాయ్!! రావుగారు రాసిన మందులే వాడుతోంది లచ్మి కి! 'లచ్మి' బాగా శుష్కించి పోతోంది!!! గొంతుమీది కురుపు మరీ పెద్దదై పిల్లని ఊపిరి తీసుకోడానికి కూడా ఇబ్బంది పెడుతోంది!!

ఏరోజు కారోజే పెద్ద డాక్టర్ వస్తాడని ఎదురు చూస్తోంది చుక్కమ్మ!! ఆచారి మళ్లీ అయిపులేదు!!

రోజూ కుర్ర డాక్టర్ ఒకాయన పొద్దున - సాయంత్రం రోగుల్ని చూసి పోతుంటాడు!!

ఆయన రాగానే మందులూ- మందుల చీటీలూ పట్టుకుని చేతులు జోడించింది చుక్కమ్మ!!

ఏవిఁటి? ఎల్లా ఉంది??

కురుపు మరీ పెద్దదైయింది బాబూ!! ఆపరేషన్ చేస్తానన్నారు! ఎప్పుడు సేస్తారో- ఎవరు సేస్తారో తెలీడం లేదు దొరా!! పిల్ల బాధతో గిలగిల్లాడి పోతోంది!!

ఇక్కడి కెవరు పంపించారు మిమ్మల్ని??

డాక్టర్ రావుగారు రాసిచ్చిన మందులు చీట్లు చూపించింది చుక్కమ్మ!!

ఆ చీటీ మీద రావుగారి పేరు చూడగానే కుర్ర డాక్టర్ మొహం రంగులు మారింది! రావుగారి బావమరిది రాష్ట్రంలో మంత్రి!! ఏమంటే ఏం తప్పో!! మనకెందుకు?? అనుకున్నా డాయన మనస్సులో!

బెడ్‌కి మూడొందలు ఇచ్చాం దొరా! కానీ చుక్కమ్మ మాట పూర్తి కానివ్వలేదు అతను!

ష్!! ఆ మాటలు ఏమీ చెప్పద్దు! ఆయన్నే అడగండి!! వేగంగా వెళ్లి పోయాడు!!

లచ్మి ని పక్కవాళ్లకి అప్పగించి సాయంత్రం రావుగారి ఇంటికి వెళ్లింది చుక్కమ్మ!!

ఈ మధ్య నేను సెలవులో ఉన్నాను! ఎల్లుండి హాస్పటల్‌కి వస్తాను!! ఆపరేషన్ చేసేది నేనుకాదు! ఇంకో డాక్టర్ గారు చేస్తారు! ఆయన్తో ఫోన్‌లో మాట్లాడతాను!! ఆయనకి మనం డబ్బివ్వాలి!! నాలుగొందలు ఇచ్చి వెళ్ళు!!

బాబూ!! బెడ్డుకి చుక్కమ్మ చెప్పేది విన్లేదు ఆయన!! అవ్వన్నీ నేను చూస్తాన్లే ఇంక వెళ్లు!! రోగుల్ని చూడ్డంలో మునిగి పోయాడాయన!!

అసిస్టెంట్ వచ్చి చుక్కమ్మ దగ్గర నాలుగు వందలు పుచ్చుకుని ఓ చీటీ చేతిలో పెట్టాడు!!

చుక్కమ్మ చెమటోడ్చి నిలబెట్టిన డబ్బు హారతి కర్పూరంలా కరిగి పోతోంది! ఎందుకూ ఏమిటీ అని అడగడానికి లేదు! ప్రతివాడూ రోగికి తానేదో ఉపకారం చేస్తున్నట్లు మాట్లాడే వాడే!! అంతా చెప్పేక చెయ్యి చాచే వాళ్లే!!

ఎదురుచూసిన రోజు రానే వచ్చింది!!

లచ్మి కి ఈరోజు ఆపరేషన్ సేస్తారు! బగవంతుడు సల్లగా సూస్తే తొందరగా ఇంటి కెళ్ళి పోవచ్చు?? చేతిలో డబ్బు అయిపో-వస్తోంది! ఏదో జాగర్తగా కాలం గడిపేస్తే పిల్ల నవ్వుతూ తిరిగే రోజు వచ్చేస్తాది

ఉదయం ఏనిమిది గంట లైంది!

నర్సులంతా రోడ్డు మీద గుంపులు గుంపులుగా నిలబడు తున్నారు!! ఏవేవో నినాదాలు చేస్తున్నారు! డ్యూటీలో ఉన్న సిస్టర్స్ కూడా బయటికి నడుస్తున్నారు!!

చుక్కమ్మకి ఈ హడావుడి అంతా ఏవిఁటో అర్థం కాలేదు! వార్డులో నుండి బయటికి పోతున్న సిస్టర్‌ని అడిగింది ఏటితల్లీ! ఏవైంది?? అని!

మేవంతా స్ట్రైక్ చేస్తున్నాం! రాత్రీ పగలూ తేడా లేకుండా రోగులకి సేవ చేసేది మేం!! మమ్మల్ని ఈ డాక్టర్లు కుక్కలకన్నా హీనంగా చూస్తున్నారు! ప్రతీ వోడూ తన వెనక్కాల మంత్రినో- ఎమ్మెల్యేనో పెట్టుకోడం- నాలుగు చేతులా సంపాదించేసి -



ఉచితం



మీరు కొనుగోలుచేసే ప్రతి

ఆక్సో డ్రాయరుకు ఆక్సో బనియన్ ఉచితం!

రెండు ఆక్సో బనియన్లకు

ఒక ఆక్సో బనియన్ ఉచితం!!

OXO
BRIEFS & VESTS

CDC OA16

కళ్ళు మూసుకు పోయి ప్రవర్తించడం - వీళ్ళకి అలవాటై పోయింది- విసవిసా బయటికి నడిచింది సిస్టర్"

తరువాత గాని అసలు విషయం తెలీలేదు చుక్కమ్మకి"తాగొచ్చి డ్యూటీలో ఉన్న సిస్టర్ చేయి పట్టుకున్నాట్ట ఎవడో కుర్ర డాక్టర్" ఆమె తిరగబడితే తిట్టాట్ట" అందుకు ఈ నర్సుల సమ్మె"

రోగి ప్రాణాలు నిలబెట్టే డాక్టర్ తాగి డ్యూటీలో కొస్తాడా??? చుక్కమ్మకి దుఃఖం ముంచు కొచ్చింది" ఈ మాయదారి నరకం లోంచి ఎల్లా భైట పడేస్తావ్ దేవుడో?? - అంటూ గొల్లున ఏడ్చింది"

ఆస్పత్రిలో చేరిన రోగికి ఒకటే బాద - అది జబ్బువల్ల వచ్చే శారీరకమైన బాద మాత్రమే" కానీ రోగి వెనుక వచ్చిన వాళ్ళకో? అనేకమైన బాధలు" అడిగిన చోట్ల మారు మాట మాట్లాడకుండా డబ్బు ఖర్చు పెట్టాలి! రూమ్ తుడిచే ఉద్యోగి మొదలు కొని డాక్టర్ దాకా అందరి దాక్షిణ్యానికి తల వంచి నిలబడాలి"

అవసర మైతే కాళ్ళు పట్టుకుని బతిమాలు కోవాలి! వేళకు తిండి - నిద్ర ఉండదు! చెట్టు కింద ఉదకేసుకున్న జావతాగి నీరసంతో - బెరుగ్గా రోజులు గడపాలి! ఎవర్ని ఏమడిగినా నెమ్మదిగా సమాదానం చెప్పరు! విసుగుతో కోపంతో అరుస్తారు! ఇంత శ్రమ పడినా రోగి బతుకు పూర్తిగా దైవాధీనం"

చుక్కమ్మకి ఈ ఆస్పత్రి - ఎటు కదిలినా గాయం చేసే కత్తుల బోను లా అన్పించింది"

మరో గంటలో డాక్టర్ రావ్ కార్లో వచ్చాడు! వస్తూనే నినాదాలు చేస్తున్న నర్సులను క్రీగంట గమనించాడు" చుక్కమ్మ కారు దగ్గరికి పరుగెత్తి వెళ్ళింది!

చూసావుగా పరిస్థితి! సిస్టర్స్ డ్యూటీ లోకి రాగానే అపరేషన్ చేద్దాం"

డాక్టర్ రావ్ కారును స్టార్ట్ చేసి బయటకు పోనిచ్చాడు"

నర్సుల సమ్మె తేలే సరికి నాల్రోజులు ఎట్టింది! ఈ నాల్రోజులూ ఆస్పత్రి మొత్తం స్థంబించి పోయినట్లు అయింది" చివరికి తప్పు చేసిన కుర్ర డాక్టర్ క్షమార్పణ చెపితే కానీ పట్టిన పట్టు వదల్లేదు ఆ సేవామూర్తులు"

మళ్ళీ వార్డులన్నీ జీవం పుంజుకున్నాయి"

మర్నాడు, డాక్టర్ రావ్ ఉదయమే ఆస్పత్రి కొచ్చాడు! పది గంటల్లోపున ఈ పరీక్షలు చేయించు రమ్మని కాగితం రాసిచ్చాడు చుక్కమ్మకి" మళ్ళీ యాతన మొదలు! ఆ పరీక్షలు ఎక్కడ చేస్తారు?? ఎవరు చేస్తారు?? అయిన వాళ్ళనీ కాని వాళ్ళనీ బతిమాలుకుంటూ ఫలితాలు పట్టు కొచ్చేసరికి చుక్కమ్మ ప్రాణాలు కళ్ళలోకి వచ్చాయి" పరీక్షలు చేసిన అసిస్టెంటు మాత్రం పది రూపాయల లంచంతో తృప్తి పడ్డాడు" కాగితాలు పట్టుకుని డాక్టర్ రావు గారి దగ్గరికి పరుగెత్తింది చుక్కమ్మ" కూతుర్ని బతికించు కోడానికి అసహాయంగా - నిస్సహాయంగా మూడు వారాల్నించి పోరాడుతున్న ఒంటికత్తె" డాక్టర్ రావ్ ఆ కాగితాలు చూసి తృప్తిగా తలూపాడు"

అవసరమైతే రక్తం ఎక్కించ వలసి వస్తుంది! రెండొందలు ఇచ్చి వెళ్ళు" చుక్కమ్మ డాక్టర్ టేబిల్ పైరెండొందలుంచింది"

కేసు ఓడిన వాడు పైకి ఏడిస్తే - గెల్చిన వాడు లోపల ఏడుస్తాడని కోర్టుల గురించి చెప్తుంటారు! దర్మాసు పత్రులు కూడా అల్లాగే తయారవడం లేదూ?- ముఖ్యంగా చుక్కమ్మ లాంటి బడుగు జీవుల విషయంలో!!!

డాక్టర్‌గారు ఈ మందులు తెచ్చుకో మన్నారు! అర్జంటు" ఆపరేషన్ అయిపోగానే వాడాలట" - అసిస్టెంట్ పరుగెత్తుకుంటూ వచ్చి చుక్కమ్మ చేతిలో చీటీ ఉంచాడు!

ఎంతవుద్ది బాబూ ఈ మందులికి??

నూరో నూటయాభయ్యో పట్టు కెళ్ళు

నచ్చినంత వేగంగానూ పోయాడాయన"

చుక్కమ్మ భైటి కెళ్ళి డబ్బు లెక్క జూసుకొంది" సరిగ్గా వంద రూపాయలున్నాయి" చుక్కమ్మ గుండె గుబేల్‌మంది" మందులికే నూటయాభై రూపాయ లైతే - ఇంకా తరవాత ఖర్చులో??




పిల్లనీసుకుని ఆచారి దగ్గరి కెళ్ళిన నాటికి తన చేతులో ఉన్న సొమ్ము మూడు వేలు" టౌను ప్రయాణాలికీ మందులికీ పెద్ద డాక్టర్ ఫీజులికీ

బెడ్‌కీ అపరేషన్‌కీ ఆచారికీ రక్తానికీ ఇంకా ఇంకా మంచినీళ్ళలా అయిన ఖర్చు లెక్కలకి అందడం లేదు"

చెవి కమ్మల్ని తడుముకొంది చుక్కమ్మ అప్రయత్నంగా" కొండంత దైర్యం వచ్చింది! తేలిగ్గా నిట్టూర్చి - లచ్మి దగ్గరికి నడిచింది"

వార్డులోకి వెళ్ళేసరికి లచ్మి స్ట్రెచ్చర్ మీద పడుకుని ఉంది" వార్డు బోయ్ లచ్మి ని అపరేషన్ థియేటర్‌కి తీసుకెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాడు" లచ్మి బయం బయంగా చుక్కమ్మ కేసి చూసింది! పిల్లకి ధైర్యం చెప్దామనుకొంది చుక్కమ్మ! డగ్గుత్తికతో ఏదో అనబోతుండగా అడ్డుతగిలాడు వార్డుబోయ్

నా మామూలు ఎచ్చెయ్యండి! ఆలీస్సెం చేస్తే డాక్టర్ సాబ్ కోప్పడతారు"

నీకు మామూలు ఎందుకు??

నాకు ఇరవైరూపాయిలు వస్తాయ్! ఇది రేటు!

చుక్కమ్మకి ఒళ్ళు మండిపోయింది" డాక్టర్ గారితో సెప్తాను జాగ్రత్త"

వార్డుబోయ్ రెచ్చిపోయాడు సెప్పుకోవమ్మో" దాట్రుతో గాదు మినీట్టర్‌తో సెప్పుకో"దాట్టర్లకైతే వంద లొందలు సేతుల్లో పోత్తారు"మాకాడ కొచ్చేసరికి రూల్స్ సెపుతారు రూల్సు"మామూలిత్తే గానీ బండి కదల్దు" నీ ఇష్టం వొచ్చినట్టు సేసుకో -"

నర్స్ పరిగెత్తుకుంటూ వచ్చింది నూకరాజూ! పేషెంటుని తీసుకురా! సార్ కోప్పడుతున్నారు"

నూకరాజులో ఏమీ చలనం లేదు! అందరూ విస్తుబోయి చూస్తున్నారు లంచగొండితనం విశ్వరూపాన్ని" చుక్కమ్మ మౌనంగా గోతాం విప్పి నూకరాజు చేతిలో ఇరవై రూపాయల నోటు ఉంచింది"

చప్పుడు చేసుకొంటూ ముందుకు నడిచింది స్ట్రెచ్చర్"

ఏడుకొండల వాడా! పిల్లకి నయమైతే నీ కొండకి తీసుకొత్తా తండ్రీ" చుక్కమ్మ ప్రార్థనని ఆ వడ్డీ కాసుల వాడు విన్నాడా??

ఒక్కక్షణం ఆలస్యం చేయదల్చుకోలేదు చుక్కమ్మ మందుల చీటి పట్టుకుని టౌన్లోకి పరుగెత్తింది"

ఒకే ఒక్క కూతురు ఆపరేషన్ థియేటర్లో ఉండగా - ఆ తల్లికి ధైర్యం చెప్పి ఓదార్చే వారే లేరు"

బంగారం కొట్టులో చుక్కమ్మ! చెవికమ్మలు విప్పి సేట్ చేతికి అందించింది! సేట్ చుక్కమ్మ కేసి అనుమానంగా చూస్తూ వాటిని అటూ ఇటూ తిప్పి చూసాడు! గీటు పెట్టి చూసుకున్నాడు! తూకం వేసుకున్నాడు"

వంద రూపాయ లిస్తాం

వందా?? చెవి కమ్మలు అయిదు వందలు పెట్టి చేయించుకొంది" చెవి కమ్మలు అందుకొని మరో

దుకాణంలోకి అడుగు పెట్టింది చుక్కమ్మ'' పరిస్థితిని చెప్పింది దీనంగా' చుక్కమ్మ చెప్పిన మాటలన్నీ విని దుకాణం యజమాని అన్నాడు అసలు మేము ఇలా వస్తువుల్ని కొనగూడదు'పోలీసులకు తెలిస్తే కొట్టు మూయించేస్తారు' ఓ వంద రూపాయలిస్తా ''అంతకన్నా ధర రాదు''

బంగారం అమ్మబోతే అడివి' కొనబోతే కొరివి''

తనేదో ఈ చెవి కమ్మల్ని ఎక్కడ నుంచో దొంగతనం చేసుకొచ్చానని అనుకొంటున్నారు'' కూతురు మందుల కోసం చుక్కమ్మ వాటిని తెగనమ్మింది'' వంద పుచ్చుకొని మందుల షాపుకి పరుగెత్తింది''

మందులు మొత్తం నూట డెబ్బై రూపాయల దాకా అయినాయ్''

అప్పటికే తాను ఆస్పత్రి నుండి బైటకు వచ్చి చాలా సేపు ఐపోయింది'' లచ్చి కెల్లా ఉందో???

మందులు చీర కొంగులో చుట్టి బోడ్లో దోపింది''రిక్షా [illegible] కదిలింది''చేతిలో [illegible]

అన [illegible] కడుపున పుడతా' సరి పెట్టుకో'' రిక్షా దిగి అతనికి నాల్రూపాయలు ఇచ్చింది''

సర్లే అమ్మా! జాగ్రత్తగా ఫో''

పరుగెత్తు కెళ్ళిన చుక్కమ్మకి తన కోసమే ఎదురు చూస్తూ నిల్చున్న నర్సు కనిపించింది''

చుక్కమ్మ ఆయాసంతో వగురుస్తోంది''

చుక్కమ్మా! నీ బిడ్డ చచ్చిపోయింది'' ఆపరేషన్ జరుగుతుంటే ప్రాణం పోయింది! శవాన్ని ఇక్కడ ఉంచకూడదు! నువ్ చూస్తే ఇక్కడ లేవు! శవాన్ని మార్చురీ కి పంపేసారు'' పోయి తెచ్చుకో''ఏడవకు''

చుక్కమ్మ పాడి కళ్ళతో అలా చూస్తుండ పోయింది''

మారుచురీ అంటే ఏటమ్మా?? చాలా సేపటి దాకా నోట మాట రాలేదు చుక్కమ్మకి''

శవాల గది'' ఇలా కుడి వైపుకి తిరిగి తిన్నగా ఫో''

ఆపరేషన్‌కి తీసుకెళ్ళేటప్పుడు లచ్చి తో రెండు మాటలు మాటాడ్డం కుదరలేదు వార్డుబోయ్ పెట్టిన గొడవ వల్ల'' లచ్చి ని చూడాలని చుక్కమ్మ, మనసు కొట్టుకుపోతోంది'' కాళ్ళీడ్చుకుంటూ శవాల గదికి వెళ్ళింది చుక్కమ్మ''

ప్రపంచంలో రోగు లింత మంది ఉంటారో వాళ్ళందరి నిస్సత్తువ చుక్కమ్మని చుట్టుముట్టి నట్టుంది'' నీరసం'' కళ్ళు 'తిరుగుతున్నాయ్'' పొద్దున్నించీ పచ్చి మం ఎనీళ్ళు త గలేదు'' లచ్చి ని బతికించుకోడం కోసం చేసిన పోరాటంలో మనస్సు – శరీరం రెండూ అలసి పోయినాయ్''

మార్చురీ దగ్గర ఉద్యోగి చుక్కమ్మ చెప్పినదంతా విని డెత్ సర్టిఫికెట్ తెచ్చుకోమన్నాడు'' మళ్ళీ వార్డులోకి నడక''

మళ్ళీ కనిపించిన వాళ్ళందర్నీ కనుక్కోడం బతిమలాట'' సర్టిఫికెట్ చుక్కమ్మ చేతికి వచ్చేసరికి మధ్యాహ్నం రెండు గంటలు దాటి పోయింది'' సర్టిఫికెట్‌తో 'మార్చురీ కి వెళ్ళిన చుక్కమ్మకి అక్కడ పన్జేసే కుర్రాళ్ళు చెప్పిన మాటలకి తల తిరిగిపోయింది''

లచ్చి శవాన్ని చూడాలనుకుంటే నలభై రూపాయలు కావాలి''

కలా?? నిజమా?? శవాన్ని కేనం లేని కట్టని తన కూతురు శవాన్ని తనకివ్వడానికి లంచం'' బ్రతికి ఉన్న మనిషి చచ్చిన మనిషిని మధ్య పెట్టుకుని చేస్తున్న వ్యాపారం''

ఈ దారుణాన్ని మీ రాన్ని అన్యాయాన్ని ఆపేవారు లేరా?? ఇంత మంది పెద్ద పెద్ద దొరలు సదువుకున్నోరు ఎవరు నోరు మెదపరేం??

చుక్కమ్మ మార్చురీ ఇన్ – చార్జి ఆఫీసర్‌తో చెప్పుకొంది తన గోడు''

చూడమ్మా'' ఇక్కడందరికీ సంఘాలున్నాయ్! ఎవర్నీ ఏమనడానికి వీలు లేదు'' ఏమైనా అన్నా ఇక్కడ ఉద్యోగం చెయ్యలేము! ఎక్కడో అక్కడ ఎంతో కొంత చూసి వాళ్ళ మొహాన్ని తగలెయ్యి'' ఎళ్ళు''

నిజాయితీ నీతీ నిస్సహాయంగా మూలుగుతున్నాయ్''

లాభం లేదు'' ఇక్కడ న్యాయం ధర్మం కోసం వెంపర్లాడ్డం నిష్ప్రయోజనం'' తల్లి వేరు నుండి చిట్ట చివరి రెమ్మ దాకా తెగులు పట్టిన చెట్టులా ఉంది దర్మాసుపత్రి''

# ఈ 'వేమన' పద్యాలు




కలిమి సుఖ దుఃఖములకును కారణంబు
సంపదలుగల్గ నెవరికి శాశ్వతంబు
తెలివి సంపద గలవాడు దేవసముడు
విమలగుణ రాజయోగీంద్ర వేమ నార్య

చుక్కమ్మ అవుట్ గేట్ కేసి నడిచింది''

లచ్మి లేదు'' చేతిలో చిల్లిగవ్వ మిగల్లేదు''

ఒంట్లో ఓపిక లేదు'' ఇక్కడ దోపిడీకి అంతులేదు''

గేట్ బయట సిమ్మెంట్ చప్టా మీద పోలయ్య కూర్చున్నాడు'' పోలయ్యని చూడగానే చుక్కమ్మకి గుండె పొరల్లో దాగిన – దాచుకొన్న దుఃఖం కట్టలు తెంచుకొని ముందుకు ఉరికింది''

బావురుమని ఏడుస్తూ పోలయ్య దగ్గర కూలబడిపోయింది చుక్కమ్మ''

* * * *

పోలయ్య'' పోలయ్య లేకపోతే తనకి పిల్ల శవం కడచూపు కూడా దక్కేది కాదు'' ఎన్ని కష్టాలు పడ్డా

## "ఊబి"

లచ్మి శవాన్ని అనాథ శవం కింద ఆస్పత్రికి వదిలేసి వెళ్ళిపోతే బతుకంతా మనసులో ముల్లు గుచ్చుకొంటూనే ఉండేది'' పోలయ్య సాయంతో తన చేతులో తన లచ్మి ని భూదేవి ఒళ్లో పడుకోబెట్టి రెండు కన్నీట చుక్కల్ని లచ్మికి సాయంగా వదిలి – రాగలిగింది'' తనకదో తృప్తి'' అంతే''

పోలయ్యని గురించి ఆలోసిత్తుంటే ఒక బగవంతుళ్లా కడబడ సాగాడు చుక్కమ్మకి'' పాపం! పోలయ్య కూడా ధర్మాసుపత్రి చేత దెబ్బ తిన్నోడే''

* * * *

పోలయ్య మొదటి నుంచీ టీ కొట్టు నడిపిన వాడు కాదు'' మేడిపిడి పట్టుకుని తండ్రి ఇచ్చిన ఎకరం చేలో బంగారం పండించిన రైతు'' వాన చుక్క కోసం చూసి చూసి గుండెలు బద్దలైన నేలతల్లిని చూసి ఏడుస్తున్న సమయంలోనే – పెళ్ళానికి వెన్నుపూస మీద పుట్టకురుపు లేచింది'' అయినకాడికి భూమీ గొడ్లనీ బేరం పెట్టేసి – పెళ్ళాన్ని బతికించుకొందావని ఇక్కడి కొచ్చేసాడు'' పోలయ్య పెళ్ళాం ఆర్నెల్లు రోగంతో తీసుకుని – పోలయ్య జేబుల్ని పూర్తిగా ఖాళీ చేయించేసి – మొగుణ్ణి బికారి వాణ్ణి చేసి చచ్చిపోయింది!

ఆర్నెల్లు పక్కనే ఉండి రాత్రీపగలూ పెళ్ళానికి సేవల్జేసిన పోలయ్యకి పెళ్ళాం శవాన్ని చూసి – తన చేతులో పిడికెడు బూడిద చేసే యోగం పట్టలేదు! కారణం'' శవాల గదిలోంచి నలభై రూపాయలు మామూలు ఇచ్చి పెళ్ళాం శవాన్ని బయటకు తెచ్చుకోలేకపోయాడు'' అవుట్ గేట్‌లో పిచ్చివాళ్ళా నిలబడ్డ పోలయ్య పక్కనుంచే – పోలయ్యపెళ్ళాం అనాథ శవంగా ముద్ర వేయించుకొని వేన్‌లో వెళ్ళిపోయింది''

అంత వరకూ స్వంత ఊరు వెళ్ళిపోదావనుకున్న పోలయ్య – ఆ క్షణంలో అక్కడే ఉండిపోవాల్నను కున్నాడు'' పట్టుదలతో గేటు పక్కనే చిన్న టీ కొట్టు పెట్టాడు''

పోలయ్యకి తెలుసు'' ఎందరో అబాగ్యులూ అమాయకులూ ఇక్కడి కొస్తారు'' తన వాళ్ళ ప్రాణాల కోసం చివరి పైసా దాకా ఖర్చు పెట్టేస్తారు'' ఏదితో జూదం అది పూర్తిగా ఓడిపోతారు'' అల్లాంటి వాళ్ల కోసం పోలయ్య ఆ రోజు అమ్మకాన్ని ఖర్చు పెడతాడు

తనకు తగిలిన దెబ్బ ఇతరులకి తగలకుండా తప్పిస్తాడు''

* * * *

ఆకాశంలో చుక్కలు మినుకు మినుకున మెరుస్తున్నాయ్''

ఆస్పత్రి నోరు తెరిచిన భూతంలా బయపెడుతోంది బల్ల మీద గుఋ్ఋ పెట్టి నిద్దరోతున్న పోలయ్య ఉలిక్కిపడి లేచాడు''

ఎవరూ???

పోలయ్య కాళ్ల మీద పడి ఏడుస్తోంది చుక్కమ్మ''

నేను మా వూరికి ఎళ్లను పోలయ్యా'' నీ కాడే ఇక్కడే ఉండి పోతాను'' నేన్నీకు బరువుగా ఉండను నా పొట్టకి నేను సూసుకొంటాను'' నీతో పాటే నీలాగే మనిషిగా బతుకుతాను'' నాలాగే కట్టాల్లో కూరుకుపోతున్నోళ్లకి నన్ను కూడా సాయం సెయ్యనివ్వవూ???

పాక లోపలి గుడ్డి దీపం శాయశక్తులా చీకటిని ఎదిరిస్తోంది''

మళ్ళీ తెల్లారుతోంది''

దర్మస్వరూపుడైన పోలయ్య ఇప్పుడు చతుర్భుజుడు '' □

# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

SHREE BAIDYANATH AYURVED BHAWAN PRIVATE LTD. CALCUTTA

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

**కె పద్మప్రియ పాపిరెడ్డిపాలెం**

ప్ర తలలో వెంట్రుకలు అక్కడక్కడ గుండ్రముగా ఊడిపోతున్నవి

జ గుంటగలగర ఆకు పసరు పెద్ద ఉసిరికాయ రసం తాని కాయ రసంతో ఊడిపోయిన చోట రోజుకు 2 3 సార్లు రుద్దండి బైద్యనాథ్ మహా భృంగరాజ తేల్ తలనూనెగా వాడండి

**కె నారాయణ, పులివెందుల**

ప్ర కాళ్ళు చేతులు పీకడం నిస్సత్తువ

జ బైద్యనాథ్ విటా ఎక్స్ టాబిలెటు 1 చొప్పున బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్‌తో ప్రతి రోజు ఉదయం సాయంత్రం పాలతో సేవించండి రాత్రి పడుకోపోయేటప్పుడు బైద్యనాథ్ వాతరినా 1 మాత్ర బైద్యనాథ్ యోగరాజ గుగ్గులు 1 మాత్ర మంచి నీటితో సేవించండి

**డి రామకృష్ణ, తెనాలి**

ప్ర మగవారికి ఉరోజాలు రావటం నివారణ

జ దానివలన నష్టము ఏమీలేదు కొంత వ్యాయామం చేస్తే తగ్గిపోవచ్చు శరీరమంతా లావుగా ఉన్నచో బైద్యనాథ్ లోసహ బైద్యనాథ్ దశమూలారిష్ట 2 3 నెలలు సేవించండి బైద్యనాథ్ ప్రసారిణి తేల్ మర్దన చేసి వేడి నీటితో స్నానము చేస్తే క్రొవ్వు కరగవచ్చు

**కె రాజగోపాలరావు, శ్రీకాకుళం**

ప్ర దురలవాటు వలన నీరసము నిస్సత్తువ

జ బైద్యనాథ్ విటా ఎక్స్ మాత్రలు ఉదయం సాయంత్రం 2 మాత్రలు చొప్పున పాలతో సేవించండి భోజనం తరువాత బైద్యనాథ్ అశ్వగంధారిష్ట రోజు రెండుసార్లు వాడండి విశ్రాంతి అవసరం

**పి విశ్వనాథ్, తెనాలి**

ప్ర కుడి వైపు బీజము వాపు

జ బైద్యనాథ్ వృద్ధి బాధికబటి 1 మాత్ర బైద్యనాథ్ నిత్యానంద రస 1 మాత్ర బైద్యనాథ్ సురక్తాస్ట్రాంగ్ 2 చెంచాల మందు రెండు చెంచాల నీటితో కలిపి ఉదయం సాయంత్రం ఒక నెల రోజులు వాడండి

**శ్రీమతి వనం అంకమ్మ, వెంకటగిరి**

ప్ర మోకాలు నొప్పి పైలేరియా కూడ ఉన్నది

జ బైద్యనాథ్ నిత్యానందరస 1 మాత్ర బైద్యనాథ్ సుదర్శన ఘన టాబిలెట్ 1 మాత్ర బైద్యనాథ్ మహామంజిష్టాది కాడతో ఉదయం సాయంత్రం విడవకుండా వాడాలి

**జి వి వి లక్ష్మి, కైకలూరు**

ప్ర నీరుడు వెళ్లేటప్పుడు పోటు

జ బైద్యనాథ్ గోక్షురాది గుగ్గులు 1 మాత్ర బైద్యనాథ్ చంద్ర ప్రభావటి 1 మాత్ర బైద్యనాథ్ పతన్జైన్ 1 మాత్ర చొప్పున ఉదయం సాయంత్రం బైద్యనాథ్ చందనాసవతో వాడండి వేడి చేసే పప్పు పులు ఏమి తీసుకోకూడదు

**యస్ బషీర్ మద్రాసు**

ప్ర చెవిలో విపరీతమైన నొప్పి మరియు శబ్దము

జ బైద్యనాథ్ బిల్వ తైలము రోజుకు రెండుసార్లు చెవిలో వేసి దూది పెట్టవలెను చెవిని శుభ్రముగా ఉంచుట మంచిది

**యమ్ రమ , ధర్మవరం**

ప్ర షుగర్ మూత్రము బాధతో ఎక్కువగా పోవటం

జ బైద్యనాథ్ చంద్ర ప్రభావటి ఉదయం సాయంత్రం ఒక్కొక్క మాత్ర చొప్పున బైద్యనాథ్ సుందరి కల్పతో వాడాలి

**యమ్ పద్మప్రియ, పాపిరెడ్డిపాలెం మరియు ఎ ఆర్ లక్ష్మి, తిరుపతి**

ప్ర రెండు సంవత్సరముల నుండి తల దురద వెంట్రుకలు ఊడిపోవటం

జ లోనికి బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగ్ ఉదయం సాయంత్రం 2 చెంచాలు సమ భాగము నీటితో కలిపి సేవించండి రెండు రోజుల కొకసారి బైద్యనాథ్ తువరకతేల్ తలకు వ్రాసి స్నానము చేయండి తలనూనెగా బైద్యనాథ్ మహాభృంగరాజ తేల్ వాడండి తలకు వేడి నీటి స్నానము సబ్బు వాడవద్దు

**చెంగల కృష్ణమూర్తి, లింగన్నపాలెం (ఖమ్మం)**

ప్ర తలనొప్పి కళ్ళు నొప్పులు

జ బైద్యనాథ్ లక్ష్మీవిలాస రస 2 మాత్రలు బైద్యనాథ్ శిరః శూలాదివజ్రరస 1 మాత్ర బైద్యనాథ్ శంఖపుష్పి సిరప్ 2 చెంచాలు ఉదయం సాయంత్రం వాడండి తలకు బైద్యనాథ్ మహా భృంగరాజ్ తేల్ తలనూనెగా వాడండి

**హెచ్ వి సుజాత, బెంగుళూరు**

ప్ర చ్యవనప్రాశతో పాలు తాగితే శ్లేష్మము తలనొప్పి వస్తుంది

జ వట్టి పాలు మాత్రమే త్రాగితే మీకు ఏదుతుందా? మీకు పాలు సరిపడనప్పుడు చ్యవనప్రాశ మాత్రమే వాడండి పాలు మానివేయండి

**డి బి కృష్ణ, వేములవాడ**

ప్ర లావు తగ్గడానికి మందు

జ బైద్యనాథ్ మేదో హరవిడంగాదిలోహ 1 మాత్ర బైద్యనాథ్ పునర్నవా మండూరము 1 మాత్ర ఉదయం సాయంత్రం బైద్యనాథ్ దశమూలారిష్టతో 2 చెంచాల మందు రెండు చెంచాల నీళ్లతో కలిపి వాడండి పప్పుదినుసులు పెరుగు, దుంపలు తినకూడదు శరీరమును కష్టపెట్టు వ్యాయామం చేయాలి

**రాజేశ్వరరావు, భిలాయి**

ప్ర కాళ్ళు చేతులు పీకటం మలబద్ధకం

జ మంచి ఆహారం తీసుకోవాలి నూనెతో చేసినవి వరుగులు మొదలగునవి మానివేయాలి బాగుగా ఉడికించి చేసిన పదార్థములు తినాలి ఔషధములు రాత్రి పరుండబోవునప్పుడు బైద్యనాథ్ అవిపత్తికర చూర్ణ 2 చెంచాలు గోరు వెచ్చని నీటితో సేవించాలి దానివలన మలబద్ధకము పోవును

బైద్యనాథ్ విటా ఎక్స్ 2 మాత్రలు చొప్పున ఉదయం సాయంత్రం బైద్యనాథ్ చ్యవనప్రాశతో తీసుకొని పాలు త్రాగాలి విశాఖపట్నం విజయనగరం రాజమండ్రిలలో మా ఔషధములు దొరుకును ☐

---

కూపన్

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**బైద్యనాథ్ ఆరోగ్య దీపిక**

ప్రశ్న : . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . .

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

# జబ్బు మనుషులు

## కె.కె. రఘునందన

అడవిలో అనేక రకాల మొక్కలున్నట్టుగా- దేశంలో వివిధ రాజకీయ పార్టీలున్నట్టుగా- ఆ కాలనీలో పలురకాల మనుషులున్నారు ఆ వ్యక్తుల హోదాలు బహు విదాలు వారి మనస్తత్వాలు విబిన్న రూపాలు

వారందరూ కోడి కూతతోనే నిద్రలేస్తారు లేచిన దగ్గర్నుండీ విపరీతమైన హడావుడి పడిపోతారు

ఆఫీసు టైంకి మొగుళ్ల నోట్లో ముద్ద పెట్టగలమో లేదోనన్న కంగారు ఆడవాళ్లది ఒహవేళ సరియైన సమయానికి వంట కుదిరి చావకపోతే ఆఫీసర్‌చేత లేట్‌మార్కు వేయించుకోవాలన్న చింత మగాళ్లది బస్సు లందుతాయో లేదో నన్న బెంగ- యివన్నీ వారందర్నీ క్షణ క్షణం చకాకు పరిచే ఆలోచనలు

అయితే ఆ కాలనీ వారందరికీ సాక్షాత్తు దేవుడిలా దిగివచ్చినవాడు పతి పూర్తిపేరు కృష్ణపతి అయినా అంతా సింపుల్‌గా పతి నామాన్ని సార్థకం చేసారు

నెల క్రితం పతి ఆ కాలనీలో ఓ ఆఫీసర్ అయిన పరంధామం గారికి ఓ ముఖ్య విషయంలో సాయపడ్డాడు అలా పరిచయం అయిన పతిని తమింట పనులు చూడదాన్కి – వచ్చిపోతుండమని చెప్పాడు అప్పటికే పతి నిరుద్యోగిగా రికామీగా తిరుగుతుండడంతో – కడుపునింపుకోవాలన్న యోచనతో వుండటం వల్ల ఆ పని ఈ పనిలో చేదోడు వాదోడుగా వుండసాగాడు

అంతేకాక ఆ కాలనీలో అందరికీ తల్లో నాలుకగా మారాడు

ఎవరు దేనికి పిలిచినా బెట్టు చేసేవాడుకాదు అభ్యంతరం చెప్పేవాడుకాదు విసుక్కోవటం అతనికి తెలీని పద్ధతి ఆ నమ్రత వినయం విదేయత- అందర్నీ ఆకర్షించింది

క్రొత్తగా వచ్చి నిలద్రొక్కుకున్న పార్టీ పేరులా అందరి నోట్లో పతి పేరు నానుతూంటుంది

ఆ రోజుకూడా- కాలనీలో వాళ్ళ పళ్ళమీద యిలా బ్రష్ డాన్స్ చేసిందో లేదో అలా హాజరైనాడు పతి

ఏంటండీ! వంట సగంలో గ్యాసయిపోయింది పతున్నాడేమో అలా వెళ్లి కేకెయ్యండి సిలిండర్ యిస్తున్నారో లేదో కనుక్కొని వస్తాడు ఈ రోజెలా వండేది భగవంతుడా! అని వాపోయింది- ఆఫీసర్ పరదామం గారి సతీమణి శ్రీవాణి

ఏ పనీ మధ్యలో ఆగిపోవడం యిష్టపడదు ఆమె లేని పోని కోపతాపాలనన్నింటినీ ఏక మొత్తంగా ప్రదర్శిస్తుందామె

పరందామం యిల్లాలి విసుగుని అర్థం చేసుకున్నవాడయి- వెంటనే పరుగు ప్రారంబించాడు

పతి ఆ సరికే కాంట్రాక్టర్ కోదండం గారింటిలో – అతని ముద్దులపట్టి సురేఖకి హోమ్ వర్క్ చేస్తున్నాడు

పతీ నాయనా! ఇక్కడున్నావా రా నాయనా! మా ఆవిడ యిల్లెగిరేలా కేకేస్తుంది గ్యాసయిపోయింది బొగ్గుల్తో వంట వండటం బొత్తిగా చేతకాదాయె అంటూ లోపలికి అడుగు పెట్టాడు పరందామం

పతి చిరునవ్వు నవ్వి- ఉండండి సార్! అయిపోవచ్చింది మీకేం ఫర్వాలేదు మీ సిలిండర్ ఈ రోజు యిస్తానని సాయంత్రమే చెప్పాడు యిప్పుడే వెళ్తాగా! అని సముదాయించాడు

వేడెక్కిన ఆయన హృదయం ఆ మాటలకు చల్లబడింది

సురేఖ హోం వర్క్ పూర్తి చేసేసి లేచి బయటకు నడిచి సైకిల్ వేసుకుని పరందామంగారి ఖాళీ సిలిండర్ పట్టుకుని మార్కెట్టు కెళ్లి మళ్లా అరగంటలో క్రొత్త సిలిండర్‌తో వాలాడు

ఆ యిల్లాలి మొహం మతాబులా వెలిగిపోయింది

ఏమోయ్ పతీ! యిక్కడున్నావా నాలుగిళ్ల పూజారివి నువ్వు అమ్మయ్య నిన్ను వెతికేసర్కి ప్రాణాలు పోయే యనుకో ఈ ఎండలో ఈ పుస్తకాలు మొన్ననగా సూర్యా బైండింగ్ నుండి అద్దెకు తెచ్చాను వీటినిచ్చేసి క్రొత్తగా మార్కెట్టులోకి అడుగుపెట్టిన మల్లాది యండమూరివీ నవల్స్ పట్టుకురా! అద్దె మొత్తం చెల్లిస్తానని చెప్పు మరిచిపోకయ్యా అని చిత్తరంజన్‌గారు చేపాటికర్ర వూపుకుంటూ వచ్చేసారు

అక్కడ ఏ ఒక్క క్షణం జాప్యం చేయకుండా వెంటనేసైకిల్ ఎక్కి లైబ్రరీకి వెళ్లాడు

ఓ అరగంటకల్లా తిరిగొచ్చిన పతి తెచ్చిన యండమూరి తాజా నవలా రాజాలు చూడ్డంతోటే కాలక్షేపం కోరుకునే ఆయన వృద్ధాప్య హృదయం అవదిలేని ఆనందం పొందింది

పతీ నువ్వేనయ్యా! నిజమైన వర్కర్‌వంటే! చెప్పిన పని టక్కున చేసి పెడ్తావు అని పొగిడేసారాయన పతిని వుబ్బించాలని ఆయన ప్రయత్నం అది వ్యర్థమైంది

పతి దేనికీ ఉబ్బితబ్బిబ్బవడు సాదాగా తీసుకుంటాడు ప్రతీ పనీ తన కర్తవ్యంగా బావిస్తాడు

జీవితంలో ఎవర్నీ వంచించకూడదనే అతని వుద్దేశ్యం పని దొంగతనం కిట్టనిపని అందుకే ఎవరేది చెప్పినా అడ్డు చెప్పడు దేనికీ బొంకడు జంకడు

పతి యిలా సైకిల్ని చిత్తరంజన్ గారింటి అరుగుపైకి ఎక్కించాడో లేదో రాజనాథంగారి నుండి కబురూ!!

కాలనీ చివరి యిల్లు రాజనాథంగారిది

ఆయనకి కారు దగ్గర్నుండీ బొచ్చుకుక్కదాకా అన్నీ ధనవంతుల హోదాకి తగ్గవే వున్నాయి

సైకిల్ దించుకుని రాజనాథం గారింటి కెళ్లాడు పతి

అయ్యవారేం పిలిచారు నెమ్మదిగా అడిగాడు పతి

ఏంలేదు! ఈ రోజు క్రొత్త సినిమా ఏదో రంజనీకి వచ్చిందట పిల్లలు వెళ్దామని తెగ సర్దాపడుతున్నారు అడ్వాన్సుగా టిక్కెట్స్ బుకింగ్ చేయాలి నేన్చెప్పానని చెప్పు ఈలోగా ఫోన్ కొడ్తాలే అని జేబులోంచి వంద కాగితంతీసి యిచ్చారు రాజనాదం

అది పట్టుకుని బయలుదేరాడు పతి

సినిమా హాలు దగ్గర జనంని తోసుకుని రాస్తుకుని మేనేజర్ రూంలోకి ప్రవేశించటాన్కి నానాపాట్లు పడాల్సి వచ్చింది తీరా టిక్కెట్స్ తెచ్చుకుని బయట పడేసర్కి సైకిల్‌లేదు అటూ యిటూ వెతికాడు అదే సమయానికి- ఏరా! దొంగనా కొడకా యిక్కడేటి చేస్తున్నావ్! బ్లాకులో టిక్కెట్స్ వ్యాపారం ఎప్పట్నించి మొదలెట్టావు క్రొత్త కొండేటిలాగున్నావు అటూ యిటూ సూస్తున్నావ్! అనడిగాడు పోలీసు అంతేకాక ముడుకులమీద లాఠీతో ఒకటంటించాడు

బాధతో విలవిల్లాడాడు పతి

అది కాద్సార్! యిది రాజనాథంగారివి కావలిస్తే మేనేజరుగార్ని కలుసుకొని అడగండి ఆ మాటకి మారు మాట్లాడకుండా వెళ్లిపోయాడు పోలీసు

సైకిల్ కోసం కళ్ళు గాలించాయి

రొడ్డు వారగా వుంది

అక్కడ ఓ పోలీసు సిద్ధం రాంగ్ పార్కింగ్ క్రింద కేసు బుక్‌చేస్తానని బెదిరించాడు స్టేషన్‌కి రమ్మన్నాడు తన తప్పు ఒప్పుకొని రాజనాథంగారి పేరు చెప్పి బైటపడ్డాడు

ఇన్నిపాట్లు- అగచాట్లు పడి టిక్కెట్స్ పట్టుకుని వెళితే యింతాలస్యం ఎందుకయిందని తలవాచేలా చీవాట్లు పెట్టా రాయన జరిగింది చెప్పినా ఎంతమాత్రం నమ్మక కట్టుకథని కొట్టిపారేసారు అదే పతి మనసులో సూదిలా గుచ్చుకున్నట్టయింది నేల చెరగులా వ్యాపించిన నల్లటి చీకటిలా అంతరంగమంతా బాధ నిండింది

ఇలా పతి వారందరిపాలిట కోరికలు నెరవేర్చే కల్పవృక్షంలా అయినాడు ఏనాడూ తన శ్రమకి తగిన ప్రతిఫలం యింతని ఒత్తిడి చేయలేదు ఎవరేది

యిస్తే అది పట్టుకెళ్ళి దాంతో నే కడుపు నింపుకుంటూ కుటుంబం పోషించుకునేవాడు

పతికి- ప్రేమని అనురాగాన్ని ఆప్యాయతనీ పంచిపెట్టిన అతని జన్మనిచ్చిన తల్లి బాగా శక్తి వున్న రోజుల్లో అతనికి కావల్సినంత చాకిరీ చేసివుంది పతి పెద్దయి నాలుగాకులు చదివేసినా నిరుద్యోగిగా మిగిలినందుకు తనని ప్రభుత్వాన్ని తిట్టుకుంటూ కూర్చోకుండా- ఏదో ఒక పని చేయడాన్కి సిగ్గుపడకుండా నెట్టుకుంటూ రాగల్గుతున్నాడు

ఇలా పతి గుణగణాలను ఎంత చెప్పినా సరిపోదు

* * * * *

ఉదయం లేస్తూనే తల్లిని ఎలా వుందని ప్రశ్నించాడు పతి

ఒరే పతీ! నాగురించెందుకురా అలా బాధ పడ్తావు ఉండి వుడిగిపోయే ఈ ప్రాణం కోసం ఎందుకురా నీ తపన వెళ్ళి నీ పని చూసుకురా! అని చెప్పినా- ఆమె పరిస్థితిని చూసాక కదలాలనిపించ లేదు పతికి

దైన్యంతో మనసంతా గూడు కటు కుపోయింది

చింతాక్రాంతుడైనాడు ఆందోళన ముప్పిరిగొంది

తనకి ఏమీ లేదని తల్లి చెప్పినంత మాత్రాన- వైరాగ్యం నిండిన పలుకులు తల్లి నోటి నుండి వెలువడ్డా కొలిమిలోని యినుప చువ్వలా కాలుతున్న ఒంటినీ- కఫం తెగకుండా వస్తున్న పొడిదగ్గునీ తల్లి రోగ తీవ్రతని చాటుతుంటే తల్లిని ఒంటరిగా వదిలిపెట్ట లేక పోయాడు పతి

ప్రైవేటు డాక్టర్స్ దగ్గరకు తీసుకెళ్ళే స్తోమత లేకపోయినా కనీసం ధర్మాసుపత్రి మందైనా పోయించాలంటే అక్కడ కంపౌండర్స్‌కీ నర్సమ్మలకీ చెయ్యి బరువు చేయాలి

కాని ఆ బరువుకి పెట్టడాన్కి- తన జేబులు బరువుగాలేవే! అందుకే ఆయుర్వేద మందులు యిచ్చే ఆచారిగారి మందులతో నే తల్లి రోగం 'నయం కాదాన్నంత ఆశగా వున్నాడు

ప్స్ !!

జీడిలా వదలని మొండి జబ్బు కాబోలు వదల్నం లేదు పతి అలా దీర్ఘంగా నిట్టూరుస్తూ- ఆలోచిస్తున్నంతలో రాజనాథంగారి బావమరిది రామమిశ్ర పరిగెట్టుకుంటూ వచ్చాడు

అయ్యో! పతీ! నువ్వింకా రాలేదేమయ్యా నీ కోసం అంతా వెర్రెత్తి పోతున్నారు రాజనాథంగారి కొడుకు బానుకి సడన్‌గా జబ్బు చేసింది గాబరా పెట్టేస్తున్నాడు ఆసుపత్రిలో జాయిన్ చేయాలంటే రాజనాదంగార్నేరు మనం తీసుకెళ్ళాలి పద పద అని ఆయాసంతో రొప్పుతూ చెప్పాడు

తల్లి గురించి కూడా మరో ఆలోచన పెట్టుకోకుండా పరుగు లంకించుకున్నాడు పతి

కాలనీలో అంతా రాజనాథంగారింటి, చుట్టుముట్టారు రాజనాథంగారు వూర్లో లేరని చెప్పి అతని బార్య ఏడ్చింది

కరిగిపోయాడు పతి

వెంటనే ఆసుపత్రికి వెళ్ళాలని చెప్పి- బాను శరీరాన్ని రెండు చేతుల్లోకి తీసుకొని రిక్షా దగ్గరకు నడిచాడు

రాజనాదంగారి బార్య పతిమీదే సర్వ బాధ్యతలూ వుంచింది ఆసుపత్రిలో జాయిన్ చేసాక డాక్టర్ పరీక్షించాడు

భానుకి రక్తం ఎక్కించాలని చెప్పాడు

ఎంత కావలిస్తే అంత డబ్బు యిస్తానంది రాజనాథంగారి సతీమణి కాని బ్లడ్ బ్యాంకులో ఆ గ్రూపు రక్తం లేదని చెప్పాడు డాక్టర్

ఇంక రక్తం ఇవ్వటాన్కి ముందుకొచ్చిందామె ఆమె అణు వణువునా కొడుకు బ్రతికి బట్టకట్టాలనే నిండైన ఆశయం వుంది

ఆమె ఆశయాన్ని ఎగతాళి చేసినట్టుగా ఆమె బ్లడ్ గ్రూపు వేరైపోయింది

పతి వెంటనే రక్తం యివ్వడాన్కి సిద్ధపడ్డాడు

పతీ నువ్వా! అందామె

ఏమ్మా! బాను నా ప్రాణం నేనంటే బానుకి ఎంత ప్రేమో మరి నేనతనిపట్ల ప్రేమ చూపొద్దూ! అని హృదయ పూర్వకంగా పలికాడు

వెంటనే డాక్టర్ పతి రక్తం పరీక్షించాడు

అయితే బాను బ్రతికి బయటపడే అదృష్టం- నొసట్న వ్రాసి వుండబట్టి కాబోలు- పతి రక్తం సరిపోయింది

బ్లడ్ ఎక్కించటాన్కి సర్వ సన్నాహాలు సిద్ధమైనాయి

చాలా సమయం తర్వాత నీడిల్ లాగేసాడు డాక్టర్

వెంటనే బలానికి ఏవో యిచ్చాడు డాక్టర్!



కాళ్ళల్లోంచి నీరసం ఒళ్ళంతా తేలిపోతున్నట్టుగా అయిపోయింది

చాలాసేపు విశ్రాంతి పొందాడు

వెంటనే అడుగులు వేసుకుంటూ బయటపడ్డాడు

వాళ్ళు వెళ్ళిపోయినట్టున్నారు

టాక్సీలో ఎపుడో వెళ్ళిపోయారు చెప్పాడు కంపౌండరు

ఒక్కసారి ఎదంతా కోసినట్టయింది

తన గురించి పట్టించుకోకుండా వెళ్ళిపోవటం అతన్నెంతో కృంగదీసింది

అయినప్పటికీ అదేం మనసులో పెట్టుకోకుండా రాజనాథంగారింటికి నడిచాడు

భానుకళ్ళల్లో కోటి వెల్గులు రావటం అయింటి అందర్నీ సంతోష సెలయేటిలో ముంచెత్తింది

పతిని చూసినా ఏమాత్రం కృతజ్ఞత తెలపలేదు రాజనాథం

వారందరూ ఎవరిధ్యాసలో వారుండటంతో పతి యథాలాపంగా యింటికి నడిచాడు

దారిలో తల్లి జ్వరంతో బాధపడ్డం జ్ఞప్తి కొచ్చింది మనసు సన్నగా మూలిగింది నిస్సత్తువగా వున్నా పాదాలు సాధ్యమైనంత వడిగా నడవడాన్కి కృషి చేసాయి

ఇంటి దగ్గర – తల్లి మంచం చుట్టూ ఎవరో అమ్మలక్కలు చేరివున్నారు

ఎక్కడికి పోయావు నాయనా పతీ! తల్లిని ఒంటరిగా వదిలి వెళ్ళిపోవటం నీకు ధర్మమేనా! నీ తల్లి ఆరోగ్యం క్షీణించింది వెంటనే డాక్టర్ని పిలు అని చెప్పిందామె

పతికి కాళ్ళు చేతులు తేలిపోయినట్టు మరింతగా అనిపించింది అంత నీరసంలోనూ ఆచారిగార్ని పిలుచుకు వచ్చాడు తన వల్ల కాదన్నాడు ఆచారి

మళ్ళా మరో డాక్టర్ని బ్రతిమాలి పిలుచుకొచ్చాడు

వెంటనే రక్తం ఎక్కించ వలసిన అవసరం వుందని లేక పోతే ఆమె బ్రతకటం కల్లని చెప్పాడు డాక్టర్! తన ఆసుపత్రిలో జాయిన్ చేయమని చెప్పారు

ఆ డాక్టర్ కొంచెం ఉదారుడిలా అనిపించాడు పతికి వెంటనే తాత్సారం చేయక తల్లిని మెల్లిగా పొదివి పట్టుకుని ఎత్తుకుని రిక్షాలో వేసుకుని వెళ్ళాడు

ఈమెకు మీ రక్తం సరిపోతుందేమో చూద్దాం అని పతి రక్తం పరీక్షించి సరిపోయిందన్నాడు

కాని ఆ వెంటనే డాక్టర్ – పతీ! మీరీరోజె వరికోసమైనా రక్త దానం చేసారా! నిజం చెప్పండి లేకపోతే మీ ప్రాణానికి ప్రమాదం అన్నాడు

నిజం చెప్పాడు పతి

అయితే మీరీక్షణంలో రక్త దానానికి అనర్హులు బ్లడ్ బాటిల్ కావాలి నా దగ్గరుండవవి తెప్పించాలంటే అయిదు వందలవు తుంది యివ్వండి ఓ గంటలో పల తెప్పించి ఎక్కిస్తే గాని ప్రాణం నిలవదు అని హెచ్చరించాడు

పతి కళ్ళు తేలవేసాడు

దరిద్రుడికి అన్నీ ఒక్కసారే ప్రతికూలిస్తాయి తన రక్తం పరోపకారార్థం దానం చేయవలసి వచ్చింది

లేకుంటే తన తల్లిని దక్కించుకోవటాన్కి ప్రయాస పడాల్సిన అగత్యం పట్టేది కాదు

అయితే ఎలా?

డాక్టర్ చెప్పిన గడువులోగా డబ్బు సంపాదించాలి అనుకున్నదే తడువుగా వెంటనే తను పని చేసే కాలనీకి వెళ్ళాడు

మొట్టమొదటగా కోదండంగార్ని కలిసాడు

ఆయన విషయం అంతావిని తన దగ్గర లేవని పెదవి విరిచారు తన సహాయం ఏవిధంగానైనా చేయటాన్కి ముందుకొస్తానని ఒక్కమాటనలేదు

పరందామం కూడా అంతే! ఒక గంట క్రితం తనని అడిగి వుంటే డబ్బుని నిముషాల్లో యిచ్చి వుండేవాడినని అన్నాడు ఏదో కారణం చెప్పాలని

ఏరాయైతేనేం పళ్ళూడగొట్టుకుందికి అన్న సామెత స్ఫురించింది పతికి

అప్పుడు చప్పున రాజనాథం గారు మెదిలారు

ఒళ్ళంతా నీరసం క్రమ్మేస్తోంది

మనసులో ఆందోళన కుదిపేస్తోంది రాజనాదంగారితో – అయ్యా! మా అమ్మకి జబ్బు చేసింది రక్తం ఎక్కిస్తే గాని బ్రతకదన్నాడు డాక్టరు నా రక్తం మీ అబ్బాయికి యివ్వబట్టి నేను దాతగా పనికి రానని చెప్పాడు దయచేసి ఓ అయిదు వందలుంటే యిప్పించండి అని వేడుకున్నాడు

ఆయన వెంటనే ఆగ్రహం వెలిగ్రక్కి – అయినా నీ వెధవరక్తం మావాడి కిచ్చాననేగా నీటిక్కు దానికి వెల కడితే ముందే యిచ్చేవాళ్ళం అయినా నువ్వెందుకు అప్పుడు చెప్పలేదు యిప్పుడింత హఠాత్తుగా వస్తే ఎవడిస్తాడని అన్నాడు

సార్! నా రక్తానికి ఖరీదుకట్టి అడగటాన్కి రాలేదు నా తల్లి ప్రాణం నిలపడడాన్కి మీ ఆర్థిక సహాయం అర్థిస్తున్నానంతే! అని ఆవేదనగా పలికాడు

కాని నిప్పులు చెరిగే రాజనాథం గారి ముఖం వంక చూడలేక నీరసంతో అల్లాల్లాడి పోతున్న శరీరాన్ని జాగ్రత్తగా కదిలించి బయలు దేరాడు

పతిని చూస్తూనే డాక్టర్ – సారీ పతీ! నీ జన్మనిచ్చిన తల్లిని కాపాడుకో లేక పోయావు అది నీ అసమర్థతో దురదృష్టమో నాకు తెలీదు శవాన్ని తీసుకెళ్ళి మిగతా కార్యక్రమం చూడు అని చెప్పాడు కాస్త బాధగా

పతి అమ్మా అంటూ ఘోరంగా విలపించాడు

అది దిగంతాల ప్రతిధ్వనించింది

అంతే

పతి తల్లి శవాన్ని చేతుల్లోకి తీసుకుని నడవ సాగాడు ఇంటి వైపుకు కాదు!

తానింతకాలం నమ్మినబంటులా పని చేసిన కాలనీకి సాయంత్రంఅంతా ఆరుబయట వాలు కుర్చీల్లో విశ్రాంతి తీసుకుంటున్నారు

కాలనీ మధ్య అమనుషుల నడుమ శవాన్ని దించి– చూడండి సార్! మీరంతా కలసి చంపేసిన నా తల్లి శవాన్ని. నా చెమటోడ్చి మీకు పనులు చేసానే! అందుకు మీరిచ్చిన ప్రతిఫలం చూడండి – ఓ అయిదొందలు అప్పుగా యివ్వడాన్కి కూడా తలలు త్రిప్పేసి వెళ్ళి పోయారే! మీ నిర్దాక్షిణ్యానికి ఫలితం కనండి "రాజనాథం! రోగంతో నాతల్లి తల్లడిల్లి పోతున్నాసరే– నీ బిడ్డడికి సేవచేయాలని రెక్కలు కట్టుకు వాలి నారక్తం ధారపోసాను కాని నాతల్లి ప్రాణ సంకటంలో వుంటే కనీసం సానుభూతిగా నయినా సాయపడలేదు. నా తల్లి కాద్రా జబ్బు మనిషి సాటి మనిషి సాయం చేస్తే కనీసం ఆసహాయానికి కృతజ్ఞత చూపక పోవటమనే జబ్బున్న మనుష్యులురా మీరు ఎంత కాలంగానో సంక్రమిస్తున్న ఈ జబ్బు అంత రిస్తే గాని ఈ సమాజం బాగు పడదురా!! బాగుపడదు అంటూ శవంపైపడి భోరున విలపించాడు పతి □






# అందాలు చిందే ఫ్రెస్కా
# సుగంధాలు చిమ్మే ఫ్రెస్కా

Fresca

గోద్రెజ్ సమర్పణ.
అద్భుతమైన లగ్జరీ సబ్బు.
ఫ్రెస్కా. విలాసవంతమైన, విలువైన సుగంధ పరిమళభరితమైన సబ్బు.
ఎంతో నురుగు—పాల మీగడ తరగలా. త్వరగా తరగనిది. అరగనిది ఫ్రెస్కా.
లగ్జరీ సబ్బు. మీకు నచ్చే మిమ్మల్ని ఆశ్చర్యపరిచే తక్కువ ధరలో.




## *గోద్రెజ్ వారి అందం చిందించే అద్భుత

* బరువు 75 గ్రాములు. స్థానిక పన్నులు అదనం.




ఎం ఎస్ ఎన్ అన్నవరం

★ మెరిట్‌కు సమాధి కడుతున్న నేటి సమాజాన్ని చూస్తే మీకేమనిపిస్తుంది?

● బ్రతికాను- ఇప్పుడు చదువుకోవలసిన- గతి పట్టనందుకు- అనుకుంటాను!

★ కొందరు ఆంగ్ల నవలలను కాపీ కొట్టి తెలుగు నవలలు రాస్తున్నారన్న నానుడి వుంది- ఇది ఎంతవరకు నిజం అంటారు?

● ఆయా రచయితలే ఆ నిజాన్ని ఒప్పుకుంటున్నారన్న నానుడి కూడా వుంది వినలేదా?

★ ఆత్మలనేవి వున్నాయంటారా?

● వుండే వుంటాయి- లేకపోతే తప్పు చేసినప్పుడు బాధెందుకు పడతాం?!

★ మనిషి రాక్షసుడిగా మారేది ఎప్పుడు?

● ఒక్క సినిమాలలోనే!- చివరికి మంచి చేయడం కోసం- మొదట్నుంచీ రాక్షసుడిలా ప్రవర్తిస్తాడు మనిషి నిజ జీవితాలలో రాక్షసులని అనమాలు పట్టడం కష్టం

★ మనిషికి మనిషికి గల తేడా ఏమిటి?

● వారి వారి తత్వాలు

★ సామాజిక స్పృహ అంటే ఏమిటో వివరిస్తారా?

● చుట్టూ చూడడం చుట్టూ జరుగుతున్నవి గమనించడం అర్థం చేసుకుందుకు ప్రయత్నించడం- అని నేను అనుకుంటున్నాను- కాని అందరూ ఇది ఒప్పుకోరు- వారి స్పృహ వేరు?!

ఎస్ వి ఆర్ జువారినగర్, గోవా

★ ఇంతకీ చెప్పేవారికి బుద్ధిలేకపోతే వినేవారికైనా వుండాలంటారు?

● ఉండదు వినలేదా- క్యూరియాసిటీ కిల్డ్ ఎ కేట్! వినకుండా వుండలేరు!

పి ఎస్ ఆర్ పర్లాకిమిడి

★ మంచిని మరచి వంచన నేర్చి నరుడే ఈనాడు వానరు డైనాడు అంటాను మీరేమంటారు?

● మనిషిని కోతితో పోలుస్తారెందుకు- ఆదేం పాపం చేసుకుందనీ? అయినా ఏ కవి రచనో వినడానికింపుగా వుంది

బి కె బి అనంతపురం

★ నేను ఒక అబ్బాయిని ప్రేమించాను అతను నన్ను ప్రేమిస్తున్నాడు నేను ఉత్తరాలు రాస్తే జవాబు యివ్వడు కన్పిస్తే చూసీ చూడనట్టు పోతాడు అతని ప్రవర్తన నాకర్థం కావడం లేదు

● ఇంకా యిందులో అర్థం కానిదేముంది చిట్టితల్లి ఆడది- తనంతట తానై వచ్చిపడితే- ఏ మగాడికేనా అసహ్యం వేస్తుంది మంచివాడు తప్పించు కుంటాడు జల్సారాయుడు సరదా తీర్చుకు పోతాడు అయినా యీ ఉత్తరాలు రాయడం అదీ పరిచయంలేని వ్యక్తిని ప్రేమిస్తున్నా నంటూ ఎవరు నేర్పిన విద్య? సినిమాలా? నవలలా? తోటి స్నేహితులా? ఆడపిల్లలీ ప్రేమ లేఖల విషయంలో జాగ్రత్తగా వుండాలి నవ్వుల పాలవుతారు లేకుంటే అంతే నేను చెప్ప కల్గినది

ఎమ్ ఆర్ కోటబొమ్మాళి

★ క్రిస్టియన్ స్త్రీలు బొట్టు ఎందుకు పెట్టుకోరు?

● వారిలో కొందరి సంప్రదాయం అది ఎవరికేనా బొట్టు అలంకరణ ప్రాయమే

★ వరకట్నంపైమీ అభిప్రాయం?

● ఆధునిక యువత సిగ్గుతో తలవంచుకోవలసిన- సంప్రదాయం

★ మీరు ప్రేమించి పెళ్ళి చేసుకొన్నారా? పెద్దలు నిర్ణయించిన పెళ్ళి చేసుకొన్నారా?

● ప్రేమించి పెద్దల యిష్టంతో రిజిస్టరు చేసుకున్న వివాహం మాది

★ మీరు నేటి సమాజంతో ఏకీభవిస్తున్నారా? వ్యతిరేకిస్తున్నారా?

● చచ్చినట్టు అనుభవిస్తున్నాను! నేనూ యీ సమాజంలో మనిషినే కద

కె కె పి, రాజమండ్రి

★ నేను ప్రశ్నావళి తరుచు చదువుతాను మీ జవాబులు కొన్ని మరలా మరలా వంట చేసుకుంటూ తలచుకుంటూ వుంటాను మిమ్మల్ని ప్రశ్నలు వెయ్యాలని కాదుగాని మిమ్మల్ని ఒక్కసారి చూడాలని చాలా వుంది సాధ్యమా?

● ఎందుక్కాదు?! నా జవాబుల్లో తరచూ నేను కన్పిస్తూనే వుంటాను కద!

సిహెచ్ ఆర్, చదలవాడ

★ లేని వాడు కూడా ఉన్నవాడినే సమర్థిస్తున్న ఈ రోజుల్లో లేనివాడికి న్యాయం జరిగేది ఎప్పుడు?

● లేనివాడు లేనివాడుగా ఉన్నంత కాలమే కద ఉన్న వాళ్ళు అధికారం చలాయించ కలరు? అంచేత లేమిని పోగొడతామన్న వాని స్లోగన్ను కంఠశోషే గాని కార్య సాధనలో కాదని యిప్పటికేనా తెలియకపోతే ఎలా? పేదవాడు ఆశతో గొప్పవాడితోనే సహకరిస్తాడు గొప్పవాడు పేదవాడికి ఆశ చూపిస్తూనే పబ్బం గడుపుకుంటాడు అది లోక నీతి

సిహెచ్ ఎన్ ఆర్, సత్తెనపల్లి

★ పూర్వం మతం ఆచారం పేరిట మహిళలను యింట్లో వుంచే వారు నేడు దోపిడీలు దౌర్జన్యాలు ఆర్థికస్థితి మొదలైన కారణాల వల్ల మగవాళ్ళు మహిళలను ఇంట్లో బంధించుతున్నారు నాటికి నేటికి జరిగే యీ అన్యాయాలలో తేడా వుందా?

● ఎందుకు! అప్పుడు కాస్తేనా గౌరవంగా యింట్లో పడి వుండేది ఇప్పుడు పురుషునితో సమఉజ్జీగా వుంటూనే చిన్న చూపుకి గురి అవుతోంది నాడామె పోషింపబడేది నేడు తానే పోషిస్తూ వుండీ నిందలకు గురి అవుతోంది దీన్ని పట్టి చూస్తే మగవాడు మారడు మారినట్టు నటిస్తాడు ఆడది కాలంతో పాటు మారి మారని యింటి వాతావరణంలో వూపిరి ఆడక గిలగిలలాడుతోంది

★ దురుసుగా జవాబులివ్వడానికి కారణం పాఠకులు దూరంగా వుంటారు ఏమీ చేయలేరు అనే భావన మీలో వుండడమేనా?

● కాదు ఇంత ఒళ్ళుండగా నోటి మీద కొడతారా అన్న నమ్మకం! అయినా నిజం చెప్పడం దురుసుతనం ఎలా అవుతుంది?' నంగిరిగా చెప్తే అతి మర్యాద చూపడం అవుతుందా?'

వి ఎన్ ఆర్, హైదరాబాదు

★ రామలక్ష్మిగారూ! మీరెందుకు రాస్తున్నారు?

● ఎప్పటికేనా నా కోరికా నా నేర్పూ కలిసి ఓ మాస్టర్‌పీస్ రాయలేకపోతాయా అని! □



# అభిమాన తారలపై అభిప్రాయం

బహు భాషా కథా నాయకుడు కమల్‌హాసన్ నా అభిమాన నటుడు. కమల్ నటిస్తాడు అనేకంటే జీవిస్తాడు అంటే అతిశయోక్తి కాదేమో. నాటి "మరో చరిత్ర" నుండి నేటి "స్వాతిముత్యం" వరకు విభిన్న పాత్రలు పోషించి అందరిచేత సెహభాష్



అనిపించుకున్న జాతీయ నటుడు కమల్‌కు త్వరలో ఆస్కార్ అవార్డు రావాలని కోరుకుంటున్నాను.

-సంకెపెల్లి కృష్ణ, వేములవాడ (కరీంనగర్)

★ ★ ★

నా అభిమాన నటి భానుప్రియ. నేను సితార చిత్రం చూచి ఆమె అభిమానినయ్యాను. నాటి నుండి యీ నాటి వరకూ ఆమె నటించినటువంటి ప్రతి సినిమా తప్పకుండా చూస్తున్నాను. "అన్వేషణ, ఆలాపన,



విజేత, కార్తీక పౌర్ణమి" చిత్రములలోని ఆమె నటన నాకు బాగా నచ్చింది. భానుప్రియ గారు యిక ముందు, ముందు సంగీత భరిత చిత్రాలకు ఎక్కువ ప్రాధాన్యత యివ్వాలని సూపర్ హీరోయిన్ కావాలని ఆమెకు ఒక అభిమానిగా గాక ఒక సోదరుడిగా నా అభిలాష. ఆకాంక్షకూడా.

—కె. పల్లారెడ్డి, కొమరిపాలెం, (తూ. గో.)

★ ★ ★

నా అభిమాన నటి అర్చన. అనతికాలంలోనే అశేష ఆంధ్రుల అభిమానాన్ని సంపాదించుకొన్న అందాల



నటి. మంచి ఒడ్డూ పొడవు వున్న పర్సనాలిటీ, తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించు కొన్నటువంటి నటి. ఎవరికీ లేని వంటి తన కళ్ళతో అభినయించటం అర్చన ప్రత్యేకత. ఈ ఏడు ఎన్నో విజయాలను సాధించి రాష్ట్ర ప్రభుత్వ స్పెషల్ జ్యూరి అవార్డుకు అర్హత సంపాదించుకొంది. ఇంకనూ విభిన్న పాత్రలను పోషించి నటనతో ప్రేక్షకులను మెప్పించి నటనకు తగ్గ నటి కావాలనినా ఆశ.

-బి. యస్. వి. రమణ, నంద్యాల

★ ★ ★

నా అభిమాన నటుడు చిరంజీవి. అందుకే చిరంజీవి నటించిన ప్రతి చిత్రాన్నీ చూస్తాను. అయితే ఆ మధ్య చిరంజీవి నటించిన చిత్రాలన్నీ వరుసగా ఒకే మూసలో పోసినట్లున్నా, ఈ మధ్యే విడుదలయిన అన్ని వర్గాల ప్రేక్షకుల్ని ఆకర్షించి విజయవంతంగా నడుస్తున్న "దొంగ మొగుడు" వెరైటీగా ఉంది. తరువాత రాబోయే "ఆరాధన", "చక్రవర్తి" చిత్రాలు కూడా వెరైటీగా ఉండి విజయవంతం కావాలని



కోరుకుంటున్నాను.ఏఎన్నార్‌తో తప్ప ప్రతి తెలుగు హీరోతో కలిసి చిరంజీవి నటించాడు. అందుకే మహానటుడు అక్కినేనితో కలిసి "చరిత్ర సృష్టించే" చిత్రంలో నటిస్తే చూడాలని ఉంది.

-ఎ. వి. రమణ, కృష్ణానగర్, జగిత్యాల

★ ★ ★

నా అభిమాన హీరో "యువ కిషోర్" యువరత్న నందమూరి బాలకృష్ణ. ఆయన నటించిన చిత్రాలు అన్నీ మొదటి రోజే చూస్తాను. పట్టాభిషేకం



సినిమా చూసిన దగ్గర నుంచి నేను ఆయన అభిమానిగా మారాను. మొన్నటి "ముద్దుల క్రిష్ణయ్య", నిన్నటి "భార్గవ రాముడు" లాగానే "సాహస సామ్రాట్" కూడా విజయం సాధించింది. ఇక ముందు కూడా కథాబలం గల చిత్రాలలో నటించి తండ్రికి తగ్గ తనయుడు కావాలని ఆయన అభిమానిగా నేను ఇచ్చే చిన్న సలహా.

— పి. మోహన్‌కుమార్, భట్టువానిపల్లి, (అనంతపురం)

★ ★ ★

"నా పేరే సాహసం నా ఊపిరి సహ ధర్మం నా ధ్యేయం ప్రజా క్షేమం నా పిలుపే ప్రభంజనం" అంటూ 'వజ్రాయుధం'లా ముందుకు వచ్చిన సూపర్‌స్టార్ కృష్ణ నా అభిమాన నటుడు.. నాటి 'అల్లూరి సీతారామరాజు' నుండి నేటి 'సింహాసనం' వరకు తెలుగు తెరపై తిరుగు లేని హీరోగా వెలుగొందుచున్నాడు. నటనలోనే కాకుండా దర్శకత్వం వహించటంలో కూడా తనకు తానే సాటి



అని నిరూపించుకున్నాడు. కృష్ణ నటిస్తున్నాడు అనే కంటే నటనలో జీవిస్తున్నాడు అనే చెప్పు కోవాలి.

-ఐ. యస్. రాజేశ్వరి, నర్సరావుపేట

★ ★ ★

చిరునవ్వులు చిందిస్తూ ఒయ్యారం ఒలికించే అందాల తార చిరు మందహాసిని సుహాసిని నా అభిమాననటి. సినీ నీలాకాశంలో "స్వాతి" నక్షత్రమై మెరిసి "స్రవంతి"గా వెలిగి తన "సిరి వెన్నెల"తో సినీ జగత్తుకే వెలుగును ప్రసాదించి "సింధు భైరవి"తో



జాతీయ అవార్డును అందుకొని అఖిలాంధ్ర ప్రేక్షకుల హృదయాలను దోచుకున్నది. "లాయర్ సుహాసిని"గా అభిమానుల ఆదరణ చూరగొంటూ "గౌతమి"గా మన ముందుకు రాబోవుచున్న "ముద్దుల మనుమరాలి"ని ఎప్పటివలె అభిమానిస్తారని ఆశిస్తాను.

-టి. సూర్యకుమారి, అమరావతి

★ ★ ★

నా అభిమాన నటుడు, డాషింగ్ అండ్ డేరింగ్ సుప్రీమ్ హీరో చిరంజీవి. ఆయన నటించిన దొంగ,



శుభలేఖ, విజేత, చంటబ్బాయి, రాక్షసుడు, దొంగ మొగుడు చిత్రాలు ప్రేక్షకులు మరువ లేనివి. వేట, కిరాతకుడు వంటి చిత్రాలలో నటించవద్దనీ, విజేత, చంటబ్బాయివంటి చిత్రాలలోనే నటించాలనీ అభిమానిగానా కోరిక.

-పి. పర్వతకుమార్, త్రిపురాంతకం (ప్రకాశం)

ఇటలీవారు గుర్తించిన సత్యం
అందమైన ఇంటి శోభ
అడుగు మోపగానే తెలుస్తుందని.
ఆపైనే కళ్లకు కనిపిస్తుందని.

నెత్తిపై కప్పున్నది ఉంటే చ ఇల్లవుతుందని ఎవరన్నారో గానీ, వారు రీజెన్సీ ఫ్లోరు చూసి ఉండలేదు పాపం!

అందమైన ఫ్లోరు దృఢంగా కూడ ఉండగలదనడానికి రీజెన్సీ ఒక నిదర్శన.

దీనికి అసలు కారణం రీజెన్సీకి ఇటలీతో గల సంబంధం.

రీజెన్సీ టైల్స్ ఇటలీదేశపు వెల్కో ఇండస్ట్రియల్ వారి సహకారంతో తయారు చేయబడినవి. ఈ కంపెనీ ప్రపంచంలో న్యూమరో యూనో—అంటే నెంబర్ వన్.

ఆధునికమైన లేత ఛాయల నుంచి అందమైన ముదురు వన్నెలదాకా రకరకాల రమ్యమైన రంగులు.

ఈ రంగురంగుల టైల్సుని కళాత్మకంగా అమర్చి పరవవచ్చు. అంచ కట్టవచ్చు. కంటికింపైన డిజైన్లుగా వేసుకోవచ్చు. ఒక్క మాటలో చెప్పాలంటే ఇటలీ దేశపు కళాఖండమొకదాన్ని నేరుగా మీ యింట్లోనే సృష్టించుకోవచ్చు. అది మీ స్వంతమైనందుకు గర్వించవచ్చు!

ఇకపైన పాత టైల్సుతోటి బాధలు మరిచిపోండి. సదా సంతృప్తినిచ్చే సరికొత్త ఫ్లోరింగు వేసుకోండి.

రోజుల తరబడి రుద్ది రుద్ది పాలిష్ చేసే అంజాటం మరిచిపోండి. నిముషాల్లో సిద్ధమయ్యే రీజెన్సీ టైల్సు వేసుకోండి.

తుడిచి తుడిచి అలుపు పుట్టినా మురికి మొహంతో దర్శనమిచ్చే ఫ్లోరింగు మరిచిపోండి. మరకలు, గీతలు, పగుళ్లు పడని రీజెన్సీ టైల్సు పరుచుకోండి.

రీజెన్సీ తెచ్చుకోండి.
సదా శోభాయమానంగా జీవించం

# రీజెన్సీ
## ఇటాలియన్ సిరామిక్ టైల్స్

దిట్టమైన ఫ్లోరింగునే కోరుకోండి.
అందంగా మీ పాదాల దగ్గర పడి ఉంటుంది.



రీజెన్సీ
సిరామిక్స్ లిమిటెడ్

ఎస్. ఎస్. హౌస్,
చిరాగ్ అలీ లేన్, హైదరాబాదు 500 001.
ఫోన్: 237266/233017



మువ్వగోపాలుడు లో బాలకృష్ణ, విజయశాంతి

రాజా సత్తిబాబు పైడిబాబు కె ఎల్ ఎన్ శాస్త్రి కృషి చేస్తున్నారు సి హెచ్ సత్యనారాయణ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ కృష్ణ సమర్పణ

## వెంకన్నబాబు చిత్రం "చిలిపి మొగుడు"లో రేలంగి, రాజేంద్రప్రసాద్

జూన్‌లో పాటలు రికార్డ్ చేసి జూలై నుంచి షూటింగ్ అన్నారు మహేశ్వరీ మూవీస్ అధినేత ఎస్ పి వెంకన్నబాబు ఈయన కొత్త చిత్రంలో రాజేంద్రప్రసాద్ రజని గొల్లపూడి మారుతీరావు అన్నపూర్ణ వగైరా నటవర్గం సత్యానంద్ సంభాషణలు బి కోటేశ్వరరావు చాయతో రేలంగి నరసింహారావు దర్శకుడు

## డైరెక్టర్ కె హేమాంబరధరరావు 30వ చిత్రం "అన్నా నీ అనురాగం

ఇది హాస్య చిత్రం ఇందులో నేనింత వరకు డైరెక్ట్ చేసిన చిత్రాలలోని కొన్ని హిట్ సాంగ్స్ కామెడీ సన్నివేశాలు ఉంటాయి డాక్టర్ ఎన్ టి రామారావు ఇతర అగ్ర తారాగణం పాల్గొన్న సన్నివేశాలు ఏర్చి కూర్చి ప్రత్యేకంగా మరో హాస్య రచనను ఎన్నుకుని షూట్ చేశాం సి ఎన్ శివకుమార్ కథ మాటలు రాశారు అన్నారు శ్రీ వెంకట శివామూవీస్ పతాకంలో శ్రీమతి అరుణారాజ్ సి హెచ్ మోహనరెడ్డి నిర్మించిన ఈ విశిష్టమైన చిత్రానికి ఎం సుదాకర్ చాయ సి మోహనరావు కూర్పు బాలు ప్రొడక్షన్ నిర్వహించారు

ఇట్లా రాస్తేనయినా జనం
భయపడతారేమో చూడాలి!




# సినిమా విశేషాలు జి.వి.జి.

## "దొంగగారూ, స్వాగతం" చివరి షెడ్యూల్

మంచితనం మానవత్వం ఉన్న ఒక దొంగ ఒక జమిందారు కుటుంబంలోకి ప్రవేశించి అక్కడ జరిగే అవకతవకలను కనిపెట్టి అసలైన దొంగల ఆట కట్టించి నిజమైన మంచి దొంగగా ప్రశంస లందుకునే ఒక అపూర్వమైన పాత్రలో కృష్ణ విజృంభించారు ఆయనకు స్వాగతం చెప్పే దొరసానిగా విజయశాంతి నాయిక ఏప్రిల్ 27 నుంచి మే 6 వరకు ఊటీలో చిత్రీకరించిన మూడు పాటలతో మూడొంతులు పూర్తయింది చివరి షెడ్యూల్ మద్రాసులో జూన్ 1 నుంచి 15 వరకు అన్నారు జి రామమోహనరావు ఈయన దర్శకత్వంలో శుబోదయా ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత వై సత్యనారాయణ (అబ్బులు) నిర్మిస్తున్న ఫై చిత్రంలో జగ్గయ్య సత్యనారాయణ గొల్లపూడి మారుతీరావు గిరిబాబు శుభలేఖ సుదాకర్ వేలు కె కె శర్మ వినోద్ మాస్టర్ మీన్‌రాజ్, శ్రీలక్ష్మి వై విజయ అన్నపూర్ణ విజయవాణి పాల్గొంటున్నారు తెర వెనుక సాయినాద్ వేటూరి చక్రవర్తి పుష్పాల గోపీకృష్ణ కోదండం సత్యం నాగేశ్వరరావు సలీం

## ఇదా ప్రపంచం"లో అంతా అన్యాయం

అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్ రాజా (రాజశేఖర్) పోలీస్ స్టేషన్ కొచ్చాడు అతన్ని ఇన్స్పెక్టర్ శ్రీనివాసులు కూర్చోమని చెప్పి ఒరేయ్ బంగారూ! స్టేషన్‌కని చెప్పి రెండు టీ పట్రా బాగా లేకపోతే గ్లాసులు పగులుతాయని చెప్పు! అన్నాడు ఓ కానిస్టేబుల్‌తో

రాజా కూర్చుంటూ నీకు తెచ్చే టీ బాగా లేకపోతే గ్లాసులు పగలగొడతావా? అదే జనానికి అమ్మే టీ బాగా లేకపోతే ఆపని ఎందుకు చేయవు? స్వార్థంలో ఉన్న నిజాయితి డ్యూటీలో ఎందుకు లేదు నీకు? అన్నాడు

గురువా! ఈ ప్రపంచంలో జన్మనిచ్చే తల్లి మొదలు కాల్చి పారేసే కాటి కాపరి వరకు అందరూ స్వార్థంతోనే బ్రతకాలి లేకపోతే బ్రతకలేం అని శ్రీనివాసులు అంటూండగా టెలిఫోన్ బెల్ మోగింది రిసీవర్ అందుకుని సాంతం విన్నాక ఏయ్ టూ నాట్ త్రీ! సెల్లో ఉన్న వాడ్ని బయటకు తియ్! అన్నాడు

రాజా బలంగా నిట్టూర్చి అధికారానికి అవినీతి చెదలు పట్టింది ఫోన్ కాల్‌కు మర్యాదిచ్చి ఖైదీ చేసిన మనిషిని వదిలేసి అవినీతిని ఎంకరేజ్ చేస్తున్నావ్? అన్నాడు

చూడు మిస్టర్ రాజా! పులికి బౌద్ధమతం చెప్పి మేకను కాపలా ఉంచితే ఎలా ఉంటుందో - ఈ వ్యవస్థ అలా ఉంది ఇప్పుడు వాడ్ని వదలకపోతే ఏ అడవులకో బదిలీ అవుతాను వదిలితే డబ్బు పలుకు బడి ఉన్న వాడికి ప్రాణమిత్రుడుగా మిగులుతాను దీపంగా వాడుకుంటున్న కొవ్వొత్తితో తల గోక్కోవడం నాకిష్టం లేదు అర్థం లేని నిజాయితీ ఇచ్చే ఆత్మతృప్తి కంటే అవినీతి తెచ్చే ఆదాయం నాక్కావాలి

అందుకని నీ వృత్తిని చీకటి బజారులో అమ్ముకుంటున్నావు నీ 'బాధ్యతను కరెన్సీ నోట్లకు తాకట్టు పెడుతున్నావు'

నా జీతం నా పిల్లల పాలకు చాలదు వాళ్ళకు చదువులు కావాలి పెళ్ళిళ్ళు కావాలి చదివిన తర్వాత వాళ్ళకు ఉద్యోగాలు వస్తాయని నమ్మకం లేదు నిరుద్యోగంతో దొంగలుగా మారితే దానికి కారణం నేను నా కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేయకుండా దేశం మీదికి వదిలేస్తే, వాళ్ళు చెడు తిరుగుళ్ళు తిరిగితే దానికీ కారణం నేనే మీరే చెప్పండి నే నొక్కడ్ని నిజాయితీగా బ్రతికి భవిష్యత్తులో దొంగలను, వ్యభిచారులను దేశానికి అందించ మంటారా? లేక నేనొక్కడ్ని అవినీతిగా బ్రతుకుతూ వారి భవిష్యత్తును బాగు చెయ్య మంటారా? అని చెప్తూ శ్రీనివాసులు పక్కకు తిరిగేసరికి అక్కడ రాజాలేడు

వై హరికృష్ణ సమర్పణలో వై అనిల్‌బాబు నిర్మించిన కృష్ణ చిత్ర వారి ఇదా ప్రపంచం చిత్రానికి ముత్యాల సుబ్బయ్య దర్శకుడు

కచదేవయాని లో కోట శ్రీనివాసరావు





సత్యా మూవీ క్రియేషన్స్ ద్వితీయ చిత్రంలో కళ్యాణచక్రవర్తి, రమ్యకృష్ణ

## "ప్రేమగోల"

ప్రముఖ డైరెక్టర్‌ల వద్ద దర్శకత్వ శాఖలో అనుభవం గడించిన మానపాటి జయరాంను దర్శక రచయితగా అలాగే సుప్రసిద్ధ సంగీత దర్శకుల వద్ద శిష్యరికం చేసిన సత్యనారాయణను మ్యూజిక్ డైరెక్టర్‌గా పరిచయం చేస్తున్నాం భగవాన్ శ్రీ బాలసాయిబాబా వారి ఆశీస్సులతో జూలై మొదటి వారంలో పాటలు రికార్డ్ చేసి ఆగస్ట్‌లో షూటింగ్ ప్రారంభిస్తాం అన్నారు శ్రీ బాలసాయి ప్రొడక్షన్స్ అధినేతలు దర్శకుడే కథ స్క్రీన్‌ప్లే మాటలు రాస్తున్నారు దాసరి సుశీల నల్లగుండ్ల రాధాకృష్ణ నిర్మాతలు

# పోల్చలేని విలువ. మేటి గుణం.

# వాడదగ్గ ఈ టూత్‌పేస్టు ప్రతిదినం - క్లోస్-అప్.



చాక్ గల చిక్కని టూత్‌పేస్టు

100 గ్రాములు | 100 గ్రాములు

చాక్ గల చిక్కని టూత్‌పేస్టుల కన్న వేరైనది క్లోస్-అప్. దీనిలోని అద్వితీయ ఆధునిక జెల్‌లో శుభ్రపరిచే నురుగు పుష్కలంగా వుంది. కాని ఇది అంత బరువైనది కాదు. అంచేత, ట్యూబుకు ట్యూబు పోలిస్తే, క్లోస్-అప్‌తో మరిన్నిసార్లు బ్రష్ చేసుకోవచ్చు. ఇప్పుడు మీరు వాడుతున్న టూత్‌పేస్టు* కన్న ఇది మరింత ఎక్కువకాలం వస్తుంది.

క్లోస్-అప్‌తో ఇంకా ఎన్నో ప్రయోజనాలు. దీనిలోని ఆధునిక క్లీనర్‌లు మీ పళ్లను తెల్లగా చేస్తాయి. మీ శ్వాసని ఎంతో శుభ్రంగా, ఎంతో తాజాగా ఉంచటానికి ఇందులో వుంది అసలైన మౌత్‌వాష్. అవును, క్లోస్-అప్‌తో మీకు అన్నీ కైవసం అవుతాయి—ముఖ్యంగా ప్రపంచాన్నే జయించే ఆ ఆత్మవిశ్వాసం ఇస్తుంది క్లోస్-అప్!

*ఒకే విధమైన నాజిల్ సైజు, 2 సెం.మీ. పేస్టు పొడవు ఉంటే.

**అసలైన మౌత్‌వాష్ గలది.**

**ఆధునికమైన శుభ్రపరిచే జెల్ గలది**

**ఎక్కువ సార్లు బ్రష్ చేసుకోవచ్చు**

## క్లోస్-అప్

మిలమిలలాడే తెల్లటి పళ్లు,
మరింత తాజాగా
ఉండే శ్వాస కోసం!




హిందుస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.

LINTAS CX 65 2720 TL

## సినిమా

### క్రాంతికుమార్ దర్శకత్వంలో "గౌతమి"

గోదావరి తనకు జన్మనిచ్చిన తల్లిగా భావిస్తుంది పల్లెటూరి వాతావరణంలో పుట్టి పెరిగిన పుత్తడి బొమ్మలాంటి ఓ ముగ్ధ ప్రమాదవశాత్తు లోపానికి గురి అయిన ఆ పడతిని విశాల హృదయుడైన ఓ యువకుడు పరిణయమాడుతాడు దాంతో కథ గోదావరిలా ఎన్నో మలుపులు తిరుగుతుంది అన్నారు క్రాంతికుమార్ ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో మండవ గోపాలకృష్ణ నిర్మించిన రాదా మాధవ ఫిలిమ్స్ వారి పై చిత్రం తుది మెరుగులు దిద్దుకుంటోంది సుహాసిని శరత్‌బాబు ఎస్ జానకి జె వి సోమయాజులు శుభలేఖ సుదాకర్ పి జె శర్మ వై విజయతో పాటు వైవిధ్యం గల భూమికల్లో అనూరాధ రవిబాబు తనికెళ్ళ బరణౌకనిపిస్తారు గణేష్ పాత్రో మాటలు సీతారామ శాస్త్రి పాటలు ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం సంగీతం హరి అనుమోలు ఛాయ రాంచంద్ర సింగ్ శిల్పం శివశంకర్ నృత్యాలు సురేష్ మోడి ప్రత్యేక వేషరచన రమేష్– మున్నీలాల్ ప్రొడక్షన్ నాగండ్ల సంయుక్త దర్శకత్వం తమ్ముడు సత్యం నిర్వహణతో వేమూరి సత్యనారాయణ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్

(74 వ పేజి చూడండి)



గౌతమి లో సుహాసిని, జె వి సోమయాజులు



సీరియల్

(గత సంచిక తరువాయి)

పేదవాని జీవితంలా ఆకాశం గజిబిజిగావుంది సూరీడు పడమరకి వాలిన చిహ్నంగా పడమటి ఆకాశంలో కాస్త్రంత వెలుగు ద్యోతకమౌతూంది ఎండ పొడ ఎక్కడాలేదు మూడురోజులుగా అదేతంతు దానికితోడు చలిగాలి

ఆట్టే పొద్దుపోకముందే బండిని తోలుకొచ్చి, ఎడ్లను విప్పి శాలలో కట్టి వాటికింత దాణా పడేశాడు సంగమయ్య గోలెం నిండా నీళ్ళు పట్టి తవుడూ చిట్టూ కలిపేడు యజమాని రావడం చూసిన గేదె ఆనందంతో రాటచుట్టూ దానిపరిధిలో గిరగిరా రెండుమార్లు తిరిగి సంగమయ్య వంకే చూస్తూ నిలబడింది దాని మనసులోని బావాన్ని గ్రహించిన సంగమయ్య దానినో చేతితో తట్టి నాలుగు గడ్డిపరకల్ని దానిముందు పడేశాడు

తన జీవికకోసం కష్టపడే ఎడ్లూ తనకోసం పాలిచ్చే గేదె తను పడేసిన నాలుగు గడ్డిపరకల్నీ ఆబగా ఆనందంగా తింటూంటే వాటివంక సానుభూతిగా చూశాడు సంగమయ్య ఆక్షణంలో అతని మెదడులో ఏవేవో ఆలోచనలు చోటుచేసుకున్నాయి

మానవుడెంత స్వార్ధపరుడు? దేవుడు సృష్టించిన అన్ని ప్రాణుల్లాగే ఈ భూమ్మీద పుట్టి స్వేచ్ఛగా పెరగాల్సిన అ జీవాలు కేవలం నోరులేని పశువులు కావటాన బందింపబడి బలవంతంగా చాకిరీ చేస్తున్నాయి పచ్చని పచ్చికను కడుపారా మెయ్యాల్సినవి ఒకడొక్క నిండకున్నా నోరు మెదపలేకపోతున్నాయి

ఆక్షణంలో వాటిపై అమితమైన జాలి పుట్టుకొచ్చింది సంగమయ్యకు వాకిట్లో నులకమంచం వాల్చుకుని కూర్చుని వాటివంకే చూస్తున్నాడు

అప్పటికి ఆకాశంలో మబ్బులు చెదురుమదురుగా వున్నాయి నల్లనల్లని మబ్బుతునకలు ఒకదానితో నొకటి కల్సుకొని ఎద్దవౌతున్నాయి

రాన్రాను వెలుగు తగ్గి చీకటి ఆవరిస్తోంది నలుదెశలా

సన్నసన్నని తూర్పుగాలి పుంజుకుంటూంది దానికి దక్షిణపుగాలి తోడవుతూంది

పెయ్యను విప్పి పాలు పితికేక వాటినికూడా సాలలో ఓమూల కట్టేడు

అప్పటికి చీకటి చుట్టూ అలుముకుంది గాలి కూడ ముదిరి చిన్నజల్లు ప్రారంభమైంది

నాలుగు చెంబుల వేన్నీళ్ళు వంటి మీద పోసుకుని అరుగుమీద కూర్చున్నాడు సంగమయ్య అతని భార్య లోపల వంటచేస్తోంది కొడుకుతో కబుర్లు చెబుతూ

ఆకాశాన్ని చూస్తున్నకొద్దీ మనసులోని ఆందోళన అదికం అవుతోంది సంగమయ్యకు

చిలికి చిలికి యే గాలివానో అవదు కదా అని బయపడ్డాడు కొండన వర్షం పడితే ఏరు పొంగుద్ది కాలంలో పడితే గుండెలు సంతోషంతో నిండుతాయి- అకాలంలో కురిస్తే కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరుగుతాయి- బడుగు బతుకులు సుడిగాల్లోని దీపాలౌతాయి

ఆ రాత్రి  అర్ధరాత్రి దాటింది

వాన జోరు హెచ్చింది గాలి విసురు ముదిరింది బంగాళాఖాతంలో ఏర్పడ్డ వాయుగుండపు తీవ్రతవల్ల వచ్చే తుపాను హెచ్చయింది

రాన్రాను ప్రకృతి బీకర రూపాన్ని దాల్చింది- సుడిగాలికి మహావృక్షాలు కూకటి వేళ్ళతో పెల్లగింపబడుతున్నాయి ఆ చెట్ల కొమ్మల్లోని పిట్టలు ఆర్తనాదాలతో చెట్టుకో పిట్ట అయిపోతున్నాయి

ఆ కారుచీకట్లో ఆకాశపు గర్జనలు  అక్కడక్కడా మెరుపులు హోరున వర్షం

నింగీనేలా ఏకమయ్యేలా వర్షం!

గొల్లున ఏడ్పులు మొదలయ్యాయి ఉలిక్కిపడి లేచాడు సంగమయ్య ఊరంతా హాహాకారాలు!!

లేచి తలుపు తెరుచుకుని బయటకొచ్చాడు ఏరే పొంగిందో సముద్రమే వుప్పొంగిందో తెలియనట్టు నేల నాలుగు చెరగులా నీరు-ఎక్కడచూసినా మోకాళ్ళలోతు నీరు-గుడిసె గుమ్మానికి తాకుతూ కోరలు చాచిన సర్పంలాంటి నీరు-

జరిగిన కథ -3 సంగమయ్యకు చెరుకు ఆడే వివరాలు దాని నుంచి వచ్చే అప్పులు అర్ధమవుతాయి సంతానం కలగబోతున్నదని తెలిసిన సంగమయ్య, ఆర్ధిక పరిస్థితి మెరుగుదల కోసం దేవుడిని ఆశ్రయిస్తాడు దేవుడి సలహాతో చెరుకు తోటలు స్వయంగా వెయ్యడంతో పాటు భాగానికి కూడ చేస్తుంటాడు సంగమయ్యకు కొడుకు పుడతాడు దేవుడితో కలిసి వెళ్ళి సంగమయ్య గ్రామ కరణాన్ని రుణాలు ఇప్పించమని కోరతాడు ఆ ఋణంతో ఓ పాడి గేదె కొనుక్కొంటాడు రుణాల వ్యవహారంలో మోసం అర్ధమవుతుంది సంగమయ్య తండ్రి చనిపోతాడు

అప్పటికే పాకలోని పశువులు భయంతో అరుస్తున్నాయి నోరులేని పశువులు అరుస్తున్నాయి మానవుడి స్వార్థానికి బంధింపబడ్డ పశువులు అరుస్తున్నాయి

ఎం చేయడానికీ పాలుపోలేదు సంగమయ్యకు

ఊరు మునిగిపోతోంది పదండి పదండి పరుగెత్తండి పరుగెత్తండి ఎక్కడో అరుపులు

రాక్షసుడి కన్నులా ఆకాశం వికృతంగా

ఒక్క అడుగులో పాకలోకి చేరేడు సంగమయ్య- ఒక్కోరాటకున్న కన్నెనూ తప్పించేసేడు-

ఏదైతే అదే అవుతుంది- తను వాటికి రక్షణ కల్పించలేడు జీవులన్నీ ప్రాణాల్ని ఎలా రక్షించుకుంటాయో యివి అలాగే రక్షించుకోవాల్సిందే-

వర్షానికి పూర్తిగా తడిసిపోయాడప్పటికే-

గుడిసెలోకి అడుగు పెట్టేసరికి నీరు మరో అరడుగు ఎత్తుకు లేచింది-

గూట్లోని గుడ్డి దీపపు వెలుగులో భార్య మంచంవైపు చూశాడు బోగేసుగాడు తల్లిని పట్టుకు పడుకున్నాడు- ఒక్క క్షణం అలానే చూసి పొంగుకొస్తున్న దుఃఖాన్ని ఆతృతనూ అణుచుకుంటూ ఈశ్వరమ్మని లేపేడు-

అప్పటికే బయట కేకలు మిన్నుముట్టేయి ఎక్కడో ఏదో కూలిన శబ్దం ఎవరిదో ఏడుపు,

గుడిసెలు కూలుతున్నాయి బయటకు రండర్రా ఎవరో అరిచారు

ఈశ్వరమ్మ కళ్ళు విప్పింది కళ్ళ ముందు బీభత్సానికి ఒళ్ళు జలదరించింది-

నీరు నీరు చుట్టూ నీరు భూమి కప్పేసినట్టు నీరు

'పోదాం పద ఎక్కడికో అక్కడికి- అందరితో పాటూ అంటున్నాడు సంగమయ్య ఆ కంఠంలో భయం వణుకు చటుక్కున కొడుకుని దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకుంది ఈశ్వరమ్మ- ఆ తర్వాత భుజాన వేసుకుని దుప్పటి కప్పింది ఐదు నిముషాల్లో విలువైన వస్తువులన్నీ గోనెసంచిలో వేసి భుజాన వేసుకున్నాడు సంగమయ్య సంసారం వీధిన పడింది

గుడిసెమీద కమ్మలు సుడిగాలి కెగిరిపడ్డాయి-

ఉత్తరం వైపు నున్న గోడ కూలింది

పరుగులాంటి నడక నీరు లేని భూమివైపు నడక నీళ్ళలోంచి నడక ఈత లాంటి నడక

రామ కోవిల అరుగుల నిండా ప్రహరీ గోడలమీదా జనం దుర్గాల గుట్టనిండా జనం అక్కడే ఆ జనం మధ్యే ఆ కాళ్ళ సందులో నే దూరి కాసింత చోటు చేసుకున్నారు

మరో గంట తర్వాత వర్షం తగ్గింది అయినా నీటిమట్టం తగ్గలేదు నదీ కాలువా కలిసి పారుతూన్నట్టు-ప్రవాహంలో చెట్లు చేమలూ గుడిసెలు పక్షులు పశువులు కొట్టుకుపోతున్నాయి వాటితో పాటు మనుషులూ

ప్రకృతికి ఎంత నిర య?



కళ్ళముందే ఆస్తులూ అంతస్తులూ నశించిపోయాయి- కళ్ళముందే వెట్లూ ఆశల సౌదాలూ కూలిపోయాయి

తెల్లారింది

యుగయుగాల చీకటి తర్వాత ప్రసరించిన వెలుగు కిరణంలా తూర్పున వెలుగు చిమ్మింది-

గాలి జోరూ నీటి మట్టం రెండూతగ్గాయి అయినా సంతోషించేందు కేముంది ఎవరికైనా?

ఎదరంతా శ్మశానవాటికలాంటి భూమి మనుషుల పశువుల పాముల మృతకళేబరాలు-

ఇసుకమేటలు వేసిన పంటపొలాలు గోడలు కూలి కొప్పులు ఎగిరిన యిళ్ళు-

ఏడ్పులు పెడబొబ్బలు అర్తనాదాలు చుట్టూ-పిల్లలు పోయిన తల్లి దండ్రులు తలిదండ్రుల్ని కోల్పోయిన పిల్లలు భార్యలు భర్తలు తండ్రులు తాతలు ఎందరో

ఆ వూరి జనాబాలో మూడొంతులే మిగిలింది

ఆ వూరి ఇళ్ళలో మూడోవంతే మిగిలాయి

ఆ వూరిపంటల్లో పాడవని వంతంటూ లేదు-

మనుషులం మిగిలాం అదిచాలు అనుకుని సంబరపడ్డారు సంగమయ్యా ఈశ్వరమ్మా!

★ ★ ★ ★ ★

వరాలిచ్చే దేవుడిముందు నిలబడ్డట్టు భక్తితో నమ్రతతో ఆశతో నిల్చున్నారు అవూరి జనమంతా

వరదబాదితుల కేదో సహాయాన్నందించాలని ప్రభుత్వం నిర్ణయించుకోవడం వల్ల అందరి వదనాల్లోనూ కాసింత ఆశ చిగురించింది-

వరద వల్ల సంభవించిన నష్టాన్ని అంచనా వేసేందుకు అదికారు లొచ్చారు ఒక్కొక్కర్నీ కలిసి ఎవరెంత నష్టపోయారో రాసుకుంటూ, ఎవరికెంత సహాయాన్నందించాలో నిర్ణయిస్తున్నారు

వారికి సహాయంగా గ్రామ పెద్దలు –

వెనక నుండి గ్రామ పెద్దలు జరిపించే రాజకీయం అక్కడున్న వారికి తెలియంది కాదు వారెంతటి అమాయకులైనా

ఇళ్ళు పూర్తిగా పోయినవారికి నూటయాభై చొప్పున రేడియోలో ప్రకటించినట్లు అందరికీ తెల్సింది–

మొదట అ సహాయాన్నందజేసే కార్యక్రమం మొదలైంది– ఇళ్ళను పూర్తిగా పోగొట్టుకున్న వారి పేర్లను తీసుకుని కాస్తంత విచారించి ఆరా తీసి తెల్ల




కాగితాల మీద గ్రామ పెద్దల సమక్షంలో వేలి ముద్ర వేయించు కున్నారు– ఆ మర్నాడు ఒక్కొక్కరి చేతుల్లోనూ వంద వంద చొప్పున వుంచారు–

అంతా ముఖాలు చూసుకున్నారు– అదేమని అడగటానికి ఎవరికీ నోరు రాలేదు– ప్రభుత్వం యిచ్చేదే తమపై జాలిపడి– అందులో దండించి అడిగే దేముంది– అలా అడిగితే అసలికి మోసమైతే ?

అంచేతే అందరితరపునా దేవుడు అడగాలని ముందు కొచ్చినా ఎవరికి వారే వచ్చిన దానితో సంతృప్తి పడి అతన్ని అడగనివ్వ లేదు–

ఈ మాటు మనం నోరు మెదపకపోతే మనకు రావల్సిన ప్రభుత్వ సహాయాన్నంతా మద్యలో యీ పందికొక్కులే బొంచేస్తారు

దేవుడి మాటలు అందరికీ నిజమేనని పించాయి– వారి తర్జన బర్జనలూ మాటలూ చేరవలసిన వారికి చేరేయి– అది తెలిసి మున్సబు గయ్యిమన్నాడు–

మి జాతే అంతర్రా– పోనీ నష్టపడ్డ వాళ్ళని ప్రభుత్వంతో మాట్లాడి యింతింత డబ్బు యిస్తూంటే మద్యలో వున్న వాళ్ళకా మాట? మీకు పీకల్లేవర్రా– తెగ్గోసినా ఆశే తప్ప తృప్తి లేదు– మొదటికే లేదని పిస్తే అంచక్కా వుంటుంది–

ఇక ఆపైన ఎవరూ మాట్లాడలేక పోయారు –

వచ్చిన మాట ఎలానూ వచ్చింది– యీ డబ్బు గవర్నమెంటునించి తేడం కోసం మేం పెట్టిన ఖర్చేనా మాకు రావద్దా అంటూ ప్రతి ఒక్కరి నుండీ తన కమిషన్ను తాను గుంజు కున్నాడు–

దానికెవ్వరూ అడ్డు చెప్పలేదు– ఎదురు తిరిగి మాట్లాడే సమయం అది కాదని అందరికీ తెల్సు మరి!

★ ★ ★ ★ ★

నెల తిరిగేసరికల్లా యిళ్ళు పోగొట్టుకున్న వాళ్ళంతా తమ శక్త్యానుసారం గూడు లేర్పరుచు కున్నారు– ఆస్తుల నమ్ముకుని కొందరూ దొరికిన దగ్గర అప్పులు చేసి మరి కొందరూ– మోతుబర్లు పట్నం బేంకీల్లో డబ్బు దాచుకున్న గ్రామ పెద్దలూ పెద్ద పెద్ద వడ్డీ రేట్లకే అప్పులిచ్చి బీదవాళ్ళకి సాయపడ్డారు–

కొద్దిపాటి తిండిగింజలూ యిళ్ళ కోసం యిచ్చిన డబ్బూ తప్పితే పశువుల నష్టం పంటల నష్టం గురించి వ్రాసుకెళ్ళినా యింతవరకూ ప్రభుత్వం నించి ఎటువంటి సహాయమూ రాలేదు–

ఏట్టైందేటి?

దేవుడి మాటకు మోకాళ్ళ మీద తలుంచుకుని ఆలోచిస్తున్న సంగమయ్య తలెత్తి చూశాడు అతని కళ్ళలో ని నిరాశ దేవుడికి స్పష్టంగా కన్పిస్తోంది–

ఎల్లినావా? తిరిగి దేవుడే ప్రశ్నించేడు–

ఆఁ ముక్తసరిగా అని లేచేడు సంగమయ్య–

ఏటన్నారేటి?

ఏటుందీ– ఆళ్ళ బాకీ ఆళ్ళకి తీర్చాలంట–

గేదె కొట్టుకు పోయినట్టు చెప్పలేదా మరి

చెప్పినాను పొటో కావాలంట–

మరి తీయించుకొనే పొయ్యావా

నాదిగాదు– వరదల్లో గేదె కొట్టుకు పోయింది మా రాజా– మరో గేదె కొనుక్కుందికి అప్పేనా యిప్పించండి నేదా యీ బాకీ సొమ్ము మాపీయేనా చెయ్యండని మొరెట్టుకుంటేపోయిన గేదె ఫోటో గావాలన్నాడు– నా పేణాలమీదే నేనాశ ఒగ్గేసుకుని కుటుంబమంతా దొరికిన గట్టెక్కి కూకుంటే ఆ వరదల దిగి గేదె నొట్టుకుని ఫోటో లెక్కడ దీసేదీ? అదే చెప్పినా

ఏటన్నాడు

ఏటంటాడు– కుదరదన్నాడు రూల్సు లొప్పుకోవంట– సరే బాకీ ఎలగోలాగ తీరుస్తాలే అన్చెప్పి వొచ్చేశా

దేవుడు మరేం మాట్లాడ లేదు–

ఈ రూల్సులన్నీ పేదోళ్ళకాడే– ఆడికి చేసే సహాయంకాడే పండించినంత కాలం రైతే రాజనడం తప్పిట్లు కొట్టడం– ఆడికేదేనా ఆపదొస్తే ఆదుకోడానికి అన్నీ అడ్డంకులే– ఈ మద్య దళారీలు పోనంత కాలం రైతు పండించినా ఆడికి మిగిలేది మట్టే– అయితే మట్టిని నమ్ముకున్నోడు ఏనాటికైనా బాగు పడతాడు గాని సెడిపోడు ఆ కాలం వొచ్చే వొరకూ ఆగాల అనుకున్నాడు

విశిష్ఠ సుగంధం
మైమరపించే తాజాదనం

క్రొత్త
ప్రేమ్
మీకోసమే




ఇప్పుడు అనువైన ఆకారంలో క్రొత్త పరిమళంతో వస్తోంది.

మనసులో –

* * * * * *

రోజులు దొర్లుకు పోతున్నాయి–

ఏనాటికైనా తమ బతుకుల్లో కొత్త సూరీడు వుదయించడా అని ఆశగా ఎదురు చూస్తూనే వున్నాడు సంగమయ్య–

వరద ముంపు తన వెన్నెముకనే ఖరగ్గొట్టేసింది– చెప్పుకోలేనంత నష్టం కలిగింది– ఇల్లు సగం కూలింది– కొట్టుకుపోయిన ఎద్దు బతికి కన్పించ లేదు– గేదె జాడే లేదు– పొలాన్ని బాగు చేసుకునేసర్కి చాల కాలమే పట్టింది– అటు రాంకోటిశెట్టి దగ్గర అప్పులూ వడ్డీలూ పాపంలా పెరిగి పోతున్నాయి తిండి గింజలు కూడ అప్పు దెచ్చుకునే పరిస్థితి ఎదురైంది– అయినా రైతు భూమిని నమ్ముకోక ఎటు పోగలడు? ఆ మధ్య వీటితో వేగలేక ఆ కాస్త ముక్కా అమ్మేసి అప్పులు తీర్చుకుని పట్నంపోయి యే రిక్షానో తొక్కుకుని బతకాలను కున్నాడు– కానీ దేవుడే పడనియ్య లేదు– ఎంత అట్టడుగునున్నా ఏళ్ళే చెట్టు కాదార మన్నాడు– పునాదే బవనానికి గట్టి అన్నాడు– రైతే దేశానికీ ప్రజకీ వెన్నెముక అన్నాడు– అటువంటి రైతు బెంబేలు పడకూడ దన్నాడు– ఇంకా ఏవేవో చెప్పేడు ఎంతో నచ్చ జెప్పేడు– నేనున్నాగా నీకు అన్నాడు– ఆశ కల్పించేడు ఆసరా చూపించేడు–

అంతే! మనసు మార్చేసుకుని వుండిపోయాడు– మనసంటే మారిపోయింది గాని పరిస్థితులు మారిపోవు గదా– ఎడ్లబండి లేకపోడం గొప్ప లోటుగానే వుంది– పొలం వున్నా లేకున్నా బండిమీదే రోజుకో పది సంపాదించుకోవచ్చు అది కాస్తా పోయింది–

ఇదే ఆకరి అప్పు– కొంతైనా తీర్చకపోతే మరిచ్చేది లేదు– పేదోళ్ళని దయతలిస్తే మా యాపారాలు గూట్లో కొస్తున్నాయి– అప్పులు చెల్లియ్యకపోతే పట్టా చెల్లియ్యడమే అన్నాడు శెట్టి

బతుకులో ఎదరంతా ఎడారే అన్పించిందా క్షణాన

*      *      *      *      *      *

సందె పొద్దు వాలుతోంది– పంచాయితీ రచ్చ బండ దగ్గర నలుగురూ పోగౌతున్నారు ఒకప్పుడైతే అక్కడి వాతావరణం మరోలా వుండేది– పగలంతా కష్టపడ్డ రైతులూ రైతు కూలీలూ కాస్సేపు అక్కడ జేరి పంచాయితీ రేడియో వింటూ రాజకీయాలు చర్చించుకుంటూ పిచ్చాపాటీ కబుర్లు కథలూ చెప్పుకుంటూ గడిపి ఎవరి మానాన వారు వెళ్ళిపోయే వారు– కానీ యిప్పుడా పరిస్థితి లేదు– వరద నష్టం ప్రతి ఒక్కరినీ పీకలమొయ్యా కష్టాల్లో పాతేసింది–

రేపెలా? అన్న ప్రశ్నే ప్రతి ఒక్కరిలోనూ ప్రతి క్షణం

రాజకీయాలు చర్చించుకోడానికీ కబుర్లు చెప్పుకోడానికీ యిక సమయమేదీ? వుత్సాహమేదీ?




మొదట్లో ప్రభుత్వం సహాయం చేస్తుందని తెల్సి చాల సంతోషించేరు– పోనీ నష్టం కొంతవరకైనా భర్తీ అవుతుందని బావించేరు– కానీ అంకె చూపేదొకటీ చేతి కందించేది ఒకటీ– ఈ దోపిడీకి అంతు లేదా అని ఎవరిలో వారే ప్రశ్నించుకోడం తప్పితే నిలదీసి అడిగే సాహసం లేదెవరిలో –

అటువంటి సాహసమూ ధైర్యమూ వున్న దేవుడి లాంటి వారిని కూడ నిరుత్సాహపరచి యిచ్చిందే చాలునన్న కక్కుర్తి కొద్దీ ముందడుగు వెయ్యనీలేదు–

పశువులు పోయిన వారికి సహాయాన్నందిస్తామని వివరాలు రాసుకుని చాల రోజులే అయింది– అది చేతికి ఎప్పుడందుతుందో ఎవరికీ తెలీదు–

సరిగ్గా ఆ సమయంలో ఆ రోజు దేవుడు ఓ వార్తను మోసుకొచ్చాడు–

ఎడ్లకీ బండికీ మళ్ళీ లోన్లు యిస్తారని–

మరి వాళ్ళిస్తామన్న సహాయం? అడిగేరెవరో–

ఇస్తారో మానార్తో – యిప్పుడిలా లోన్లు యిమ్మని శాంక్షనైందట– కరణం చెప్పేడు కనబడి!

దేవుడి మాటలు కొందరిలో కొత్త వుత్సాహాన్ని కల్గించక పోలేదు– బండంటూ వుంటే ఎలాగో కొంత రోజు వెళ్ళ మార్చుకోవచ్చు– నెమ్మదిగా అప్పు తీర్చేసుకుంటే కొన్నాళ్ళకైనా బండి సొంత మవుతుంది–

మరి దానికేం జెయ్యాలంటా అడిగేడు సంగమయ్య–

ఏముందీ! మూమూలే బండీ ఎడ్లకీ పద్నాలుగొంద లివ్వొచ్చుట– అందులోనే ఆళ్ళ మామూళ్ళు- అయిపోగా బండే కొనుక్కుంటావో బంతే కొనుక్కుంటావో నీ యిష్టం

కర్చుల కెంతంటాడో కరణం? ముసలయ్య అనుమానాన్ని వ్యక్తపరచాడు-

ఎంతైతే మానుకుంటాం అది తప్ప మరో గత్యంతరమేదీ మనకి ఏలంఎర్రిగో లెంకుడితని లంచం లేని బతుకు లేదుగదా- గవర్నమెంటు డబ్బంతా యీ మధ్య వుద్యోగస్తుల్దేగాని మంది కాదుగదా అంచేత కావాలనుకున్నాళ్ళందరం వెళ్ళి కరణాన్నడుగుదాం- ఆయనగోరి ఆకలి జూసి మనమాట మనం అడుగుదాం- కష్టాల్లో వున్నాం బాబూ అని అని చూద్దాం ఏటంటాడో కానీ కట్టడిగా ఎళ్తేనే యీ వ్యవహారం కాస్త సానుకూలపడొచ్చని నా నమ్మకం ఏటంటారు అని నలుగురి దిక్కూ చూశాడు దేవుడు

మాలో కాస్త అడగ్గలిగినోడివీ ధైర్యవంతుడివీ నువ్వేగదా- అదేదో నువ్వే చూడు మాంవంతా ఎనకనుంటాం అన్నాడు ముసిలయ్య

సరేనంటే సరేనన్నారంతా దేవుడూ ఒప్పుకున్నాడు లెక్కజూస్తే ఓ పది పదిహేను మంది వరకూ తేలేరు నికరంగా బళ్ళూ ఎద్లూ కావల్సినవాళ్ళు

రేపే వెళ్దాం కరణం దగ్గరికి రెడీగావుం డండి ఎటూపోక అని చెప్పేడు దేవుడు

ఎవరిమాటిలా వున్నా సంగమయ్య మనసులో కాస్త ఆశ చిగురించింది

మర్నాడు వుదయం పది గంటలకల్లా అనుకున్నట్టే అందరూ కరణంగారింటి ముందు హాజరయ్యారు అప్పటికే కరణంగారు వీధరుగుమీద కుర్చీలో కూర్చుని ఏదో రాసుకుంటున్నారు- ఆ క్షణంలో ఆయన్ను చూసిన కొందరికి ఆయన వరాలిచ్చే దేవుడిలా కన్పిస్తే ఇంకొందరికి ప్రజల్ని పాలించే ప్రభువుగానూ, మరికొందరికి తమ రికార్డుల్ని చూసి శిక్షవేసే చిత్రగుప్తుడిలానూ కన్పించాడు

అందరికంటే ముందు వెళ్ళి దేవుడే అతనికి దండంపెట్టేడు అప్పటివరకూ అదేం పట్టించుకోనట్టున్న కరణంగారు తలెత్తి అందర్నీ చూశాడు-

దండాలు బాబయ్యా అన్నారంతా ఏక కంఠంతో -

ఏమిటేమిటి? యిలా వచ్చేసేరు అతిరథులు, మహారథులంతా? జోకేసి నవ్వేరు కరణంగారు-

మాకు రథాలెక్కడివీ-ఈ వరదల దెబ్బ యుద్ధాల దెబ్బకంటె ఎక్కువైపోయింది మా ప్రాణానికి అస్త్ర సన్యాసం చేసేసిన సైనికుల్లా వుండిపోనాం అన్నాడు దేవుడు తనకున్న పరిజ్ఞానాన్నంతా వినియోగిస్తూ హాస్యధోరణిలో

ఆ తర్వాత నెమ్మదిగా అసలు సంగతిని తీసుకొచ్చాడు- అంతా విని అలాటి

దేదో వుంటేగాని మీరంతా మాకు ముఖా లెందుకు చూపుతార్లే ముందే అనుకున్నా-పంటలు బాగా పండినపుడు కరణంగారికిచ్చిందీ లేదు-శిస్తులు కట్టిందీలేదు అన్నాడు

అలాగనీకండిబాబూ మీకివ్వం దెప్పుడు? కాకపోతే సన్నకారోళ్ళం ఎక్కువగా ముట్టజెప్పలేకపోతున్నాం అనాడు ముసిలయ్య

ఆపదలో వున్నాం మిమ్మల్ని నమ్ముకున్న మీ ఊరోళ్ళం మీ రాదుకోపోతే మా వెందల బడాలి అన్నారింకెవరో-

సరే-నాకు తప్పదుకదా తప్పించుకోవాలనుకున్నా నా చేతనైన సాయం చేసిబెడతా అని వూరుకున్నారు

ఎంతో స్తాది బాబయ్యా ముందనుకున్న ప్రకారం సంగమయ్య కదలేశాడా విషయాన్ని-

ఏమో! ఆ బేంకు వాళ్ళింతిస్తే అంత పదమూడు- పద్నాలుగు వందలిస్తారేమో-అందులో కర్చులు పోతాయిగదా

ఒక్క క్షణం ఎవ్వరూ ఏం మాట్లాడలేదు

ఖర్చులంటే ఎంతుంటాయిబాబూ సుమారుగా అడిగేడు దేవుడు

ఇచ్చే డబ్బునుబట్టి వుంటుంది-నాలు గైదొందలైనా వుటుందనుకుంటా-

అంతా ముఖాలు చూసుకున్నారు

ఇచ్చే పద్నాలు గొందల్లోనూ నాలుగొందలు తీసేస్తే నెమ్మదిగానే మాట జార్చేడు సంగమయ్య-

ఈమాటు కరణంగారు ఖస్సుమన్నాడు

అదేనయ్యా మీతోవచ్చింది అప్పులు పెద్ద మొత్తంలో కావాలంటారు ఖర్చులు బరించలేమంటారు ఎవరిస్తారు మీకుట్టిపుణ్యంగా కొనుక్కోండ్రా బళ్ళూ గేదెలూ అని

కాస్సేపాగి ముసలోడు అందుకున్నాడు మీరలా అగ్గయిపోతే ఎలాగయ్యా నష్ట బారమైపోయినోళ్ళం కాస్తంత కనికరం చూపమంటన్నాం- సంవత్సరం పొడుగునా కష్టపడి రెక్కలు ముక్కలు జేసుకుంటేగాని కడుపు కింత కూడు పడెయ్యలేనోళ్ళం దర్మప్రభువులు మీరాపాటి దారి చూపుతామన్నారు అంతే చాలు కానీ ఎయ్యి రూపాయిలకి బండి ఎడ్లు జత ఎలా వొస్తాదయ్యా? కనీసపక్షం పదేనొందలేనా లేంది సమకూరవ్- మర బాకీ చెల్లు జెయ్యాలన్నా బండి నడాల కదేట బాబయ్యా

ఆఁ ఆఁ మీ రంతా బాకీలు చెల్లుజేసేవాళ్ళయితే గవర్నమెంటిందు కిలా వుంటుందీ- ఇంతకీ ఏమంటారు? పద్నాలు గొందలికి కాణీ ఎక్కువ వియ్యరట మరి కర్చులు తప్పవు మీ కిష్టమైతే చెప్పండి మాట్లాడతాను లేదూ నెత్తిన కొంగేసుకుపొండి కుండ బద్దలు గొట్టినట్టే చెప్పారు

అలా అనేస్తే ఎక్కడికి పోతారయ్యా వరదల్లో పంటల దగ్గర్నించి గొడ్డూ గోదా చివరకి పిల్లల్ని స్తైతం పోగొట్టుకున్నా రిందులో చాలామంది- ఆ కర్చులు కాస్త తగ్గించినారంటే - నాలుగు రాళ్ళు తెచ్చుకుంటే అనక ఆపాటి సాయం మరోవిదంగా మీకు చేయకపోరు అన్నాడు దేవుడు-

తగ్గించడానికి మద్య నేనెవర్ని-కోన్కిస్కా గొట్టంగాణ్ని- బేంకువాళ్ళు వెటర్నటీ డాక్టరు వాళ్ళ పెర్సంటేజీ అది- డబ్బు యిచ్చేది గవర్నమెంటే అయినా మన చేతిలోపెట్టేది వాళ్ళేగా అది తప్పదట ఇక ఆపై మీ సంతోషంకొద్దీ మీ వూళ్ళో మీకు అండగా వున్నందుకు నా కేదేనా మీకివ్వాలని తోస్తే యివ్వండి అంతంత జీతాలు తీసుకుంటున్న వాళ్ళే అలా రేటు పెట్టేస్తుంటే నేనూ రేటు పెట్టీవచ్చు-మా జీతాల సంగతి మీకు తెల్సుగా- ఈ సర్వీసులో జేరినపుడు నా జీతం పదిహేడు రూపాయలు- ఇప్పుడు వంద దాట్లేదు నేను ఆ జీతంమీద బతకాల్సినవాణ్నేగా!

ఒక్క క్షణమాగి సంగమయ్య దేవుడిచెవులో ఏదో చెప్పాడు

ఒక్కమాట బాబూ! ఇది రైతు జనానికి బొత్తుగా కష్టకాలం గాబట్టి తలకో నూట పదహార్లు యిస్తామంటున్నారు సంతోషంగానే-అలా అయితే మీ రాళ్ళకిప్పించే యీ అప్పు వూరికే యిచ్చినట్టే సంతోషిస్తారు

మీరే ఎలాగో మాట్లాడి యిది సెటిల్ జెయ్యాలి మీ రుణం వుంచుకోరు అన్నాడు దేవుడు-

నా రుణమూ వుంచుకోవద్దు- వాళ్ళ రుణమూ వుంచుకోవద్దు గవర్నమెంటు రుణమే వుంచేసుకోండి నాకేం- నే చెప్పాల్సింది నేను చెప్పాను ఆపైన మీ యిష్టం అయినా మీరింతమంది కావాలంటే కుదర్దేమో ఎలాగో నేను సర్ది చెబితే ఓ పదిమంది వరకూ వాళ్ళు చూడొచ్చు అని తనపనేదో తాను చేసినట్టు వూరుకుండిపోయారు

ఆ తర్వాత కొంత తర్జనభర్జన అయి వచ్చేశారంతా ఆ సాయంకాలమే రచ్చబండ దగ్గర చేరారు

కరణం చెప్పిందంతా వొట్టిది ఉత్తపుణ్యానికి వాళ్ళకి నాలుగైదొందలు యిచ్చినామంటే అది మన తక్కువతనమే ఏం చేసినా ఎంత చేసినా ఆళ్ళకి నూట పదార్లు ఎక్కువే అంతకు మించి కాణీ యివ్వొద్దు మీరంతా ఒక మాటమీదుంటే ఎలా రాదో నేనూ చూస్తా అన్నాడు దేవుడు

బాగానే వుందిగాని పంతాలకుపోయేకాలమా యిది ఒకరోజు ముందొచ్చినా పది కాన్లు మిగుల్తాయనే ఆశతో వున్నాం అన్నా రెవరో

మన అవుసరంకొద్దీ మన్ని అణగదొక్కేస్తున్నారు మనం తీసుకుంటేనే కరణానికైనా ఆళ్ళకైనా నాలుగు డబ్బులు గిట్టేది- లేకుంటే మనకీలేదు-ఆళ్ళకీ లేదు ఏటంటారు? అంటూ ఆగేడు దేవుడు

కొందరు నిజమేనన్నట్లు తలలూపేరు-మరికొందరు మన అవుసరంగదా ఆళ్ళతో మనమెక్కడ తూగ్గలం అన్నారు ఇంకొందరు మౌనాన్నివహించేరు ఒకరకంగా నాయకుడు లాంటి దేవుడి మాటను కాదనలేరు మరోవంక వచ్చే డబ్బునూ వద్దనలేరు-

ఆ రాత్రికి రాత్రే అవసరమైనవారు ఐదారుగురు రహస్యంగా కరణాన్ని కల్సి అతనితో రాజీపడిపోయారు అంతే! ఆ సంగతి మర్నాడు తెల్సి దేవుడు




కోపమైపోయాడు మనలో కట్టుబాటు లేకపోబట్టే నలుగురూ మనల్ని మరింత క్రిందికి తోసేస్తున్నారు అన్నాడు ఏదియేమైనా బీదరైతుల నోళ్ళను కొట్టడం నేను సహించలేను-దీని తాడోపేడో తేలేదాకా నిద్రపోను అన్నాడు

లోన్లు అందరికీ యివ్వడం కుదర్దు అని కరణం వేసిన పాచిక యిలా వీళ్ళు లొంగపోడానికి దోహదం చేసిందని దేవుడు గ్రహించకపోలేదు-

ఆ రోజే పట్నమెల్లి తెలిసున్న ఎమ్మెల్యేతో ఈ విషయాన్ని చెప్పేడు ఉత్తప్పుడంటే యేమో - నిండా అన్యాయం జరిగిన రైతుల్ని మరింత దో చేయడం సబబుకాదు- మీరే రక్షించాల అంటూ కూచుండిపోయాడు

ఆళ్ళా డబ్బు నిజంగా తీసుకున్నట్టు సాక్ష్యమిప్పిస్తే తప్పకుండా మూయించేస్తాను అని ఎమ్మెల్యేగారు అభయాస్తమిస్తేనేగాని అక్కణ్నించి లేవలేదు సాక్ష్యంకోసం అతని మనిషినీ ఓ లాయర్నీ వెంటబెట్టుకునిగాని అక్కణ్నించి కదల్లేదు

నాలుగు రోజులు ఎక్కడివారక్కడ గప్‌చిప్ అన్నట్టు సాగింది వ్యవహారం

లోన్లు బట్వాడా జరిగింది-ప్లాను వేసివుంచడాన సాక్ష్యం దొరికింది వెంటనే పోన్లమీదే తాసీల్దారు దిగడం గ్రామాదికారితో పాటు నలుగురిపై కేసు నమోదు జేయడం జరిగిపోయింది

దేవుడు ఎంతకైనా తగినవాడు అన్నారు కొందరు పెద్దాళ్ళమీద కత్తికడితే వూరికేపోదు అని బెదిరించేరు మరికొందరు

అది నాకు న్యాయమనిపించింది నే చెయ్యాల్సినది నేను చేశాను- ఆపైన న్యాయం దర్మం లేవా? అన్నాడు దేవుడు వారి మాటకు జవాబుగా

ఆ రోజు దేవుడి కళ్ళకి సూర్యుడు మరోలా కొత్తగా వింత రంగులో కన్పించేడు

(ఇంకా వుంది)

## వ్యక్తిగతం



బొంబాయి నుంచి వెలువడే బ్లిట్జ్ ఆంగ్ల వార పత్రికలో లాస్ట్ పేజ్ శీర్షిక నిర్వాహకుడు శ్రీ ఖ్వాజా అహ్మద్ అబ్బాస్ తన 74వ ఏట జూన్ 1 న బొంబాయిలో కన్ను మూశారు ఆయన ప్రముఖ చిత్ర నిర్మాత దర్శకుడు రచయిత పాత్రికేయుడు బాంబే క్రానికల్ పత్రికలో ఆయన పత్రికా రచన ప్రారంభ మైంది ఆ తర్వాత ఆయన స్వతంత్రంగా ఎవిద పత్రికలకు రచనలు చేయడం మొదలు పెట్టారు సినిమా రంగంతో ఆయనకు 1940 నుంచి సంబంధాలున్నాయి మొదట ఆయన బాంబే టాకీస్ వారు నిర్మించిన నయా సంసార్ కు శ్రీ వి శాంతారాం నిర్మించిన డాక్టర్ కొట్నీస్ కీ అమర్ కహానీ కి కథలు రాశారు బహుళ ప్రజాదరణ పొందిన శ్రీ రాజ్‌కపూర్ చిత్రాలు ఆవారా శ్రీ 420 బాబీ లకు కూడా ఆయనే కథ సమకూర్చారు 1942 లో దర్తీ కె లాల్ చిత్రానికి దర్శకత్వం వహించడంతో ప్రారంభించి అన్‌హోని రాహీ తదితర చిత్రాలకు దర్శకత్వం వహించారు భారత -సోవియట్ సహకారంతో నిర్మాణ మైన తొలి చిత్రం పర్‌దేశి తొలి బాలల చిత్రం హమారాఘర్ లు ఆయన సృష్టించినవే ఆయన స్వయంగా 25కు పైగా చిత్రాలు నిర్మించారు వాటిలో షహర్ ఔర్ సప్నా' రాష్ట్ర పతి బంగారు పతకాన్ని గెలుచుకుంది ఈయన ఇంగ్లీషు హిందీ ఉర్దూలలో 50 కి పైగా పుస్తకాలు రాశారు □



ఈ సంవత్సరంతో మన స్వాతంత్ర్యానికి నాలుగు దశాబ్దాలు నిండుతున్నాయి 1989 మాజీ ప్రదాని కీ శే పండిత జవహర్‌లాల్ నెహ్రూ శత జయంతి సంవత్సరం ఈ రెండు సందర్భాలను పురస్కరించుకుని జరపబోయే ఉత్సవాలు ఘనంగా ఉండక తప్పదు ఈ ఉత్సవాల పర్యవేక్షణ బాద్యత శ్రీ అమితాబ్ బచ్చన్ బజస్కందాలపై పడిందని అనుకుంటున్నారు ఈ ఉత్సవాల నిర్వాహకుడిగా ఆయనకు కేంద్ర సహాయ మంత్రి హోదా ఉంటుంది ఈ ఉత్సవ నిర్వహణ కమిటీ ప్రదాన కార్యదర్శిగా ఉన్న ఐ ఎ ఎస్ అదికారి శ్రీ టి ఎన్ మురారి మాత్రం శ్రీ అమితాబ్ కమిటీలో కేవలం ఒక సాదారణ సభ్యుడు మాత్రమే నని అంటున్నారు అసలు ఈ నిర్వహణ కమిటీకి సంబందించిన వివరాలు ఇంకా పూర్తిగా సిద్ధం కాలేదని ఆయనంటున్నారు మరో వైపు ప్రదాన మంత్రి సలహాదారు శ్రీమతి షీలా దీక్షిత్ కార్యాలయంలో మాత్రం ఉత్సవ నిర్వహణ కమిటీకి ఆమె అద్యక్షురాలని చెప్పుకుంటున్నారు అమితాబ్ ఈ కమిటీకి ప్రదాన కార్యదర్శి కాదని వాళ్ళు నొక్కి చెపుతున్నారు కొన్ని నెలల కింద శ్రీ అమితాబ్‌గురించి చేసిన నిర్ణయాన్ని ప్రస్తుత వివాదాల పలితంగా మార్చుకున్నారా? □

# వారఫలం

**26-6-1987 శుక్రవారం మొదలు 2-7-1987 గురువారం వరకు**

★ **మేషం** గ్రహ గతులంబు మీకు అనుకూల మార్పులు ఉచ్ఛ గ్రహశీస్సులున్నాయి ఆదాయమున్నది పత్రికా గ్రంధ ప్రకటన మార్గాన అదికాదాయం స్త్రీలకు సాహిత్య కళా ఉద్యోగ రీత్యా మేలైన వారం

★ **వృషభం** శని ఆదివారాలు మీకు ప్రగతి సూచక దినాలు గృహానందదాయకాలు సంతానం కొరకు చేసే ఉద్యోగ యత్నాలు కొనసాగుతాయి అయినవారితో సంబందం సమకూర్చుకోవాలనే యత్నాలు సానుకూలం స్త్రీలకు శుక్ర శనివారాలు యోగదాయకాలు అనుకొన్న మార్గాన డబ్బు అందుతుంది

★ **మిధునం** వృత్తి యందు ప్రగతి గలదు మాటకు గ్రామాన ఉన్న చోట గౌరవం పెరుగుతుంది రాజకీయాలందు మీ ఎత్తులు కొనసాగుతాయి పత్రికా గౌరవమున్నది సబా గౌరవం చేకూరుతుంది స్త్రీలకు నగలు వస్త్రాలు సేకరించుకొనుటకు ఉద్యోగ రీత్యా ప్రగతి సాదించుటకు అనుకూలం

★ **కర్కాటకం** విది విరామమెరుగక వారమంతా కృషి చేస్తారు కాని శని ఆదివారాలే ప్రయోజనకరములు రాజకీయాలలో యిప్పటికే కొందరు ఈ రాశి వారు బాద పడ్డారు యిబ్బందుల పాలైనారు ఇంకెందుకు? వారమంతా ఊరుకోండి అప్పులుంటే వసూలవుతాయి స్త్రీలకు నూతన విదాన వృత్తి వికసిస్తుంది అన్ని విదాలా మేలే

★ **సింహం** పత్రికా రంగంలో పని చేసే వారికి బారీ సంస్థలందు పని చేసుకొనే వారికి గనులు కార్ఖానాల వ్యవస్థ యందుండు వారికి అనుకూలం సభా గౌరవమున్నది పత్రికా గౌరవం చేకూరుతుంది సంఘంలో పెద్ద పీట అమరుతుంది పోయిన వస్తువులు మరలా ఎలాగో సమకూర్చుకోగలుగుతారు ఆశ్రిత పక్షపాతం చూపారని నిందనెత్తికెక్కుతుంది కొందరకు స్త్రీలకు కుటుంబానందం స్వల్పాదాయం

★ **కన్య** నూత్నోత్సాహంతో చిన్న పెద్ద తోడ్పడు ఒకానొక సాంఘిక కార్యక్రమమందు శ్రమించి చక్కని పేరు తెచ్చుకొంటారు నలుగురిలో మీ కృషి శెబాష్ అనిపించుకొంటుంది రాజకీయంగా మీ నిర్ణయం ప్రకారం అడుగు ముందు పెట్టడం న్యాయమే శని ఆదివారాలు అనుకూల దినాలు స్త్రీలకు ఉద్యోగ రీత్యా అనుకూలం చుట్టు పక్కల సందడి విందు వినోదాలు సత్కాలక్షేపం

★ **తుల** ఆదాయం గల వారం అయిన వారి సంబంద నిశ్చయానికి తాపత్రయ పడే వారం అదే పనిగా ప్రయాణించవలసిన వారం ఆప్తులను కలసికొనుటకు ఆస్కారం గల వారం స్త్రీలకు శుక్ర శనివారాలందు శుబ వార్తాశ్రవణం వృత్తి రీత్యా మేలు

★ **వృశ్చికం** కొంత కాలం క్రితం అదేపనిగా ఒక వ్యవహారానికై ప్రాకులాడి ఒక అడుగు ముందు వేసి తగ్గిపోయినారు ఆయా వ్యవహారాలందు ఈ వారం నెగ్గి తీరుతారు కుటుంబ పెద్దలతో ప్రాణ స్నేహితులతో తగాదాలు రాకుండా చూచుకోండి స్త్రీలకు రాజకీయంగా కళాపరంగా ఉద్యోగ రీత్యా మేలే!

★ **దనుస్సు** నూతన మిత్రులు చేరుతారు వ్యాపార సంబందంగా వ్యవహార సంబందంగా ఏవో ఆలోచనలు చేస్తారు వారాంతాన ఇవి కార్య రూపం దాలుస్తాయి దనవంతులను కలసికొంటారు కొందరు ఉద్యోగ యత్నములందు సఫలులవుతారు స్త్రీలకు రాజకీయాలందు కళా రంగమందు అబివృద్ధియున్నది

★ **మకరం** ఏయే రంగాలలో కృషి చేయాలనుకొంటారో, ఆయా రంగాల వ్యక్తులను హటాత్తుగా కలసికొనుట తటస్థిస్తుంది విద్యా విదాన పెంపు చేకూరుతుంది ఆప్త మిత్రులను కలసికోగలుగుతారు వృత్తి రీత్యా మేలు శుబ వార్తాశ్రవణం స్త్రీలకు ఆరోగ్య వృద్ధి కృషి యందు వృద్ధి కుటుంబానందం

★ **కుంభం** అన్ని రంగాలలో ముఖ్యంగా సాహిత్య నాటక నాట్య రంగాలలో ప్రగతి ఏర్పడుతుంది చాలకాలంగా అలాగిలాగు అన్న వారు లొంగిపోతారు గురు గ్రహానుకూలత యున్నది వాహనం కొనుటకు అనుకూలించే దినాలు ముఖ్యులను కలసికొంటారు స్త్రీలకు ఉత్సాహజనకమైన వారం పాత పరిచితుల సహాయం కుటుంబానందం

★ **మీనం** గ్రహానుకూలత ఉండబట్టి అనుకొన్న పనులు అలాగే నెరవేర్చగలుగుతారు దూర ప్రాంతాలకు పోయిన వారు తిరిగి రావచ్చు వారంలో దర్మ కార్యాచరణము జరుగుతుంది కృషి యందు రాణింపు చేకూరుతుంది కళా సాహితీ రంగాలందు చెప్పదగిన అవకాశాలుంటాయి స్త్రీలకు నూతనోద్యోగ ప్రాప్తి కొందరకు కుటుంబానందం కొందరకు చెప్పదగిన అంశాలు

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# ఆశలు - కలలు

ఉప్పులూరి సత్యనారాయణ



సాయంత్రం అయిదు గంట లైంది నిడదవోలు రైల్వేస్టేషన్ ప్రయాణీకులతో కోలాహలంగా వుంది ప్రయాణీకులలో కొందరు మద్రాసు వెళ్ళే మెయిల్ కోసం ఎదురు చూస్తున్నారు మరి కొందరు బ్రాంచ్ లైనులో వెళ్ళే భీమవరం పాసింజరు కోసం కాచుక్కూర్చున్నారు పెళ్ళిళ్ళ సీజను కావటం వలన ట్రైనులో పాదం మోపగలమో లేదో నని ఆందోళనగా వున్నారు మరో వైపు తినుబండారు కాఫీ టీలు అమ్మే వెండర్లతోను మరింత కోలాహలంగా వుంది

ప్రయాణీకులందరికంటే ఆత్రంగా వున్న అరవై ఏళ్ళ వృద్ధుడైన భాస్కరమూర్తి ప్లాట్ పారం ఈ చివరనుంచి ఆ చివర వరకూ హడావిడిగా తిరుగుతున్నాడు మనుషుల ముఖాలలోకి పరిశీలనగా చూస్తూ ఇరవై ఏళ్ళ యువకుడు నల్లగా పొడుగ్గా వుంటే అతని సమీపంలో నిలుచుని ఒక్క క్షణం ఆశగా పరిశీలించి మేలుక్షణంలో ముఖం తిప్పుకుని నిరాశగా కదిలి పోతున్నాడు

మద్రాసు వెళ్ళే మెయిల్ రానే వచ్చింది దిగే వాళ్ళు దిగకుండానే ఎక్కే వాళ్ళు ఎక్కటానికి ప్రయత్నిస్తున్నందు వల్ల ప్రతీ కంపార్టు మెంటు వద్ద తొక్కిసలాట ఎర్పడింది భాస్కరమూర్తి మాత్రం వీటికి అతీతంగా వుండి ప్రతీ కిటికీ దగ్గర వంగి లోపలకూర్చున్న వ్యక్తుల్ని పరిశీలనగా చూస్తున్నాడు

అయిదు నిమిషాల తరువాత మెయిల్ భీమవరం పాసింజరు వెళ్ళి పోయాయి అప్పటి వరకు జన సందోహంలో కోలాహలంగా వున్న ప్లాట్‌పారం నిర్మానుష్యంగా నిశ్శబ్దంగా మారిపోయింది

భాస్కర మూర్తి ఈ వేళ కూడ మురళి రాలేదు అని గొణుక్కుని ఇంటి ముఖం పట్టాడు ఆయన ఆ రోజునే కాదు ప్రతీ రోజూ మెయిల్ వచ్చే సమయానికి క్రమం తప్పకుండా స్టేషన్‌కు వచ్చి మురళి కోసం అన్వేషించి నిరాశగా తిరిగి వెళ్ళిపోతాడు ఇలా అయిదు సంవత్సరాల నుంచి జరుగుతూనే వుంది

స్టేషన్నుంచి బయటకు రాగానే భరించ లేనంత నీరసం ఆవహించింది చుట్టూ కలయ జూసాడు ఎదురుగా అంబికా కొప్ దర్శనం ఇచ్చింది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ లోనికి ప్రవేశించి ఒక మూల ఖాళీగా వున్న టేబిల్ దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు పదిహేనేళ్ళ కుర్రవాడు అతని ముందున్న ఖాళీ ప్లేట్లను తీసి టేబిల్ క్లీన్ చేస్తున్నాడు భాస్కర మూర్తికి ఆ కుర్రవాడిని చూడగానే మురళి మనసులో మెదిలాడు

బాబూ! నీ పేరేమిటి? భాస్కరమూర్తి అడిగాడు

రామం

ఏం చదువు కున్నావు?

పదవ తరగతి చదువుతూ మానేసానండి

ఏ ఊరు మీది?

ఏలూరు

నిజం చెప్పు – నువ్వు ఇంట్లోంచి పారిపోయి వచ్చావా? ఆకుర్రవాడు ఒక్క క్షణం



తటపటాయించాడు

నీ తండ్రి లాంటి వాడిని, నిజం చెప్పు

అవునండి

ఆ సమాధానం విని భాస్కర మూర్తి హృదయం బరువెక్కింది

చాల తప్పు పని చేశావు మీ తల్లి తండ్రులు నీ గురించి బెంగ పెట్టుకుని ఎంత కుమిలి పోతున్నారో నా మాట విని మీ ఇంటికి తిరిగి వెళ్ళిపో నువ్వేదైనా తప్పు చేస్తే నీ తప్పుల్ని క్షమించి నిన్ను అక్కున చేర్చుకుంటారు

అప్రయత్నంగా భాస్కరమూర్తి కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి

సార్! మీ అబ్బాయి కూడ ఇంట్లోంచి వెళ్ళి పోయాడా?

అందుకేబాబూ ఈ కన్నీళ్ళు"

రామం మాట్లాడలేదు ఏదో ఆలోచిస్తూ భాస్కర మూర్తి కళ్ళల్లోకి చూస్తూ వుండి పోయాడు అతని మనసులో ఏవో జ్ఞాపకాలు ఏవో సంఘటనలు కదలాడ సాగాయి

నా లాగే నీ తల్లి తండ్రులు కూడ బెంగ పెట్టుకుని నీ కోసం విలపిస్తూ వుంటారు వారికళ్ళు నీ కోసం గడిపిన నిరీక్షణలో కాయలు కాచి పోయి వుంటాయి ఇంటికి తిరిగి వెళ్ళి వారి కన్నీటిని తుడువు అన్నాడు భాస్కరమూర్తి

భాస్కర మూర్తి యొక్క మాటలు ఆవేదన రామంలో మార్పు తెచ్చాయి కదిలించి వేశాయి అతన్ని ఆలోచింప జేసాయి రామం కళ్ళముందు తన తల్లి తండ్రులు అక్క చెల్లెళ్ళు కదిలాడారు

అలాగేసార్ తప్పకుండా ఇంటికి వెళ్ళి పోతాను అన్నాడు

ఆ సమాధానం భాస్కరమూర్తికి ఎంతో ఆనందాన్ని కలిగించింది కాఫీ త్రాగి నెమ్మదిగా ఇంటి వేపు కదిలాడు

* * * * *

ఏమండీ ఈ వేళ కూడా మురళి రాలేదా? అడిగింది కామాక్షి భర్త ఇంటికి రాగానే ఏ సమాధానం వస్తుందో ఆమెకు తెలుసు అయినా ఆశను చంపుకో లేక అడగకుండా వుండ లేక

# ఆశలు – కలలు

పోయింది

మన పిచ్చిగాని మనబ్బాయి తిరిగి వస్తాడని నాకు నమ్మకం కలగటం లేదు మనం దురదృష్ట వంతులం కామూ అన్నాడు అలా అంటున్నప్పుడు ఆయన కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి

కామాక్షి కాఫీ తెచ్చి ఇచ్చింది కాఫీ త్రాగి పడకకుర్చీలో కూర్చుని గతం లోని సంఘటనలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ అర మోడ్పుగా కళ్ళు మూసుకున్నాడు

* * * * *

మురళి స్కూలు నుంచి వచ్చాడా? అని అడిగాడు భాస్కరమూర్తి ఆఫీసు నుంచి వస్తూనే

ఇంకారాలేదండీ

స్కూలు నాలుగు గంటలకే వదిలేస్తారు కదా, ఏడుగంటలైనా ఇంకా ఇంటికి రాక పోవట మేమిటి? వీడు ఎక్కడో షికార్లు చేస్తున్నట్టున్నాడు

ప్రైవేటు క్లాసు ఏదైనా వుందేమో! అంది కామాక్షి

లేదు కామూ! వాడు ఈ మధ్య స్కూలు నుంచి సరిగ్గా ఇంటికి రావటం లేదు చెడు స్నేహాలు చేసి దారి తప్పుతున్నాడని భయంగా వుంది

మనబ్బాయి అలాంటి వాడు కాదండీ

నీ గుడ్డి ప్రేమ వాడిని పాడు చేస్తోంది మార్కులు కూడ తగ్గిపోతున్నాయి ఈ వయసులో తప్పుదారి పడితే జీవితంలో ఇంకెప్పుడూ పైకి రాలేడు

కామాక్షి మౌనంగా వుండి పోయింది మురళి వారి ఏకైక సంతానం హైస్కూలులో పదవ తరగతి చదువు తున్నాడు కామాక్షి చిన్నతనం నుంచి కొడుకును ముద్దు చేసి పెంచింది మురళి ఏదికావాలన్నా క్షణాల మీద తెచ్చి ఇచ్చేది తను చెప్పినట్టు కాకుండా మురళి చెప్పినట్టు తను నడుచుకునేది భాస్కరమూర్తి పైకి కఠినంగా కనుపించినా భార్య చేసే ముద్దును తప్పని చెప్పి వారించ లేక పోయాడు

ఏడు గంటలు దాటిన తరువాత మురళి ఇంట్లో అడుగు పెట్టాడు

స్కూలు నాలుగు గంటలకే వదిలితే ఇప్పుడా ఇంటికి రావటం ఇప్పటి వరకూ ఎక్కడ షికార్లు చేస్తున్నావు

స్నేహితుడి ఇంట్లో హోమ్ వర్కు చేసుకుంటున్నాను నాన్న గారూ అన్నాడు మురళి ఏమి తొణక్కుండా

చూసారా మన పిల్లవాడు అట్లాంటి వాడు కాదంటే నమ్మరు మీ కంతా అనుమానమే వెంటనే కొడుకును వెనకేసుకు వచ్చింది కామాక్షి

భాస్కర మూర్తికి మురళి సమాధానంతో సంతృప్తి కలుగ లేదు కొడుకు ప్రవర్తనలో ఎక్కడో ఏదో లోపం వుందని అతని మనసు శంకిస్తోంది అదేమిటో తెలుసుకో కుండా మురళిని దండించ దలుచు కోలేదు అందుకే మౌనంగా వుండిపోయాడు మురళి భోజనంచేసి తన గదిలోకి వెళ్ళి పుస్తకాలు ముందేసుకుని తల్లికి తండ్రికి వినిపించే విధంగాపెద్దగొంతు పెట్టి చదవసాగాడు

"పదవతరగతి పాసయిన తరువాత మనబ్బాయిని ఇంటరు ఏ గ్రూపుతో చదివిద్దాం అంది కామాక్షి భర్తకు తమల పాకులు అందిస్తూ

ముందు పదవ తరగతి పాసవనీ ఆ తరువాత ఆలోచిద్దాం అన్నాడు భాస్కరమూర్తి

మనబ్బాయి పాసు కాక పోతే మరెవరు పాసవుతారు చూస్తూ వుండండి ఫష్టుక్లాసులో పాసవుతాడు

నాకు మాత్రం ఆనమ్మకం కలగటంలేదు మామూలుగా పాసవటమే ఘనం అనుకుంటున్నాను

ఆ మాటలకు కామాక్షి ముఖం చిన్న బుచ్చు కుంది వాడంటే మీకెప్పుడూ చులకనే అంది కోపంగా

కామూ వాడంటే నాకు ప్రేమ లేదనా మురళి నా ప్రాణం నాలోకం నా ఆశలు కలలు అన్నీ వాడే కానీ మనం కలలో జీవించ కూడదు హేతువాదంతో జీవితాన్ని చూడాలి

అతనిమాటలు కామాక్షికి సంతృప్తిని కలిగించలేదు అకారణంగా తన కొడుకును నిందిస్తున్నారని అలక బూనింది భాస్కర మూర్తి మాటలలోని యధార్థం ఆమెకు రుచించలేదు ఒక్క కామాక్షి మాత్రమే కాదు కొడుకుల పట్ల గుడ్డిప్రేమలో పడ్డ కామాక్షి వంటి ఏ తల్లికి కూడా యదార్థం రుచించదు

కామాక్షి తన మాటలకు చిన్న బోయిందని అలక బూనిందని గ్రహించి ఆమె అలక తీర్చటం కోసం ఉత్సాహ పరచటం కోసం పోనీ ఏ గ్రూపుతో చదివిద్దామని వుందో నువ్వే చెప్పరాదూ? అన్నాడు

ఇంటరు బై పి గ్రూపుతో చదివిద్దాం వాడు డాక్టరైతే చూడాలనివుంది అందికామాక్షి

భాస్కరమూర్తి చిన్న చిరునవ్వు నవ్వాడు అలాగే తప్పకుండా చదివిద్దాం అన్నాడు

కామాక్షి ముఖం వికసించింది తన కొడుకు ఆక్షణంలోనే డాక్టరై తెల్లకోటు వేసుకుని స్టెతస్కోపు మెడలో తగిలించుకుని స్కూటరెక్కి హాస్పిటల్‌కు వెళుతున్నట్టుగా ఊహించుకుని



మురిసి పోయింది

ప్రతీ కన్నతల్లి అక్షరాభ్యాసం చేయించిన రోజునే తన కొడుకు, డాక్టరో ఇంజనీరో కలక్టరో అవుతాడని ఊహించుకుని మురిసి పోవటం పరిపాటి కానీ ఎంతమంది బిడ్డలు కన్నతల్లుల ఆశల్ని కలల్ని నిజం చేస్తున్నారని ఆలోచించరు లక్షమందిలో ఒక్కరు సాధించిన విజయాన్ని దృష్టిలో నిలుపుకుని కలలు కనటం సర్వ సాధారణం వాస్తవానికి జరిగేది వేరుగా వున్నదాన్ని పరిగణనలోకి తీసుకోవటానికి సిద్ధంగా వుండరు కామాక్షి కూడా అలాంటి తల్లే

వారం రోజుల తరువాత ఆఫీసునుంచి వస్తున్న భాస్కరమూర్తి స్నేహితుడు రామనాథం ఎదురయ్యాడు కుశల ప్రశ్నలు లోకాభి రామాయణం పూర్తయిన తరువాత మూర్తీ నువ్వు మరోలా భావించకపోతే మురళి గురించి ఒక్క మాట చెప్పాలనుకుంటున్నాను అన్నాడు

ఆ మాట వినగానే మురళి గురించి ఏ చెడు మాట వినవలసి వస్తుందో నని అతని గుండెల్లో రాయి పడినట్లయింది ఏమిటి? అన్నాడు

మీ మురళి నలుగురైదుగురు పిల్లలతో చేరి శివాలయం వెనక ప్రతీ సాయంత్రం చీట్ల పేక ఆడుతున్నాడు నా కళ్ళతో నాలుగైదు సార్లు చూసాను ఈ వయసులో పాడై పోతే మరి బాగుచేయటం కష్టం కాస్త మందలించి దారిలో పెట్టుకో

ఆ మాటలు అతన్ని అశని పాతంలా తాకాయి చాల థాంక్సు రామనాథం నిష్ఠూర మైనా నిజం చెప్పావు నువ్వే నిజమైన హితుడవు

బాస్కరమూర్తి అటు నుంచి అటే శివాలయానికి వెళ్ళాడు రామనాదం చెప్పినట్లుగానే మురళి నలుగురు పిల్లలతో కూడి చీట్ల పేక ఆడుతూ కనిపించాడు పుస్తకాల సంచులన్నీ ఒకే చోట గుట్టగా వున్నాయి వాళ్ళ ముందు చిల్లర పరిచి వుంది తన కొడుకు డబ్బు పెట్టి పేక ఆడేస్థితికి ఎదిగాడన్నమాట

బాస్కర మూర్తి గుండె చిద్రమై పోయింది నిజం ఆలోచిస్తే కామాక్షి కంటే తనే మురళి మీద ఎక్కువ ఆశలు పెట్టుకున్నాడు మురళిని ఏ డాక్టరో

## ఆశలు – కలలు

ఇంజనీరునో చేయాలని తన వలెనే తన కొడుకు గుమాస్తా బ్రతుకు బ్రతక కూడదని అందుకు తన సర్వస్వాన్ని వెచ్చించ టానికి సిద్ధమై వున్నాడు కామాక్షి స్త్రీ గనక అందునా కన్నతల్లి కనుక మనసులో మాటను దాచుకో లేక తన ఆశల్ని ఆకాంక్షల్ని బైట పెట్టింది కానీ ఆమెకంటే ఎక్కువగా ఆశల్ని పెట్టుకున్నా గుండెల్లో భద్రంగా దాచుకున్నాడు మురళి తమ కలల్ని నాశనం చేస్తూ అధోగతికి జారిపోతూ వుండటం కళ్ళతో చూసి భరించ లేక పోయాడు

మురళీ బిగ్గరగా గద్దించాడు

తండ్రి కంఠస్వరం వింటూనే కన్నంలో దొరికిన దొంగలా బిగుసుకు పోయాడు

నువ్వు రోజూ చేస్తున్న హోమ్ వర్కు ఇదన్న మాట?

మురళి తండ్రి మాటలకు బదులు చెప్పకుండా వున్న చోటనే శిలాప్రతిమవలె నిలుచుండి పోయాడు

ఇంటికి పద

మురళి పుస్తకాలు చేతపట్టు కుని తండ్రి వెనుక ఇంటికి వచ్చాడు గుమ్మంలోనే కామాక్షి ఎదురైంది ఇద్దరూ ఎక్కడ నుంచి కలిసి వస్తున్నారు

నీ కొడుకు స్కూలు వదిలిన తరువాత స్నేహితులతో హోమ్ వర్కు చేస్తున్నా నన్నాడుగా అది ఎంత వరకూ యదార్థమో తెలుసుకొందామని వెళ్ళాను

ఇంతకీ హోమ్ వర్క్ చేసుకుంటున్నాడా?

ఆఁ హాఁ అన్నాడు భాస్కరమూర్తి కామాక్షికి నిజం చెప్పటానికి అతనికి మనస్కరించ లేదు ఆ కన్నతల్లి హృదయం కొడుకు పలుకుల్ని విని తట్టుకోలేదని నిజాన్ని తనలోనే దాచుకున్నాడు కామాక్షి ఇద్దరికీ కాఫీ కలిపి తేవటానికి వంటింట్లోకి వెళ్ళింది బాస్కరమూర్తి మురళి గదిలోకి వెళ్ళాడు మురళి తండ్రిని చూసి పిల్లిలా బిగుసుకుపోయాడు

నాన్నగారూ తప్పయిపోయింది ఇంకెప్పుడూ అలాంటి పనులు చేయను నన్ను క్షమించండి అన్నాడు

మురళి మాటలకు అతని మనసులోని కోపమంతా మంచులా కరిగిపోయింది

' చూడు మురళీ నీ వయసులో వున్నప్పుడు చెడు స్నేహాలు చేసి ఆకతాయి గా తిరిగి చదువు నిర్లక్ష్యం చేసాను మెట్రిక్ పాసు కావటానికే నాలుగు ఛాన్సులు పట్టింది నాతో విసిగి నా తల్లి దండ్రులు నా చదువు అంతటితో ఆపించి వేసారు ఒక వయసు వచ్చిన తరువాత నా తప్పు నేను తెలుసుకున్నాను కానీ అప్పటికే ఆలస్యమైపోయింది నేను చదివిన చదువుకు గుమాస్తా ఉద్యోగం దొరకటమే గగనమైపోయింది ఆ వయసులో చదువును నిర్లక్ష్యం చేసిన ఫలితంగా జీవితంలో ఎన్నో కష్టాలు పడ్డాను నేను చేసిన తప్పు నువ్వు చేయకుండా బాగా చదువుకుని పెద్ద హోదాతో పెద్ద జీతంతో మంచి ఉద్యోగం సంపాదించుకుని సుఖంగా బ్రతుకుతావని ఆశపడుతున్నాను జీవితంలో నా చేజారిన అదృష్టాన్ని నువ్వు అందుకుంటావని నేను సాదించలేనివన్నీ నువ్వు సాదిస్తే చూసి ఆనందించాలనుకుంటున్నాను అందు కోసం ఎన్ని కష్టాలయినా పడి నిన్ను చదివించా లనుకుంటున్నాను మీ అమ్మ నా కంటే ఎక్కువగా ఆశలు పెట్టుకుంది మా ఆశల్ని నెర వేరుస్తావని మా కలల్ని పండిస్తావని ఇంకా నేను విశ్వసిస్తూనే వున్నాను నువ్వు తప్పు దారిలో పడ్డావని తెలిస్తే మీ అమ్మ తట్టుకోలేదు అందుకే ఈ విషయాన్ని మీ అమ్మతో చెప్పలేదు

అలాగే నాన్నగారూ ఇంకెప్పుడూ చెడ్డ పనులు చేయను శ్రద్ధగా చదువుకుంటాను అన్నాడు మురళి

ఈ సంఘటన జరిగిన తరువాత మురళి ప్రవర్తనలో కొద్దిగా మార్పు కనుపించింది స్కూలు వదిలిన తరువాత తిన్నగా ఇంటికి వచ్చి హోమ్ వర్కు చేసుకోవటం శ్రద్ధగా చదవటం సాగించాడు

మురళి దారిలో పడ్డాడని బాస్కరమూర్తి సంతోషించాడు కానీ అతని సంతోషం ఎంతో కాలం నిలవలేదు రెండు నెలల తరువాత మురళి పరిస్థితి యథాస్థితికి వచ్చింది ఆలస్యంగా ఇంటికి రావటం శలవు దినాల్లో అసలు ఇంటి పట్టునే వుండకపోవటం జరిగేది బాస్కరమూర్తి నిలదీసి అడిగితే ఏవో కారణాలు చక్కగా అతికేలా చెప్పి తప్పించుకునేవాడు

చెడిపోతున్న కొడుకును ఎలా దారిలో పెట్టాలో అర్థం కాలేదు మంచి మాటలతో చెప్పాడు దండించాడు బయ పెట్టాడు అయినా మురళి ప్రవర్తనలో మార్పు రాలేదు మురళి గురించి అతని మనసు క్రుంగిపోతున్నది ఏం చేస్తే మురళిలో పరివర్తన కలుగుతుందోనని మార్గాల కోసం అన్వేషించసాగాడు

ఈలోగా జరగకూడని నష్టం జరగనే జరిగిపోయింది ఆ రోజు రాత్రి పది గంటలైనా మురళి ఇంటికి రాలేదు భాస్కరమూర్తి మురళి కోసం స్కూలుకు వెళ్ళాడు, అతని స్నేహితుల ఇంటికి







వెళ్లాడు మురళి ఎక్కడెక్కడ తిరగటానికి అవకాశం వుందో అన్ని చోట్ల గాలించాడు అయినా మురళి జాడ తెలియలేదు ఒక వేళ ఏదైనా సినిమాకు వెళ్లేడేమోనని మనసు సరిపెట్టుకుని ఆశగా ఎదురు చూసారు రాత్రి రెండు గంటలైనా మురళి రాకపోవటంతో ఆ ఆశ కూడ అడుగంటింది భార్యా భర్తలిద్దరూ ఆ రాత్రి మంచినీరు కూడ ముట్టలేదు తెల్లవార్లూ మేలుకుని మురళి కోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు

తెల్లవారి ఎనిమిది గంటలకు పోలీసు కానిస్టేబిల్ భాస్కరమూర్తి ఇల్లు వెతుక్కుంటూ వచ్చాడు

భాస్కర మూర్తిగారు మీరేనా?

అవును నేనే'

మీ అబ్బాయి మురళి పోలీసు స్టేషనులో వున్నాడు ఇనస్పెక్టర్ గారు మిమ్మల్ని తీసుకు రమ్మన్నారు అన్నాడు

'మా మురళి పోలీసు స్టేషన్‌లో ఎందుకున్నాడు అంది కామాక్షి ఆందోళనగా

మీ అబ్బాయి మరో ఇద్దరు కుర్రాళ్లు కలసి స్కూటర్ దొంగతనం చేసి దొరికిపోయారు

ఆ మాటలు వింటూనే కామాక్షి తల మీద పిడుగు పడినట్టు కూలిపోయింది భార్య పరిస్థితిని చూసిన భాస్కరమూర్తి గుండె తరుక్కుపోయింది

మనబ్బాయి అలాంటి వాడు కాదు ఎక్కడో ఏదో పొరపాటు జరిగింది నేను వెళ్ళి అబ్బాయిని తీసుకు వస్తాను నువ్వు ధైర్యంగా వుండు భార్యకు ధైర్యం చెప్పి కానిస్టేబుల్ వెంట పోలీసు స్టేషనుకు వెళ్ళాడు

తమ పనిచేస్తున్న ఆఫీసులోని ఆఫీసరు పలుకుబడి ఉపయోగించి మురళిని విడి పించి తీసుకు వచ్చాడు

ఏం జరిగిందండీ? అంది కామాక్షి గుమ్మంలోనే ఇకదాచి ప్రయోజనం లేదనుకున్నాడు జరగకూడనిదే జరిగింది ముందు వేడి నీళ్ళు పెట్టి వాడి వంటికి కాపడం పెట్టు లాకప్‌లో చిత్రహింసలు పెట్టారు అన్నాడు

జరిగిందేమిటో కామాక్షి గ్రహించింది ఆమెలోని మాతృప్రేమ ద్వేషంగా మారిపోయింది

ఛీ! ఛీ! వాడిని నేను తాకను అంది

తప్పు కామాక్షీ వాడు మనబిడ్డ. ఎలాంటి వాడైనా మనకు తప్పదు

వాడు నా బిడ్డ కాదు నా బిడ్డే అయితే ఇలాంటి పాడు పనులు చేయడు కామాక్షి గుమ్మంలోనే కూలబడి పోయి కొంగు ముఖానికి అడ్డం పెట్టుకుని దుఃఖించ సాగింది

భాస్కర మూర్తికి భార్యను వోదార్చే శక్తి లేక వాలు కుర్చీలో కూర్చుండి పోయాడు రాత్రి ఏడుగంటయినా కామాక్షి లేచి పొయ్యి వెలిగించలేదు ఆమె ఆశలు కలలు నాశనమయ్యాయని తెలియగానే మనసు వికలమై పోయింది పిచ్చిదాని వలే సూన్యంలోకి చూస్తూ మౌనంగా వుండి పోయింది

ఎనిమిది గంటలు దాటిన తరువాత మురళి తనగది లోంచి బయటకు వచ్చి అమ్మా ఆకలేస్తోంది నిన్నటి నుంచీ ఏమీ తినలేదు అన్నం పెట్టు అన్నాడు

ఆ మాట వినగానే ఏ కన్న తల్లి కయినా మనసుకరుగుతుంది కానీ కామాక్షి వున్న స్థితిలో మురళి మాటలు ఆమెను మరింత పిచ్చి దాన్ని చేసాయి

ఎవరురా నీకు అమ్మ నీ అమ్మ ఎప్పుడో చచ్చి పోయింది నన్ను 'అమ్మా అని పిలవకు అలా పిలిస్తే కిరసనాయిలు పోసుకుని వంటికి నిప్పు అంటించుకుంటాను ఫో! పో! నా కంటికి ఎదురుగా కనిపించకు నేను మరింత పిచ్చిదాన్నయి పోతాను

తల్లి మాటలు విని మురళి గిరుక్కున వెనక్కి తిరిగి తలవంచుకుని తన గదిలోకి వెళ్ళి పోయాడు భాస్కరమూర్తి హొటెల్‌కు వెళ్ళి క్యారేజి తీసుకు వచ్చాడు

రాత్రి నుంచి నువ్వు ఏమీ తినలేదు నువ్వు కాస్త ఎంగిలిపడి వాడిక్కూడా పెట్టు అన్నాడు

ఇంట్లోంచి వెళ్ళి పోయాడు అంటూ వున్న చోటనే కూలబడి పోయాడు భాస్కరమూర్తి

* * * * *

భార్య పిలుపుతో అరమోడ్పు కన్నులతో గత జ్ఞాపకాలతో మునిగి వున్న భాస్కరమూర్తి ఈ లోకంలోకి వచ్చాడు

రేపు మురళి పుట్టిన రోజు బజారు కెళ్ళి కొబ్బరికాయలు తీసుకురండి వాడికి కొబ్బరిలవుజు చక్కెర పొంగలి అంటే ఎంతో ఇష్టం రేపు వాడు తిరిగి వస్తే ఎంతో సంతోషంగా తింటాడు అంది కామాక్షి

మురళి ఇల్లు వదలి వెళ్ళి అయిదు సంవత్సరాలైంది ఈ అయిదు సంవత్సరాల నుంచి కొడుకు తిరిగి వస్తాడని, ప్రతీ పుట్టిన రోజుకు కొబ్బరి లవుజు చెక్కెర పొంగలీ చేస్తూనే వున్నది అతనికోసం ఆమె కన్నీరు పెట్టని రోజే లేదు

భాస్కర మూర్తి చేతి సంచి తీసుకుని బజారుకు బయలు దేరాడు ఏమండీ అంటూ వంటింట్లోంచి




నాకు అన్నం వద్దు కాస్త విషం తెచ్చి పెట్టండి అంది కామాక్షి ఆమెతో వాదించి రెచ్చగొట్ట దలుచుకో లేదు లేచివెళ్ళి వాలు కుర్చీలో కూర్చుండి పోయాడు ఆ రాత్రి కూడా ఎవరూ భోజనం చేయలేదు

తెల్లవారిన తరువాత వాలు కుర్చీలోనే నిద్ర పోతున్న భర్తను నిద్ర లేపి ఏమండీ మురళి కనుపించటం లేదు అంది

భాస్కర మూర్తికి నిద్రమత్తు విడిపోయింది ఏమిటీ మురళి కనుపించటం లేదా? అంటూ మురళిగదిలోకి వెళ్ళాడు మడత పెట్టిన కాగితం టేబుల్ మీద రెపరెపలాడుతూ కనుపించింది

నాన్నగారూ!

నేను ఇంట్లోంచి వెళ్ళి పోతున్నాను దయవుంచి నాకోసం వెతికించ వద్దు ఇట్లు

మీ మురళి

కామూ! అంతా అయిపోయింది మురళి వచ్చింది

ఏమిటి ఇంకా ఏమైనా కావాలా?

మురళికి ఒకజత బట్టలు తీయిస్తే బాగుంటుంది వాడు రాగానే తొడుక్కోవటానికి బట్టలు వుంటాయో వుండవో

అలాగే తప్పకుండా తీసుకొస్తాను

వెళ్ళేటప్పుడు మన ఎదురింటి వారి అబ్బాయి కొలతలు వ్రాసుకుని వెళ్ళండి మన మురళి వయసు ఆ పిల్లవాడి వయసూ ఒక్కటే చిన్నప్పుడు ఇద్దరి కొలతలూ ఒకే విధంగా వుండేవి అంది

భార్య కోరిన విధంగానే మురళికి కొత్త బట్టలు కుట్టించి తెచ్చాడు భాస్కరమూర్తి కామాక్షి కొడుకు కోసం కొబ్బరిలవుజు చక్కెర పొంగలి తయారు చేసి వుంచింది

మనపిచ్చిగాని వాడు తిరిగి వస్తాడంటావా?

అవేంమాటలండీ వాడు తప్పక తిరిగి వస్తాడు

# ధర్మపథం శ్రీరాముని ఔదార్యం




అందరూ దేశసమైక్యానికీ, మతసామరస్యానికీ, పరస్పర సహాయానికీ గట్టి కృషి చెయ్యాలని వివిధ పక్షాల నాయకులు తరచుగా మహోపన్యాసాలివ్వడం పరిపాటి కాని ఆ విషయంలో హృదయ పూర్వకంగా తగిన కృషి జరుగుతున్నట్లు తోచడం లేదు మతవిద్వేషాలు చెలరేగి అత్యాచారాలూ, ప్రాంతీయ వివాదాలూ, సరిహద్దుల తగాదాలు, నదీజలాల పంపిణీలో వివాదాలూ కొనసాగుతునే ఉన్నవి జనాన్ని నడిపే వారు నాయకులు వారు చిత్తశుద్ధితో యత్నించినట్లయితే ఈ చిక్కులు విడిపోయి, ప్రజలకు మనశ్శాంతి, సుఖం కలుగుతాయి పూర్వకాలంలో ఇలాటి తగాదాలకు తావు ఉండేది కాదు రామాయణాన్ని బట్టి చూస్తే శ్రీరామునికి ప్రాంతీయాభిమానం, జాత్యభిమానం, ఎక్కువ తక్కువ భేదభావం లేదనిస్పష్టంగా తెలుస్తున్నది

ఉత్తర కోసలాధిపతి యగు దశరథుని పుత్రుడైన శ్రీరాముడు దక్షిణ కోసలాధీశుని దౌహిత్రుడు ఇది ఉత్తర, దక్షిణ దేశాల రాజుల బంధుత్వానికి ఉదాహరణ వనవాసానికి బయలుదేరి గంగా తీరం చేరుకున్న రాముణ్ణి, ఆ ప్రాంతపు పల్లెలకు నాయకుడైన గుహుడు అక్కడే ఉండి ఆ ప్రాంతాన్ని పాలించాలని ప్రార్థించగా, వనవాసమే గాని గ్రామవాసం తనకు తగదని సవినయంగా తిరస్కరించాడు సీతాదేవిని వెతుకుతూ తిరుగుతున్నప్పుడు సుగ్రీవునికి మిత్రుడై, అతన్ని కిష్కింధా రాజ్యానికి అధిపతిని చేశాడు రావణునిపైకి యుద్ధానికి వెళ్లినప్పుడు శరణాగతుడైన విభీషణునికి అభయమిచ్చి, అతన్నిలంకా రాజ్యానికి పట్టం కట్టాడు ఇవి అతని ఔదార్యానికి తార్కాణం

గుహుడు ఉత్తర దేశీయుడు సుగ్రీవుడు మధ్య ప్రాంతీయుడు విభీషణుడు దక్షిణ ప్రాంతపు వాడు వివిధ ప్రాంతీయుల పట్ల శ్రీరాముని అభిమానం దీని వల్ల వ్యక్తమవుతున్నది

అతనికి జాతి విచక్షణ లేదు గుహుడు వెనుక పడిన కులానికి చెందినవాడు సుగ్రీవుడు వానరులలో ముఖ్యుడు విభీషణుడు రాక్షసాగ్రేసరుడు అన్ని జాతుల వారూ అతని ఆదరానికి పాత్రులైన వారే! మరో ముఖ్య విషయం దశరథ మహారాజు కుమారులు నలుగురు కారట! ఏడుగురట! ఎలాగ్గునంటే రామునికి గుహుడూ, సుగ్రీవుడు, విభీషణుడూ కూడా సోదరప్రాయులే! ఈ ముగ్గురూ చేరితే దశరథ పుత్రులు ఏడుగురౌతారు! ఈ విషయాన్ని ఆ మహనీయుడే తెలియజేశాడు

బులుసు వేంకటరమణయ్య

## ఆశలు – కలలు

అందరికళ్ళూ కుట్టేలా గొప్ప వాడై మరీ తిరిగి వస్తాడు ప్రక్క వీధిలోని కస్తూరి వారబ్బాయి ఇలాగే చిన్నప్పుడు ఇంట్లోంచి పారిపోయి, పదేళ్ళ తరువాత తిరిగి వచ్చాడు పెద్ద ఉద్యోగం బోలెడు డబ్బు సంపాదించుకుని మరీ తిరిగి వచ్చాడు మన మురళి కూడ చాల గొప్పవాడై తిరిగి వస్తాడు

అలా అంటున్నప్పుడు ఆమె కళ్ళల్లో ఏదో మెరుపు ఎంతో ఆశ ఆ ఆశలోనే ఎంతో సౌఖ్యం వుంది ఆనందం వుంది అదే మనిషి ప్రాణానికి మనుగడకు ఊపిరి అదే మనిషిని బ్రతికిస్తుంది ఆ ఆశతోనే మురళి రాక కోసం ఎదురు చూస్తూ వారిద్దరూ జీవితాన్ని వెళ్ళదీస్తున్నారు అలా కలలు కనటంలోనే మనసుకు కావలిసినంత తృప్తి ప్రశాంతత కలుగుతుంది

★ ★ ★ ★ ★

ఇంటి ముందు ఎరుపురంగు మారుతీ కారు ఆగింది కారు డోర్ తెరుచుకుని పింక్ కలర్ సూటులో వున్న ఇరవై ఏళ్ళ యువకుడు దిగి ఠీవిగా దర్జాగా తన కేసే వస్తున్నాడు ఆ యువకుడు నల్లగా పొడుగ్గా వున్నాడు మురళి పోలికలు స్పష్టంగా కనుపిస్తున్నాయి అతను దగ్గరగా ఇంకా దగ్గరగా వచ్చాడు తను గుర్తించాడు మురళిని పోలివుండటమేమిటి మురళే తన కన్న కొడుకు

నాన్నగారూ అలా చూస్తూ వుండి పోయారేమిటి? నన్ను గుర్తు పట్ట లేదా? నేను మీ మురళిని

భాస్కరమూర్తి వెంటనే మురళిని ఆనందంతో కౌగిలించుకున్నాడు

నాన్న గారూ మీరు కోరినట్లే పెద్ద ఆఫీసరునయి తిరిగి వచ్చాను ఇంత కాలం మిమ్మల్ని ఖేదపెట్టినందుకు నన్ను క్షమించండి

భాస్కర మూర్తి ఆనందం పట్టలేక పోయాడు

కామాక్షీ కామాక్షీ వేగం బయటకురా మన మురళి వచ్చాడు పెద్ద ఆఫీసరై మరీ తిరిగి వచ్చాడు ఆవేశంగా అరిచాడు భాస్కరమూర్తి

వంటింట్లోంచి కామాక్షి పరుగెత్తుకుంటూ వచ్చి అక్కడ ఎవరూ లేక పోవటం చూసి "ఈయనకు పిచ్చి పట్టలేదు కదా అనుకుంది

భాస్కరమూర్తి వాలు కుర్చీలో కూర్చుని కునికి పాట్లు పడుతూ తనలో తాను మాట్లాడుకుంటున్నాడు

కామాక్షి అతన్ని తట్టి లేపింది అదిరి పడి కుర్చీలోంచి లేచి తన తప్పు తాను తెలుసుకుని ఖిన్నుడయ్యాడు

మెయిల్ వచ్చే వేళయింది ఈ వేళ అబ్బాయి తప్పకుండా తిరిగి వస్తాడు స్టేషనుకు వెళ్ళరా? ఇంకా ఇక్కడే కూర్చున్నారు అంటూ భర్తను తొందర పెట్టింది కామాక్షి

భాస్కర మూర్తి లేచి కండువా దులుపుకుని భుజాన వేసుకుని స్టేషన్‌కు బయలుదేరాడు అతను స్టేషన్‌కు వెళ్ళిన మరుక్షణం నుంచి వీధి వరండాలో కూర్చుని మురళి రాక కోసం ఎదురు చూడసాగింది □

"షీలా... వికసించిన ఛాయతో వెలిగిపోతుంది
నీ ముఖ సొగసు... చూసిచూసి
మతితప్పి పారేసుకున్నా నా మనసు!"

# ఇతర్లు గుర్తించేలాంటి మెరుగైన వంటి ఛాయను షీలాకి సహజంగా, మృదువుగా సమకూర్చింది ఫెయిర్ అండ్ లవ్‌లీ... అదెలాగో చదవండి.

పెళ్లి కూతురయ్యేది ఒక్క రోజే, కాని భార్యగా వుండేది జీవితాంతం! ఇది అర్థం చేసుకునే షీలా పెళ్లయ్యాక కూడా ఫెయిర్ అండ్ లవ్‌లీ ప్రతి ఉదయం, రాత్రీ ఉపయోగిస్తూనే వుంది ఎందుకంటే, వికసించిన వంటి ఛాయ అనే ఓ అమూల్య కానుకని షీలాకి ఇచ్చింది ఫెయిర్ అండ్ లవ్‌లీ—దాన్ని జీవితాంతం నేస్తంగా ఉంచుకోవాలని ఆమె కోరిక, పెళ్లయి ఎన్నో పౌర్ణమి రోజులు గడిచినా, మీ ఆయన ఇప్పటికీ హనీమూన్ మోహంలోనే మునిగి వుంటే, మీరు మాత్రం ఆ సౌందర్య నిధిని వదులుకుంటారా?

షీలా లాగే మీరు కూడా 'తెల్లని వంటి ఛాయ' అనే కలని నిజం చేసుకోవచ్చు—ఫెయిర్ అండ్ లవ్‌లీతో

## ఓ ముఖ్యమైన వైజ్ఞానిక విజయం

ఫెయిర్ అండ్ లవ్‌లీ మీ వంటికి సహజమైన రీతిలో మెరుగైన ఛాయ నివ్వడానికి దీనిలో వుంది ఓ సాటిలేని ఫార్ములా—ఇది ముఖ్యంగా రెండు విధాల పనిచేస్తుంది ఒకటి ఇది చర్మం అడుగున పనిచేసి శరీరం స్వతహాగా లోలోనే నల్లబడటాన్ని అరికడుతుంది—ఇంకే క్రీమూ చెయ్యలేని తీరులో



ఫెయిర్ అండ్ లవ్‌లీ వాడక ముందు



ఫెయిర్ అండ్ లవ్‌లీ వాడిన తర్వాత



రెండు దీని డబల్ సన్‌స్క్రీన్ చర్య, లోనికి చొచ్చుకుపోయి నల్లబరిచే సూర్య కిరణాల నుంచి చర్మాన్ని కాపాడుతుంది అంచేత 6 నుంచి 8 వారాల్లో పైకొచ్చే కొత్తచర్మ పొరలు మరింత మెరుగైన ఛాయ కలిగి వుంటాయి మీరు ఫెయిర్ అండ్ లవ్‌లీని నియమానుసారంగా రోజుకు రెండుసార్లు ఉపయోగిస్తూంటే మీ వంటి ఛాయ ఎంతో అందంగా మృదువుగా, తెల్లగా అలాగే నిలిచి వుండటం ఖాయం

## ఉపయోగించే పద్ధతి

ముఖం, మెడ చేతులు కడుక్కున్నాక, వాటి మీద ఫెయిర్ అండ్ లవ్‌లీ క్రీము చుక్కచుక్కలుగా రాయండి ఇప్పుడు వేళ్లను ఎగువకు రుద్దుతూ నెమ్మదిగా మాలిష్ చేయండి ఫెయిర్ అండ్ లవ్‌లీ పనిచేయడం ప్రారంభించగానే మీకు కొద్దిగా జిమజిమలాడవచ్చు భయపడకండి, అది తొందరగా తగ్గిపోతుంది

## సులభంగా లోనికి ఇంకుతుంది

ఫెయిర్ అండ్ లవ్‌లీ ఇంతకు ముందుకన్న ఇప్పుడు మృదువుగా, నేవళంగా ఉంటుంది, అది చర్మం అంతటా మరింత సమానంగా పరుచుకొని, మరింత సులభంగా లోనికి ఇంకుతుంది త్వరలోనే ఆ తేడాని మీరు అనుభూతి చెందుతారు కంటితో చూస్తారు కూడా!

మీరు ఫెయిర్ అండ్ లవ్‌లీ గురించి ఇంకా ఏమైనా అడిగి తెలుసుకోవాలనుకుంటే ఈ చిరునామాకు వ్రాయండి శ్రీమతి కవితా కుమార్ ఫెయిర్ అండ్ లవ్‌లీ అడ్వయిజర్, పి ఓ బాక్స్ 758, బొంబాయి-400 021

కొత్తది! మరింత మృదువైన

**ఫెయిర్ అండ్ లవ్‌లీ**

వంటి ఛాయ మెరుగుపరిచే క్రీమ్




## వంటి ఛాయను మెరుగుపరుస్తుంది సహజంగా, మృదువుగా... ఇతర్లు గుర్తించేలాగ!

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS FAL 50 2720 TL

సీరియల్

# ప్రత్యూష పవనాలు

జి. భవానీ కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

భార్య తను తీర్థయాత్రలకి వెడుతున్నట్లుగా తెలియజేస్తూ, ఇక్కడి మిల్లు వ్యవహారాలు మేనేజరకి అప్పగించాను ఏదైనా అత్యవసరం అయితే నీకు కబురు చేస్తారు వెంటనే ఒకసారి వెళ్ళి ఆ వ్యవహారాలు సెటిల్ చేసి వస్తూండు నేను ఆశించిన విధంగా నువ్వు యోగ్యుడివయ్యావు అది నాకు చెప్పలేనంత సంతోషంగా ఉంది ఆడపిల్లల్ని అత్తవారింటికి పంపించి తండ్రిగా నా బాధ్యత నేను నెరవేర్చుకున్నాను ఇక కృష్ణా రామా అనుకుంటూ కాలం గడుపుతూంటే చాలనిపించి ఈ ప్రయాణం పెట్టుకున్నాను ఎక్కడెక్కడ ఉంటున్నదీ తెలియజేస్తూ అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూనే ఉంటాను మా గురించి మీరేమీ కంగారు పడకండి మాలతి మళ్ళీ మనవడినో మనవరాలినో అందించే సమయానికి అంటే నాలుగైదు నెలల్లో తిరిగి వచ్చేస్తాము అప్పుడు ఇంక గుంటూరు మకాం ఎత్తేసి మీ కోరిక ప్రకారం మీ దగ్గరే ఉంటూ మనుమలతో కాలక్షేపం చేస్తాము ప్రకాశం ఆరోగ్యం జాగ్రత్త నీకు మాలతికి చిరంజీవి ప్రహ్లాద్‌కీ ఆశీస్సులు

ఉత్తరం చదివి నిర్విణ్ణుడయ్యాడు వేణు

బయలుదేరే ముందే ఉత్తరం రాసి ఇచ్చారని లారీ డ్రైవరు చెప్పడంతో ఆ సమయానికి ప్రయాణంలో ఉండి ఉంటారని గ్రహించి ఇంటికి వచ్చి మాలతికిఆ విషయం తెలియజేశాడు వేణు

నాన్నకి ఈ పక్షవాతం వచ్చినప్పట నుంచీ మావయ్య గారికి విరక్తి భావం ఎక్కువైంది పోన్లెండి నాలుగూళ్ళూ తిరిగి వస్తే కాస్త మనస్సు కుదుట పడుతుంది అంది మాలతి

అది నిజమే ననుకో నాన్న ఒంటరిగా దొరికితే అమ్మ మరీ సాదిస్తూంటుంది ఇంక నాన్నకి మనశ్శాంతి ఏముంటుంది?

అందుకని? ఆవిణ్ని వదిలేసి ఆయనొక్కరూ వెడితే బాగుండేదంటారా? బాగుంది మీ వరస భార్య పక్కన లేనిది భర్త ఎం చెయ్యడానికీ అర్హుడు కాదు సీతాదేవి వాల్మీకి మహర్షి ఆశ్రమంలో ఉన్నప్పుడు శ్రీరాముడు అశ్వమేద యాగం తలపెట్టి భార్య లేకుండా ఒంటరిగా చెయ్యకూడదు కాబట్టి సీతాదేవి బంగారు ప్రతిమని చేయించాడని మీరు చదవలేదూ! అయినా పిచ్చి శ్రీవారూ! ఎన్ని తిట్టుకున్నా ఎంత పోట్లాడుకున్నా భార్యాభర్తలు భార్యాభర్తలే అంతరాంతరాలలో ఒకరి మీద ఒకరికి ప్రేమ జీవితాంతం వరకూ అలాగే ఉంటుంది పెళ్ళయి ఇంత కాలమైనా ఆ విషయం గ్రహించకపోతే ఎలాగండీ భర్త ముక్కు పట్టి ఊపింది

అసలు మనం ఇంత వరకూ ఒక్కసారి కూడా పోట్లాడుకోనే లేదుగా

బాగుంది ఆ విషయం తెలుసుకోడానికి పోట్లాడుకోవాలేమిటి? నవ్వి అతని భుజాల చుట్టూ చేతులు వేసి అతని తలని చాతీకి ఆనించుకుని ప్రేమగా చెంపలు నిమురుతూ నాకు పోట్లాటలంటే భయం జీవితాంతం వరకూ మనం ఎప్పుడూ పోట్లాడుకోవద్దు ఇలాగే ఒకరిలో ఒకరుగా ఒకరి కోసం ఒకరుగా బ్రతికేద్దాము తల ముందుకి వంచి మృదువుగా అతని కళ్ళ మీద ముద్దు పెట్టుకుంది మాలతి

ఇలాంటి మాటలు ఇంకా చెప్పు మాలతీ వినాలనుంది కళ్ళు మూసుకుని ఆమెను ఆర్తిగా మరింత దగ్గరకు లాక్కున్నాడు వేణు

నాన్న నాది నువ్వెందుకు ముద్దు పెట్టుకుంతావ్ అంటూ ప్రహ్లాద్ చెయ్యి పట్టి గుంజేసరికి వేణుని వదిలేసి గబాల్న దూరం జరిగింది మాలతి

వేణు ప్రహ్లాద్‌ని ఒళ్ళోకి తీసుకుని గట్టిగా ముద్దు పెట్టుకుని మాలతి వైపు చూసి చిలిపిగా నవ్వాడు

కొంటి వెధవా! నాన్నే గానీ నేను నీ దాన్ని కాదేమిటి? చిరు కోపం నటిస్తూ అంది మాలతి

మరేమో నాన్న రోజూ బిస్కెత్తులు చాక్లెత్తులు అన్నీ తెత్తాలుగా చక్రాల్లాంటి కళ్ళని గుండ్రంగా తిప్పుతూ అంటూంటే ముద్దుగా అనిపించి ముందుకి వంగి బాబు రెండు బుగ్గలు గట్టిగా ముద్దు పెట్టుకుంది మాలతి

ఒరేయ్ కన్నా! పోనీ ఓ పని చేద్దాం నాన్నేమో నీది అమ్మేమో చెల్లాయిది సరేనా? అన్నాడు వేణు

చెల్లా యేది నాన్నా!

చెల్లాయి అమ్మ పొట్టలో ఉంది పొట్టలో నుంచి చెల్లాయి బయటికి వచ్చాక అమ్మ నాది అంటుంది అప్పుడు నువ్వు అమ్మ దగ్గరకి వెళ్ళకుండా ఉంటావా? అడిగాడు

ఊహు! అమ్మ లేపోతే నాకు అన్నం ఎవరు పెడతారు? ఎవరు బజ్జో పెడతారు? ఆ మాత్రానికే బాబు కళ్ళల్లో నీళ్ళు నిండుకోవడం చూసిన మాలతి తల్లి మనసు తల్లడిల్లింది

బాబుని ఎత్తుకుని తన గుండెలకి హత్తుకుని కళ్ళ మీద ముద్దు పెట్టుకుని కన్నా! అమ్మ నాన్న ఇద్దరూ నీవారేరా! సరేగానీ నీకు చెల్లాయి కావాలా? తమ్ముడు కావాలా అడిగింది మాలతి

**జరిగిన కథ - 13** మారుతీరావు కోరికమీద ఆయన కొడుకు వేణుగోపాల్‌కు ప్రకాశరావు కూతురు మాలతికి పెళ్ళి అవుతుంది మాలతి అత్త ఆడబిడ్డల కోపాన్ని వ్యతిరేకతను ఎదుర్కొంటుంది మాలతికీ వేణుగోపాల్‌కూ మధ్య విబేదం సృష్టించాలని అత్త చేసిన ప్రయత్నాలు విఫలమవుతాయి ప్రకాశరావుకు పెరాలిసిస్ వస్తుంది మాలతి వేణుగోపాల్ హైదరాబాద్‌లో కాపురం పెడతారు మారుతీరావుగారు ఆస్తిలో సగం కోడలికి రాయడం చూసి అత్తగారికి కోపం పెరిగిపోతుంది ఆడబిడ్డ సుగుణ పెళ్ళి జరుగుతుంది మాలతికి కొడుకు పుడతాడు

ఇద్దరూ కావాలి అన్నాడు ప్రహ్లాద్

వేణు వెనుక నుంచి 'విన్నావుగా వాడి కోరిక ఇక నీఇష్టం మాలతి చెవిలో గుసగుసలాడాడు వేణు

తల తిప్పి కోపంగా అతని వైపు చూడబోయి నవ్వేసింది మాలతి

ఆమె ముఖాన్ని అలాగే గట్టిగా పట్టుకుని ఆమె పెదవుల మీద ముద్దు పెట్టుకున్నాడు వేణు

కంగారుగా తల ముందుకి తిప్పుకుని కొడుకుని చూసింది మాలతి

మాలతి మెడలోని మంగళసూత్రాల గొలుసుతో ఆడుతున్నాడు ప్రహ్లాద్

ఒక కాలు నేలకి ఈడుస్తూ కర్ర సహాయంతో మెల్లగా లోపలికొచ్చారు ప్రకాశరావుగారు

కూర్చోండంకుల్!' చెయ్యి పట్టుకుని కుర్చీలో కూర్చొబెట్టాడు వేణు

రా బైటికి వెడదాం అన్నట్టు బాబుకి సైగ చేశారు

తల్లి ఒడిలో నుంచి జారి తాతగారి దగ్గరకి పరుగెత్తాడు బాబు

నాన్నా! ఎక్కువగా అటూ ఇటూ తిరగొద్దు పడిపోతావు వాడు నిన్ను హైరాన పెట్టేస్తాడు ఒకచోట కూర్చొబెట్టుకుని కథలు కబుర్లు చెప్పు అంది మాలతి

'ఫరవాలేదు' అన్నట్టు చెయ్యూపి మనవడిని వెంట బెట్టుకుని వెళ్ళిపోయారు ప్రకాశరావుగారు

తండ్రి, కొడుకు వెళ్ళిన వైపే చూస్తూ నిలబడిన మాలతి భర్త చెయ్యి



# ప్రత్యూష పవనాలు

భుజమ్మీద పడడంతో అప్రయత్నంగానే అతనికి చేరువగా నడిచింది

మాలా! బాబొక్కడే కాదు వాళ్ళిద్దరూ మన కొడుకులే అందుకే ఈసారి ఆడపిల్లని కను అంటున్న భర్తని కృతజ్ఞతా పూర్వకంగా తడిసిన కళ్ళతో చూసింది మాలతి

* * * * * * * * * *

సంతకం చేసి టెలిగ్రామ్ అందుకుని తెరిచి చూసింది మాలతి

తను పొరపాటుగా చదివిందేమో నని అక్షరాలు కూడదీసుకుని మళ్ళీ చదివింది కళ్ళు చీకట్లు కమ్ముతున్నట్లు కాళ్ళు గడగడా వణుకుతున్నట్లు అనిపించడంతో గేటు పట్టుకుని కాసేపు అలాగే నిలబడి పోయింది

టెలిగ్రామ్ లోని వార్త నిజం అనుకోడానికి ఆమె మనసు ససేమిరా ఇష్టపడడం లేదు

బాబు వెనుక నుంచి వచ్చి పైటపట్టుకుని లాగే సరికి ఈ లోకంలోకి వచ్చి బాబుని ఎత్తుకుని లోపలికొచ్చి వేణుకి ఫోను చేసి వెంటనే ఇంటికి రమ్మని చెప్పింది

మరో పావు గంటలో నే వేణు స్కూటరు ఇంటిముందు ఆగింది

పరుగు లాంటి నడకతో వేణు లోపలికి వచ్చి మాలా! ఏమిటి అర్జంటుగా రమ్మన్నావ్? అడిగాడు గాబరాగా

వణుకుతున్న చేతులతో టెలిగ్రామ్ కాగితం అతని చేతిలో పెట్టింది

నాన్నా! గట్టిగా కేకపెడుతూ కుప్పలా కూలి పోయాడు వేణు

అంతవరకూ ఆపుకున్న దుఃఖం గండిపడినట్లు పైకి ఉబికింది మాలతికి

టెలిగ్రాం కాగితం గాలికి రెపరెప లాడుతూ కర్తవ్యాన్ని గుర్తు చెయ్యడంతో దుఃఖాన్ని బలవంతంగా దిగమ్రింగుకుని ఏమండీ! ఎడుస్తూ ఇక్కడ కూర్చుంటే లాభంలేదు అక్కడ అత్తయ్యగారు ఒక్కరూ ఎంత బాధ పడుతున్నారో మనం వెంటనే వెళ్ళాలి అంది మాలతి

కొన్ని నిముషాల తేడాలో సర్వశక్తులు హరించుకు పోయిన వాడిలా అయిపోయాడు వేణు

శక్తి లేనివాడిలా లేచి పద ఏదైనా టాక్సీ మాట్లాడుకుని వెళ్ళిపోదాం మావయ్యతో ఇప్పుడేం చెప్పకు తట్టుకోలేరు రాత్రి పూట కూడా ఇక్కడే ఉండి మామయ్యని జాగ్రత్తగా చూసుకోమని ఆయాకి చెప్పు బాబుని కూడా ఉంచేద్దామా తీసి కెడదామా? అన్నాడు

వాడు మనల్ని వదిలిపెట్టి ఉండలేడు తీసికెడదాము ఇవిగో బీరువా తాళాలు డబ్బు అవీ తీసి జాగ్రత్తగా పెట్టుకోండి ఊరుకాని ఊరు మరో వంద ఎక్కువ ఉండేలాగే తియ్యండి అంటూ తాళాలు వేణుకిచ్చి ప్రయాణపు ఏర్పాట్లు చూడ్డానికి లోపలికెళ్ళింది మాలతి

మాలతి వెళ్ళి పోయాక టెలిగ్రామ్ మరోసారి చదివాడు

మారుతీరావ్ ఎక్స్‌పైర్డు స్టార్ట్ ఇమీడియట్లీ వారు బస చేసిన సత్రం యజమాని ఇచ్చిన టెలిగ్రామ్ అది

ఆ కౌగితంలో ముఖం దాచుకుని బోరుమన్నాడు

ప్రయాణానికి సిద్ధమై వచ్చిన మాలతికి అతన్ని ఆస్థితిలో చూసే సరికి దుఃఖం ఆగలేదు

తనూ అలా ఎడుస్తూ కూర్చుంటే భర్తకి ధైర్యం చెప్పే వారెవరూ లేరని గుర్తుకొచ్చి బలవంతంగా నిగ్రహించుకుని అతన్ని బలవంతంగా బయల్దేర దీసింది

ఇద్దరూ ఆటో లో వెళ్ళి టాక్సీ మాట్లాడుకుని కాశీకి బయలు దేరారు

ఆ టెలిగ్రామ్ అబద్ధం కావాలని దారి పొడుగునా కాశీవిశ్వేశ్వరునికి విశాలాక్షి అన్నపూర్ణ అమ్మవార్లకి మొక్కులు మొక్కుకుంటూనే ఉంది మాలతి

కానీ ఎవరూ ఆమె మొర ఆలకించలేదు

సత్రం ముందు టాక్సీ దిగి తమకి టెలిగ్రామ్ ఇచ్చిన సత్రం యజమానిని వెతుక్కుంటూ వెళ్ళారు

తాము ఫలానా అని చెప్పగానే వారిద్దరినీ వెంట బెట్టుకుని దుర్గమ్మ ఉన్న గదిలోకి తీసికెళ్ళాడు ఆయన

ఒరే నాయనా! వచ్చావుట్రా ఆ గంగమ్మ తల్లి మీ నాన్నని పొట్టన పెట్టేసుకుంది రోయ్ నన్ను దిక్కులేని దాన్ని చేసి ఆయన దారి ఆయన చూసుకున్నార్రోయ్ అంటూ ఎడుపు మొదలు పెట్టింది దుర్గమ్మ

శోకదేవతకి మారు పేరులా ఉన్న అత్తగారిని చూడగానే మాలతికి కూడా దుఃఖం ఆగలేదు

తల్లికి ధైర్యం చెప్పాల్సిన వేణు తల్లి ఒడిలో తలదూర్చి పసివాడిలా దుఃఖించాడు

అత్తయ్యా! ఊరుకోండి పోయిన వాళ్ళతో మనమూ పోలేముగా ధైర్యం తెచ్చుకోండి మీరిలాఉంటే జరగాల్సిన దేమిటో మాకు చెప్పే వాళ్ళెవరు? కాశీలో పవిత్రమైన గంగానదిలో ఐక్యం అయ్యారు మావయ్యగారు చాలా అదృష్ట వంతులు అత్తగార్ని ఓదార్చింది మాలతి

ఆయన అదృష్ట వంతులేనే తల్లీ నేనే పాపిష్టిదాన్ని ఆ చావు నాకైనా వచ్చింది కాదేమ్మా

మీరూ అదృష్టవంతులే అత్తయ్యా అలా అని ఒకరికి బదులు మరొకర్ని తీసి కెళ్ళడా భగవంతుడు ఎవరి టైము అయిపోతే ఈ లోకంలోకి వచ్చిన పని అయిపోతే తప్పని సరిగా తిరిగి వచ్చిన చోటుకి వెళ్ళవలసిందే ఓదార్పు మాటలతో సేద తీర్చింది

నిజం చెప్పావే తల్లీ మాలతి వైపు ప్రశంసగా చూసి సారూ! ఎడిసి ఏమి ప్రయోజనం? మిగిలిన పని చూడండి అని చెప్పేసి వెళ్ళి పోయాడు సత్రం యజమాని

అమ్మా! అసలది ఎలాజరిగింది? అడిగాడు వేణు

స్నానాలు చేద్దామని ఇద్దరం గంగలో దిగాంరా నాకు చలేస్తున్నట్లు అనిపిస్తే చేతులతో నీళ్ళు తీసి కొద్దికొద్దిగా ఒళ్ళు తడుపు కుంటూ ఒడ్డుకి దగ్గర్లోనే ఆగిపోయాను మీ నాన్న మరికాస్త ముందుకి వెడుతూంటే లోపలి దాకా వెళ్ళకండి అక్కడ చేసేసి రండి అన్నాను కూడాను

అలాగేలే అన్నారు నేను తొందరగా స్నానం ముగించి గట్టు మీదకి వచ్చేసి చీర పిండుకుంటుంటే ఏదో గోల వినిపించింది తీరా చూద్దును కదా మీ నాన్న కనిపించలేదు నలుగుర్ని పిలిచి చెప్పాను అందరూ వెతికారు శరీరం కూడా దొరక్కుండా పోయారు ఒకరిద్దరు తరువాత అన్నారు మేము వద్దంటున్నా వినకుండా ఆయన మరీ ముందుకు వెళ్ళారుఅని కావాలని చావుని కోరి తెచ్చుకున్నట్లు చేశారో చేపుతో! నా బతుకు బండలు చేశారా నాయనో అంటూ ఏడుపు మొదలు పెట్టింది అంతలోనే

వేణు బయటికి వెళ్ళి జరుగవలసిన తతంగానికి కావలసిన ఏర్పాట్లు చేయించి వచ్చాడు

ఆరాత్రి ముగ్గురూ కూడా నిద్రపోలేదు

మరునాటి నుంచి తండ్రి ఆత్మశాంతి కోసం కొడుకుగా తను చెయ్యాల్సిన విధులన్నీ యదావిధిగా నిర్వర్తించాడు వేణు

కుశ్యాంతు మరణాన్ ముక్తి! అని ఆర్యోక్తి

మరణించిన వారి అస్థికలు తీసుకొచ్చి కాశీలోని గంగలో కలుపుతారు చాలామంది తన తండ్రి సశరీరంగా గంగానదికి అర్పితం అయ్యాడు ఎంత అదృష్టవంతుడు అనుకున్నాడు

హైదరాబాదు ప్రయాణం అవుతు జరిగిన ఘోర వార్త తెలియజేస్తూ తల్లిని తీసుకుని హైదరాబాదు వెడుతున్నట్లుగా చెల్లెళ్ళు ముగ్గురికీ ఉత్తరాలు రాశాడు వేణు

భర్తకంటే తన తండ్రికంటే తనని అమితంగా అభిమానించే మావయ్య లేరనుకుంటే భరింపరానంత దుఃఖం ముంచుకొస్తోంది మాలతికి అత్తగారికి భర్తకి ధైర్యం చెప్పవలసిన బాధ్యత తన మీదుండడంతో బలవంతంగా ఆ దుఃఖాన్ని దిగమ్రింగుకుంటోంది

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

వారు కాశీనుంచి తిరిగి వచ్చాక దుర్గమ్మని చూశాక గానీ జరిగిన ఘోరం తెలియలేదు ప్రకాశరావుగారికి

ఆ చావు తనకెందుకు రాలేదా అని తలచుకుని ఏడ్చారు ఆ బాధ భరించలేక పోవడం వల్ల పూర్తిగా నెర్వస్ అయిపోయి కుప్పలా కూలిపోయారు

కొద్ది కొద్దిగా బలం పుంజుకుని స్వాధీనంలోకి వస్తున్న కాలు చెయ్యి మళ్ళీ యదాస్థితికి వచ్చేయడంతో పూర్తిగా మంచం పట్టేశారు

అత్తగారిని అంటిపెట్టుకునే ఉంటూ ధైర్యం చెప్తోంది మాలతి

అన్నగారు రాసిన ఉత్తరాలు అందగానే తమ భర్తలని వెంట పెట్టుకుని మరీ వచ్చేశారు అక్క చెల్లెళ్ళు ముగ్గురూ

సావిత్రి లోపలి కొస్తూనే తల్లిని కౌగలించుకుని ఆవిడగారు నాన్నని వేదించుకు తిని ఆస్తి రాయించు కున్నప్పుడే నేననుకున్నానే అమ్మా ఇటువంటి దేదో జరుగుతుందని దీర్ఘాలు తీస్తూ ఏడుపు మొదలు పెట్టింది

మన ముగ్గురం అంటే నాన్నకి పంచ ప్రాణాలు మనకి అన్యాయం జరిగిందని పాపం! ఎంత కుమిలి పోయారో! ఆ బాధతోనే జీవితం మీద విరక్తి పెంచుకున్నట్లున్నారు నాన్న అని సుగుణ వంత పాడింది

సుశీల మాత్రం ఏమీ మాట్లాడకుండా నోట్లో చెంగు దూర్చుకుని ఏడుపు మొదలు పెట్టింది

వీళ్ళసలు తండ్రి చనిపోయినందుకు బాధపడుతున్నారా లేక నాకేదో అన్యాయంగా ఆస్తి రాసేశారని బాధపడుతున్నారా అనిపించింది మాలతికి

నోరు తెరిచి కోపంగా ఏదో అనబోతున్న వేణుని వారించింది కళ్ళతో

లేచి విసురుగా బయటికి వెళ్ళి పోయాడు అక్కడే ఉంటే ఏదో ఒకటి అనాల్సి వస్తుందని

మాలతి వెనకాలే వెళ్ళి చూడండి వాళ్ళు ఉండేది నాలుగు రోజులు ఈ నాలుగు రోజులు వాళ్ళు ఎలా మాట్లాడినా ఎం చేసినా మీరు ఇరిటేట్ అయిపోవద్దు ఇప్పుడు మీరేమైనా అంటె నేను కావాలని అనిపించినట్లు పిలవుతారు విన్నవాళ్ళందరూ కూడా వాళ్ళన్న మాటల్లో నిజా నిజాలెంతో మీకు తెలుసు నాకు తెలుసు చచ్చి స్వర్గాన ఉన్న మావయ్యగారికి తెలుసు ఇప్పుడు మీరేమైనా అంటే వాళ్ళు నోరు మూసుకోరు సరికదా మరో నాలుగు అవాకులు చవాకులు వాగుతారు మావయ్యగారు పోయి పట్టుమని పది రోజులైనా కాకముందే ఇంట్లో ఇలాంటి గొడవలు జరగడం ఎంత అసహ్యంగా ఉంటుంది? విన్న వాళ్ళందరూ ఎంత విడ్డూరంగా చెప్పుకుంటారో తెలుసా? అందుచేత దయచేసి ఈ నాలుగు రోజులు ఎలాగో ఓర్పు పట్టండి అతన్ని బ్రతిమాలింది

నీకున్నంత ఓర్పు నాకు లేదు

నిజానికి నాకంటే మీకే ఓర్పు ఎక్కువ ఆ టాపిక్ వచ్చినప్పుడు అక్కడినుంచి లేచి వెళ్ళిపొండి అంతగా భరించలేక పోతే అంటూ అతని నోటికి తాళం వేసింది

సర్లే! నువ్వెళ్ళు ఆమెని పంపేశాడు

పది పదకొండు పన్నెండు రోజులు యదావిధి కర్మ చేశాడు తండ్రికి ఉత్తమ గతులు ప్రాప్తించాలని అన్ని రకాల దానాలు చేశాడు

తల్లి చెల్లెళ్ళు సంతోషించ లేదు సరికదా ఆస్తి కాజేసిన వాళ్ళు ఈ మాత్రం అయినా చెయ్యరా అన్నట్లు మాట్లాడారు

గుంటూరులో ఉన్న ఇల్లు మిల్లు ఎవరికి చెందేలా తండ్రి ఏర్పాటు చేశారోనని తర్జన భర్జనలు జరిగాయి

చివరికి గుంటూరు వెళ్ళి తండ్రి ఏమైనా రాసి ఉంచాడేమో చూడాలని నిశ్చయించుకున్నారు

తండ్రి మసిలిన ఆస్థలంలోకి వెళ్ళి ఆస్తి కోసం తగువులు పడడం తనకి ఇష్టం లేదని కొన్నాళ్ళు పోయేదాకా తను రాలేనని స్పష్టంగా చెప్పేశాడు వేణు

తమకి వచ్చే దేమైనా ఉంటే రాకుండా చెయ్యడానికి అదొకవంక అంది సావిత్రి నిష్ఠూరంగా కాకపోతే? తనకేగానీ మాకు లేదూ నాన్న మీద ప్రేమ? అలా అని వచ్చేదాన్ని వదులు కుంటారా ఎవరైనా

వారి మాటలు భరించడం కంటే తండ్రి గురించిన బాధే నయమని చెప్పి అతన్ని బలవంతంగా ఒప్పించి బయల్దేర దీసింది మాలతి

వేణు ఎంత చెప్పినా తను మాత్రం ప్రయాణం కాలేదు మాలతి

తాళం తీసుకుని ఇంట్లో అడుగు పెడుతూంటే చెప్పలేనంత దుఃఖం వచ్చింది వేణుకి

తండ్రి గదిలోకి వెళ్ళి ... రున ఏడ్చేశాడు




అతన్ని ఓదార్చే ప్రయత్నం ఎవరూ చెయ్యలేదు సరికదా బీరువాలు అన్నీ వెతుక్కోవడం మొదలు పెట్టారు అక్క చెల్లెళ్ళు

బయటి నుంచి ఏడుపులు తారాస్థాయిలో వినిపిస్తూంటే కళ్ళు తుడుచుకుని బయటికి వచ్చాడు వేణు

వేణుని చూడగానే ఇప్పుడు నీ కళ్ళు చల్లబడ్డాయా? సగం ఆస్తి రాయించు కున్నావు గప్‌చిప్‌గా నీ పెళ్ళాంపేర రెండు లక్షలు ఖరీదు చేసే ఇల్లుకొని పించుకున్నావు ఇప్పుడు ఈమిల్లు ఇల్లు కూడా నీ పిల్లలకే చెందేలా నాన్నని బెదిరించి ముందే రాయించుకుని నంగనాచిలా మాముందు బుడిబుడి దీర్ఘాలు తీస్తున్నావు ఇప్పుడు అంది సావిత్రి కోపంగా

ఆ కాగితాలు అందుకుని చూశాడు వేణు

ఇల్లు మిల్లు తదనంతరం భార్యకి చెందేటట్లు ఆమె అనంతరం వేణు పిల్లలకి చెందేటట్లు రాశారు మారుతీరావుగారు

ఆ కాగితాలు ముడుస్తూ సావిత్రీ! తెలియని వాటి గురించి అనవసరంగా నోరు పారేసుకోకు నాన్న చేత బలవంతంగా రాయించు కోవాల్సిన అవసరం నాకేం లేదు నా పిల్లలకి లోటేమీరాదు అన్నాడు కోపంగా

తమకి వచ్చేదేమీ లేదని తెలిసి పోయాక వెంటనే ఎవరిదారిన వాళ్ళు వెళ్ళి పోయారు ముగ్గురూ

(ఇంకా ఉంది)

# కనువిప్పు

శేఖరం ఇంటికి వస్తూనే నీరసంగా కుర్చీలో కూలబడి పోయాడు సుజాత భర్తనాస్థితిలో చూసి ఆశ్చర్య పోయింది శేఖరం ఆమె వునికిని పట్టించుకోలేదు కాఫీ గ్లాసు అందిస్తూ ఏమైందండీ? అనారోగ్యంగా వుందా? అని ప్రశ్నిస్తూ భర్త నుదుటి మీద చెయ్యి వేసింది జ్వరం వచ్చిన లక్షణాలు లేవు

బాగానే వుంది అతను సంక్షిప్తంగా ఇచ్చిన జవాబు ఆమెకు తృప్తిని కలిగించలేదు ఈ అయిదు సంవత్సరాలలో శేఖర్‌ను ఆస్థితిలో ఆమె చూసి వుండలేదు

ఆమె ఆలోచనలు పరి పరి విధాల పోయాయి

ఆఫీసులో ఏదో తగవు వచ్చి వుంటుంది శేఖరం ఎవరితో నైనా తగవు పెట్టుకున్నాడా? ఊహూ! అతని స్వభావం అలాంటిది కాదే! తోటి వుద్యోగులు కూడా అతనంటే అభిమానం చూపిస్తారే! మరి ?

తన వారి మీదకు మనసు మళ్ళిందా? ఈ అయిదు సంవత్సరాల్లో తన వారి వూసు ఎత్త లేదే? మరి ఇంతలో అకస్మాత్తుగా అలా ఎందుకు మార్పు వచ్చింది?

పైకి అభివ్యక్తం చేయక పోయినా తన వారిని అతను మరచి పోగలడా? తను మాత్రం తన వాళ్ళను మరచి పోయిందా? రెండు పక్కల వాళ్ళూ తమ తమ మొండిపట్టు దలలతో వుండడం వలన వారి గురించి పైకి అనుకోవడం లేదు మనసులో నుంచి ఆత్మీయతా అభిమానం తుడుచుకు పోతాయా? అయినా ఈనాడు అకస్మాత్తుగా శేఖరం వాళ్ళ గురించి పరితపించ డానికి హేతువేమిటి?

ఔను! నిన్న అతని చిన్న నాటి స్నేహితుడు వచ్చాడు బహుశా శేఖరం యింటి విషయాలు ముచ్చటించి వుంటాడు శేఖరం తల్లి దండ్రులు పడుతున్న ఆరాటం వారు వృద్ధాప్యంలో కుమారుని కోసం కుమిలి పోతున్న విషయం వారి కోపం తగ్గిన విషయం చెప్పి వుంటాడు

వారికి తమ పట్ల కోపం తగ్గి వుంటుందా? తమని ఆదరిస్తారా? తన వెర్రిగాని అలాంటి మాటైతే శేఖరం తనతో ఆ సంతోషకరమైన మాట చెప్పి వుండడా? మరి ?

కొందరి జీవితాలలో లాగ శేఖరం మనసు మార్చుకొని, తనను గాలికి వదిలేసి వెళ్ళి పోతాడా? మరి తనగతేం కాను?

పాల పొంగులాంటి యవ్వనంలో ప్రేమ పిచ్చిలో పడి ఆ నిషాతగ్గిన తరువాత కష్టాలను ఎదుర్కొనే ధైర్యం సన్నగిల్లి ఆస్తి పాస్తుల మీద అమ్మా నాన్నల మీద మనసు మళ్ళి దేముడి సాక్షిగా పెళ్ళాడిన భార్యను విడిచి వెళ్ళి పోయిన యువకుల కథల నెన్నిటిని చదువలేదు? శేఖరం కూడా అలాంటి ఆలోచనలో వున్నాడా? ఈ పెళ్ళి ఈ సంసారం మూడునాళ్ళ ముచ్చటేనా?

మన పెద్దలు కొన్ని ఆచారా వ్యవహారాలను కట్టు బాట్లను నిర్దిష్టం చేసారు వాటిలో ఏదో మహత్తర మైన శక్తి వుంది శతాబ్దాలుగా ఈ ఆచార వ్యవహారాలను మన వాళ్ళు తు చ తప్పక నిర్వహిస్తున్నారు విదేశీయుల పాలనలో కూడా మన కట్టు బాట్లు ఇసుమంతైనా సడలలేదు అందుకే దేశదేశాల సంస్కృతులలో మన సంస్కృతికి ఒక ప్రత్యేక స్థానం వుంది అందువలన వీటిని అర్థ విహీన మైనవని కొట్టి పారేయలేము ఇక పెళ్ళిళ్ళనేవి స్వర్గంలో నిర్ణయించ బడతాయి లత ఎలా ఒకే చెట్టుని ఆశ్రయించుతుందో అలా మన భారతనారి ఒకే పురుషుణ్ణి ఆశ్రయించుతుంది విధిరాతను తప్పించడం మానవ మాత్రులకు సాధ్యం కానిది సుజా! భగవంతుడు నీకు సంసారిక సుఖాన్ని ప్రసాదించలేదు నీ భర్త అకాల మరణం అందుకు తార్కాణం విధవా వివాహాలు మన వంశంలో లేవు అలాంటిది నీవు పునర్వివాహం చేసుకోవడం హర్షించ తగినది కాదు మరో పర పురుషుణ్ణి నమ్ముకుంటే నీ జీవితం నాశనం ఔతుంది మనం పాశ్చాత్య దేశాల్లో జన్మించలేదు భారత భూమి మీద జన్మించాం అందువలన ఈ దేశ వ్యవహారాలనే మనం పాటించాలి భర్త మరణించిన స్త్రీ పునర్వివాహానికి అనర్హురాలని మన శాస్త్రాలు చెప్తున్నాయి నీవు మారు మనువు చేసుకోవడం మాకు సుతరాం ఇష్టం లేదు మమ్మల్ని ధిక్కరించి చేసుకుంటే నీకు ఈ ఇంటిలో స్థానం వుండదు ముందేం జరుగుతుందో అది మన వూహకందనిది అంత్య నిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరం మేలు మేం నీ మంచి కోరే వాళ్ళం సుజా! నీ పిచ్చి వూహలకు స్వస్తి చెప్పు ఏటికి ఎదురీదాలనుకోవడం మంచిది కాదు అంటూ ఆనాడు అన్నయ్య చేసిన హిత బోధలను తాను కొట్టి పార వేసింది

ఎంత దూరదృష్టితో అన్నయ్య తనను హెచ్చరించాడు

ఆరోజున తను శేఖరం మాయ మాటల్లో పడింది

సుజా! వీళ్ళు స్వార్థంతో అనే మాటలను నమ్మకు పురుషుల కొక న్యాయమూ- స్త్రీల కొక న్యాయమూనా? భార్య చనిపోతే ఆమె చితికి నిప్పు అంటించి ఆ వెంటనే మరో పిల్ల మెడలో మంగళ సూత్రం కట్టే అధికారం పురుషులకుంది కాని భర్త పోయిన స్త్రీ పునర్వివాహానికి అనర్హురాలా? భర్త చనిపోతే ఆ స్త్రీ శేష జీవితమంతా అన్నదమ్ములకు వారి పెళ్ళాం పిల్లలకు జీతం బత్తెం లేకుండా చాకిరి చేస్తూ వారు తిడుతూ పడేసిన ఎంగిలి మెతుకులు తింటూ ఆ స్త్రీ కుళ్ళుతూ బ్రతకాలా? ఇది న్యాయమా? మనది పాశ్చాత్య వ్యామోహమని ఎందుకనుకోవాలి? విదేశాల నుంచి తాంత్రిక పరిజ్ఞానాన్ని తెచ్చుకుంటున్నామే, మరి ఆదేశంలో వున్న మంచి సంస్కృతులను ఎందుకు నిరాకరించాలి? స్త్రీగా పుట్టడం ఒక శాపమా? సుజా! నా మీద నీకు నమ్మకం లేకపోతే అది వేరే విషయం ఎలాంటి పరిస్థితులలోనూ నీ చేయి విడువను ఇక నీయిష్టం అంటున్న శేఖరాన్ని అవిశ్వసించడానికి ఆనాడు మనసు ఒప్పలేదు తన వయసనగా ఎంత? నిండా ఇరవై లేవు పెళ్ళి జరిగి ఏడాది కాలేదు జీవితంలో తగిలిన అఘాతానికి తట్టుకోలేని సమయం ప్రాచీన సాంప్రదాయాలను వల్లిస్తూ మారు మనువునిషిద్ధం అన్న మాటలను ఎలా అంగీకరించ గలదు?

పెద్ద గాలీ వానే వచ్చింది

పెళ్ళి జరిగిన రెండు సంవత్సరాల వరకు అతని తల్లి దండ్రు లతని మీద చాలా ఒత్తిడి తెచ్చారు 'నా ఆస్తిలో చిల్లిగవ్వ నీకు రాదు నీకూ మాకూ సంబంధం లేదు నాకసలు మగ పిల్లలే పుట్టలేదు అనుకుంటాను పుట్టినా మా శేఖరం చచ్చిపోయాడనుకుంటాను' అని శేఖరం తండ్రి బెదిరింపులు 'నాయనా! విధవరాలితో కాపురం ఏమిటి? లోకం హర్షించదు జరిగి పోయింది పీడ కల అనుకో మీ నాన్న గారిని నేను ఒప్పిస్తాను ఆ పిల్లను వదిలేసి ఇంటికి వచ్చేయి నీకు రంభలాంటి పిల్ల నిచ్చి పెళ్ళి చేస్తాం బాగా డబ్బున్న వాళ్ళు మన ఇంటి చుట్టూ తిరుగుతున్నారు నీకు పిల్లనిస్తామంటూ సంపన్నుల కుటుంబంలో పుట్టిన నీకు ఈ బీద బ్రతుకెందుకు? అని అతని తల్లి బ్రతిమలాటలు 'శేఖరం' తెలియక చిన్న తనంతో ఏదో చేసావు వాటి పరిణామాలను ఎదుర్కొనడం కష్టం ఈ పనిని ఎవరూ హర్షించరు ముసిలి వాళ్ళైన నీ తల్లిదండ్రులను బాధపెట్టడం కొడుకు వైన నీకు తగదు పొరపాటును దిద్దుకోవడం చాలా వుత్తమం' అని స్నేహితులు చేసే హిత వచనాలు

శేఖరం ఎవరి మాటలను లక్ష్య పెట్టలేదు లక్షల ఆస్తులను త్యజించాడు కష్టాలని కావాలని కొనుక్కున్నాడు మరి ఈనాడు

ఏమండీ! ఏం జరిగింది? నాకు చెప్పరూ? అంది సుజాతకు ఏడుపు వచ్చింది

"సుజాతా! ఎందుకలా ఏడుస్తావు? అప్పుడేం జరిగిందని?

ఏం జరగబోతున్నదో అనే నా బాధ

శేఖరం ఆమె వంక చూసాడు విషయం తెలియక పోతే ఆమె బాధ పడుతుంది ఒక నిర్ణయానికి వచ్చాడు

సుజాతా! త్వరగా తయారవు అలా షికారు వెళ్దాం నాకూ మనసులో సరిగ్గా లేదు అన్నాడు లేని నవ్వు తెచ్చుకుంటూ

సుజాత అన్యమనస్కంగానే బయలు దేరింది

*　　*　　*　　*　　*

ఈ పేనలు నాకు ఆమోదయోగ్యం కాదు

డైరెక్టరు గారి మాటలు విని కమిటీ సభ్యులు ముగ్గురూ ఆశ్చర్య పోయారు తమ నిర్ణయాన్ని వారు శంకిస్తున్నారా?

సార్! మేం ఎలాంటి ప్రలోభాలకు లొంగలేదు నిజాయితీగా మేం తీసుకున్న నిర్ణయం అన్ని పరీక్షలలోనూ ప్రప్రథమురాలిగా ఆమె ఎన్నికైంది మమ్మల్ని అనుమానించడం భావ్యం కాదు అన్నాడు కరుణాకరం

కరుణాకరంగారూ! మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు మీ ఎన్నికలో తప్పు వుందని కాని మీరు పక్షపాతంతో వ్యవహరించారని కాని నేను భావించడం లేదు

కరుణాకరం తృప్తి పడ్డాడు అధికారి దృష్టిలో తమ పట్ల ఎలాంటి అపార్థం లేదు

మరి మీ దృష్టిలో మరో అభ్యర్థి వున్నాడా? లేక పై నుంచి ఏవైనా రికమెండేషన్లు వచ్చాయా? అలాగైతే చెప్పండి ఈ పేనలు దేముంది? మార్చుతాం

కరుణాకరం! నేను ఎవరిమీదా ప్రత్యేక అభిప్రాయంతో లేను ఎలాంటి రికమెండేషన్లకు విలువ ఇవ్వను

మరి ? ప్రశ్నించాడు వెంకటనారాయణ

డైరక్టరు రెండు నిముషాలు ఏమీ చెప్పలేదు ఆ ముగ్గురూ సంగతి తెలియక అయోమయ స్థితిలో కుర్చీలలో కదలకుండా కూర్చున్నారు

నాది సంకుచిత స్వభావ మని మీరు భావించినా నేను బాధపడను మహిళలు అనంత శక్తి సంపన్నులని మన ఋషులు వాక్రుచ్చేరు అహల్యా ద్రౌపదీ, సీతా తారా, మండోదరీ తథా పంచకన్యా స్మరే నిత్యం మహా పాతక నాశనం అని పురాణాలలో వ్రాయబడివుంది అయితే ఆ ప్రవచనాలు ఈనాడు కాలదోషం పట్టినవి స్త్రీల




విషయంలో కాలదోషం పట్టని ప్రవచనాలు కొన్ని వున్నాయి ముఖ్యంగా, స్త్రీ బుద్ధి ప్రళయాంతకః, విత్తమూ బుద్ధీ కూడా అధమాధమమూ

ప్రళయాంతకమూనూ అవి స్త్రీ వైతే! ఆడదంటే అబలకాదని నేటి సోదరీ మణులు చెప్తున్నారు ఆడది అబల అన్నది ఏ సత్యకాలంలోనో ఆడది సబల అన్నది అనుభవ పునరుక్తి కొన్ని సందర్భాలలో ఆడది ప్రవర్తించి నంత సంకుచితంగా నీచంగా, కఠినంగా కఠోరంగా నిష్కర్షగా నిర్దాక్షిణ్యంగా అవమానంగా అమానుషంగా అసందర్భంగా అవివేకంగా పురుషుడు ప్రవర్తించలేడు కొన్ని చోట్ల ఆడది విలయ తాండవం చేస్తున్నాది తన పరిధులను దాటి ప్రవర్తిస్తున్నాది మహాసాధ్విగా దేవతగా మన మనసులలో నిలిచిన సీతాదేవి లక్ష్మణ రేఖను దాటి పడరాని ఇడుములు బాసింది ఈనాటి మహిళలు సబలల మంటూ లక్ష్మణ రేఖను దాటుతున్నారు మన పూర్వులు నిర్దేశించిన కట్టు బాట్లను తెంచుకొని విశృంఖలంగా ప్రవర్తించి అటు కన్న వారిని ఇటు అత్తింటి వారిని కష్ట పెడుతున్నారు వారిని దుఃఖ భాజనులు చేస్తున్నారు కొందరి కొంపలను కూలుస్తున్నారు ఆతరువాత కులటలుగా పతితలుగా జీవిస్తూ నిండు సంసారాలలో చిచ్చు పెడుతున్నారు మీరు ఈ పదవికి ఒక స్త్రీని ఎంపిక చేసారు అది నా సిద్ధాంతాలకు వ్యతిరేకం అన్నాడు డైరక్టరు శాస్త్రి

శేఖరం నిశ్చేష్టుడయ్యాడు ఈ ఇరవైయ్యో శతాబ్దపు ఉత్తరార్థంలో ఇలాంటి

## కనువిప్పు

మూర్ఖులుంటారా? ఉంటారు! తను తన జీవితంలో ఎందరినో చూసాడు ఎంతో దూరం ఎందుకు? తన నిజ జీవితంలోనే తారస పడ్డారు ఆడదాన్ని అణగి తొక్కాలనుకున్నారు ఆడది సుఖసంతోషాలతో జీవించడం చూసి సహించలేక కళ్ళలో నిప్పులు పోసుకున్నారు అభ్యుదయ భావాలను వారు సహించలేరు కన్నకూతురినైనా, స్వంత చెల్లినైనా కోడలినైనా వారు తమ శత్రువుగా భావిస్తారు తమ మాటను కాదంటే

సార్! అన్నీ తెలిసిన మీరు ఇలా అనడం భావ్యం కాదు ఆడవాళ్ళ మీద ఇదొక పెద్ద అభాండం మూఢనమ్మకాలతో అంధ విశ్వాసాలతో ఆడజాతిని అవమానించడం ఆమోదయోగ్యం కాదు రాధ చాలా తెలివైన పిల్ల ఆమె కడు పేదరాలు ఎన్నో కష్టాలను ఎదుర్కొని చదివింది నలుగురితో పోటీ చేసి ఆ పోటీలో నెగ్గింది అలాంటి రాధ ఈ వుద్యోగానికి అనర్హురాలు అనడం సబబు కాదు అన్నాడు శేఖరం

శేఖరం! నేను చెప్పాలనుకున్నది సూటిగా చెప్తాను స్త్రీల పట్ల అందులో పెద్ద చదువులు చదివి వుద్యోగాలకు ఎగబడే స్త్రీల పట్ల నాకు సదభిప్రాయం లేదు ఆడది గృహలక్ష్మి తన ఇల్లూ తన పిల్లల భవిష్యత్తును సరిదిద్దుకోవడం ఆమె జీవిత లక్ష్యం అంతే కాని ఉద్యోగాలు చేయాలని

ఊళ్ళేలాలని ముందుకు రావడం నేను సహించలేను నేను స్త్రీ ద్వేషినని మీరు భావించినా నేను బాధ పడను కుల స్త్రీలను నేను గౌరవిస్తాను ఆడవారిని అందల మెక్కించి వారి ద్వారా కొన్ని కుటుంబాలు సర్వనాశనమైతే నేను భరించలేను కీడెంచి మేలెంచమన్నారు మీరు నాతో ఏకీభవించాలని నేను ఒత్తిడి చెయ్యడం లేదు ఇదే మీ అంతిమ నిర్ణయం అన్నా నేను బాధ పడను నా అధికారాలను వినియోగించి ఇదే పేనలులోని రెండవ వ్యక్తిని నేను నియమించగలను ఆ తరువాత మీరు ఏం అనుకున్నా ప్రయోజనం వుండదు

కరుణాకరం వెంకటనారాయణా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు నిజమే! అధికారిని ఎదిరించి సాధించగలిగేది ఏమీ లేదు అతను చేయాలనుకున్నది చేయగల సమర్థుడు రూల్సు అతని పక్షంలో వున్నాయి పోతే అతని ఆగ్రహానికి గురి కావడమే మిగులుతుంది తద్వారా కొన్ని సదుపాయాలను కోల్పోయే అవకాశం వుంది

దానికేముంది సార్! ఈ పదవిలోనికి ఎవర్ని తీసుకున్నా మానినా మాకు ఒరిగేది ఏమీ లేదు మీకు రాధను నియమించడం ఇష్టం లేనప్పుడు మేం మాత్రం ఎందుకు ఒత్తిడి తెస్తాం? మీ యిష్ట ప్రకారమే పేనలులో మార్పులు చేస్తాం ఏమంటారు వెంకటనారాయణగారూ? అన్నాడు కరుణాకరం

అనేది మాత్రం ఏముంది? పైవాళ్ళ మాటను కొట్ట

పారేయడం మాత్రం మంచిదా? అలాగే చేద్దాం అన్నాడు వెంకటనారాయణ

కాదు అందుకు నేను సమ్మతించను నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి అన్నది ముమ్మాటికీ కాలదోషం పట్టిన ప్రవచనం ఋషులు, మహాదాతలు త్యాగులు ధర్మ పరిపాలకులు జనించిన దేశం మన భారతదేశం అనాది నుంచి స్త్రీలు మనదేశ సౌభాగ్యం కోసం పురుషులతో పాటు సమానంగా పరిశ్రమించుతున్నారు స్వాతంత్ర్య సముపార్జనలోనూ దానిని నిలుపుకోవడం కోసం మహిళలు ముందంజే వేసారు కాని ఏనాడూ వెనుకడుగు వెయ్యలేదు మీకు తెలియదని కాదు విజయలక్ష్మీ పండిట్, సరోజినీనాయుడు కమలాదేవి చటోపాధ్యాయ కస్తూర్బాగాంధీ వేదాంతం కమలాదేవి జయంతి సూరమ్మ దుర్గాబాయి దేశ్‌ముక్ ఆ నాడు భారత జాతి దాస్య విమోచనానికి పాటు పడితే ఈ నాడు సుచేతా కృపలానీ, ఇందిరాగాంధీ వంటి మహిళామణులు స్వాతంత్ర్య పరిరక్షణ కోసం పాటు పడలేదా? అలాంటి మహామహిములైన వనితలను సంకుచితంగా తలంచడం శోచనీయం కాదా? కొందరు స్త్రీలు నిస్సంశయంగా విశృంఖలంగా ప్రవర్తిస్తూ వుండవచ్చును అలాంటి వారు పురుషులలో మాత్రం లేరా? ఒక స్త్రీ తప్పు దారిని ప్రవర్తిస్తే ఆ జాతి మొత్తాన్నే తూలనాడడం వారిని నిర్బంధంలో [illegible]ంచడం వివేక పూర్వమైన నిర్ణయం ఎలా కాగలదు? ఒక అబల నోటి ముందు కూడును నేను పడగొట్టలేను నాకు తెలుసును నేను ఆమె పక్షంగా మాట్లాడినా ఫలితం శూన్యం అంతిమ విజయం మీదే మీరు అధికార సంపన్నులు అలాగని నేను మీ భజన మండలిలో చేరి మీరు చేసే ప్రతీ పనికి ఆమోద ముద్ర వేయలేను నా ధర్మాన్ని నేను త్యజించలేను నేను విశ్వసించే సిద్ధాంతాలకు తిలాంజలి ఇవ్వలేను అన్నాడు శేఖరం

శేఖరం! ఆవేశం పనికి రాదు నీ వన్నది యథార్థం కాదని మేం కొట్టి పారేయడం లేదు ఆఫీసరు గారు ఇలాంటి నిర్ణయం తీసుకున్నారంటే దానికి ప్రబలమైన కారణాలు వుంటాయి వారన్న దానిలో దోషం పట్టే అవకాశాలు లేవు మనం చూస్తున్నాం నేడు చాలా మంది స్త్రీలు వుద్యోగాలకు ఎగబడుతున్నారు అది వాళ్ళకు ఒక సరదాగా మాత్రమే వుంది అలాగ వుద్యోగాలు చేస్తున్న వారిలో కొందరు హద్దులు దాటుతున్నారు వాళ్ళు హౌళ్ళ హద్దులు దాటకున్నా వారి అలంకరణలతో, వారి హావభావ ప్రకటనలతో పురుషులను సన్మార్గం నుంచి తప్పిస్తున్నారు పదభ్రష్టులను చేస్తున్నారు ఏ పుట్టలో ఏ పాముందో ముందుగా ఎవరికి తెలుసు రాధకు వుద్యోగం ఇవ్వనంత మాత్రాన మనకు వచ్చిన నష్టం ఏమిటి? ఉద్యోగం పురుష లక్షణం అన్నారు కాని స్త్రీ లక్షణం అనలేదు ఇంత చిన్న విషయానికి మనలో మనస్పర్థలూ విభేదాలూ ఎందుకు? అన్నాడు వెంకటనారాయణ

ఇది మీ దృష్టిలో చాలా స్వల్ప విషయంగా




వుండవచ్చును ఒక ఆడదానికి అన్యాయం జరుగుతే నేను సహించలేను అందులోనూ రాధ పరిస్థితి నాకు తెలుసు ఒక కుటుంబం ఆమె మీద ఆధారపడి వుంది మీరు ఎలాగూ ఒక నిర్ణయానికి వచ్చారు దానిని మార్చగలిగిన శక్తి నాలో లేదు అందువలన నేను వేరే నిర్ణయం తీసుకోవలసి వస్తున్నాది నా పదవికి నేను రాజీనామా ఇస్తున్నాను అన్నాడు శేఖరం శేఖరం అక్కడ పేడ్‌లో వున్న కాగితం తీసుకొని రాజీనామా పత్రం రాసి డైరక్టరుకి అందించాడు చిరునవ్వుతో

ఆ చిరునవ్వు వెనక ఎంత బాధ మిళితమై వున్నదో శాస్త్రికి అనూహ్యం కాదు

ఒక అబల విషయంలో మీ పట్టుదల సమంజసం కాదు నేను ఎలాంటి పరిస్థితుల్లో ఈ నిర్ణయం తీసుకున్నానో బహుశా మీకు తెలియదు ఆమెకోసం మీరు మీ వుద్యోగాన్ని వదలు కోవడం మూర్ఖత్వమే ఔతుంది అన్నాడు శాస్త్రి

'సరే! ఆమెను మీరు అబల అంటున్నారు అయినా ఆమె ధైర్యంగా నలుగురి మధ్యకు వచ్చి ఒక చిన్న వుద్యోగం చేసుకుంటూ గౌరవంగా తన కుటుంబాన్ని పోషించుకుంటూ తమ్ముడిని చెల్లెళ్ళను వృద్ధిలోనికి తేవాలని ఆరాట పడుతూ వుంటే ఆమెకు చేయూత నివ్వగల తాహతు వుంది కూడా మనసులో ఏదో వుంచుకుని ఆమెకు అన్యాయం చేయ పూనుకున్నారు, కాలంతో పాటు మార్పు ప్రకృతి సిద్ధం అర్ధ శతాబ్దం క్రిందటి స్త్రీ జీవితానికి ఈ నాటి స్త్రీ జీవితానికి చెప్పలేనంత తేడా వుంది ఈనాడు ప్రజల జీవనంలో బ్రహ్మాండమైన మార్పు వచ్చింది ఈ మహా పరిణామంలో జీవన స్థాయి పెరిగి పోయింది ఒకే ఒక్కరి ఆర్జన మీద జీవితాలు గడవడం అసాధ్యమైంది అందుకే కొన్ని మధ్యతరగతి కుటుంబాలలో స్త్రీ పురుషులు కలసి కష్టించి పని చేస్తేనే కాని వారి కడుపులు నిండే దారి లేదు అందులో మగదిక్కు లేని రాధవంటి సంసారాల మాటేమిటి! చూడండి ఎవరి సిద్ధాంతాలు వారివి మాటలతో ఒకరి మనసు మార్చి వేయగలం అనుకోవడం శుద్ధ పొరపాటు మీరు ఈ నిర్ణయం ఎందుకు తీసుకున్నారని అడగను అయితే నా నిర్ణయం కూడా తిరుగులేనిది వస్తాను అన్నాడు శేఖరం

*   *   *   *   *

ఎంత పని చేశారు! ఇంత చిన్న విషయానికి మీరు వుద్యోగానికి రాజీనామా చేసారా? అంది సుజాత

సుజా! ఏమంటున్నావు? చివరకు నీవు కూడా నా నిర్ణయాన్ని హర్షించ లేక పోతున్నావా? ఇది నీకు చిన్న విషయంగా కనుపిస్తున్నాదా?' శేఖరం హృదయం దావానలంలా మండిపోతున్నా చివరకు తన భార్య కూడా తనను అర్థం చేసుకోనందుకు బాధ పడ్డాడు

కాదండి! మిమ్మల్ని అర్థం చేసుకోలేక కాదు అయినా ఇది తొందరపాటు నిర్ణయం కాదా? ఒక పెర్మనెంటు వుద్యోగాన్ని ఒక సెంటి మెంటుతో వదలుకుంటారా? రేపు మనగతి ఏమౌతుందని ఆలోచించేరా? మన బాబుని కాన్వెంటులో వేసే వేళ వచ్చింది వాడి చదువుకు సంరక్షణకు బోలెడంత ఖర్చు ఔతుంది రేపటి నుంచి మనం ఏం తిని బ్రతుకుతాం అనుకున్నారు? ఇలాంటి ఉద్యోగం దొరికే అవకాశాలున్నాయా? ఏ నిర్ణయం తీసుకునే ముందైనా తన తన వారి భవిష్యత్తు విషయం ఆలోచించాలని నేనడం అసందర్భంగా వుందా?

సుజాత మాటలు విని శేఖరం ఆశ్చర్యచకితు డయ్యాడు ఏదైనా ఒక భావానికి పూర్తిగా లొంగి పోవడం లౌకిక దృష్ట్యా అవివేకం కావచ్చు పామరులలో మూఢత్వాన్ని పోగొట్ట వచ్చుగాని చదువుకున్న వారిలోని మూఢత్వం పోగొట్టడం ఎలా? సుజాత, స్త్రీ అయివుండి కూడా తన గురించే ఆలోచిస్తున్నాది సాటి ఆడదాని పట్ల కనీస సానుభూతి లేదా? తన హృదయ వేదనను అర్థం చేసుకోలేదా? ఇదా తను సుజాత నుంచి ఆశించింది

లేదు సుజా! నీవు అన్నదానిలో అసందర్భం ఎక్కడ? నీకు నీ బ్రతుకే ముఖ్యం ఇతరులు అష్టకష్టాలు పడినా నీకు చీమ కుట్టినట్టు వుండదు నేనే తెలివి తక్కువ వాడిని ముందు చూపులేకుండా ప్రవర్తిస్తున్నాను ఇప్పుడు నేను నా తప్పును అర్థం చేసుకుంటున్నాను

శేఖరం మాటలు విని సుజాత సంతోషించింది

నిక్షేపం లాంటి వుద్యోగం ఎవరో ఒక అనామకురాలి కోసం వదులుకోవడం అవివేకం

అయితే రాజీనామాను వుపసంహరించుకుంటున్నారా?

శేఖరం ఆమె వంక రెండు నిముషాల పాటు అదోలా చూసాడు ఆ రెండు నిముషాలు ఆమెకు అతి భయంకరంగా అనుపించాయి ఏమిటి శేఖరం ఎగతాళికి అలా అన్నాడా? అతని మనసులో ఏముంది?

సుజా! నీవు నన్ను అర్థం చేసుకుంటావనుకున్నాను అయితే నీవు అందరి లాంటి దానివేనని నిరూపించుకున్నావు ఈ వుద్యోగం పోయినా మరొకటి దొరక గలదు అన్న నమ్మకం నాకుండేది. ఇప్పుడు నేను తప్పు చేసానేమో నని నేను భావిస్తున్నాను నీవూ సంకుచితంగానే ఆలోచించగలవని నేను వూహించలేదు ఏరు దాటి తెప్ప తగలెయ్యడం అంటే ఇలానే వుంటుంది నాకు కనువిప్పు కలిగించావు నాకోసం మా వాళ్ళు కలవరిస్తున్నారు అయితే ఇన్నాళ్ళూ ఏవో సిద్ధాంతాలూ చట్ట బందలూ అంటూ ఎవరినీ లక్ష్య పెట్టలేదు మన బాబుని నీవు వుంచుకున్నా సరే లేదా నాకు ఇచ్చినా సరే లక్షలకు వారసుడ్ని యిలా బీద బ్రతుకు బ్రతికే అవసరం నా కెందుకు?' అంటూ సుజాత కళ్ళలోనికి సూటిగా చూసాడు

సుజాత గుండెల మీద పిడుగులు పడ్డాయి శేఖరం అంటున్న దేమిటి? తనను విడిచి వెళ్ళిపోతాడా?

ఏమండీ! ఏమంటున్నారు? మిమ్మల్ని నమ్ముకొని మా వాళ్ళను కాదని మీ వెంట వచ్చానే. మరి నాదారి ఏం కాను?

ఇలాంటి చిన్న విషయాలు నేను ఆలోచించ దలచుకోలేదు నా వుద్యోగం పోనే పోయింది కనీసం నీవైనా నన్ను అర్థం చేసుకో గల వనుకున్న నా ఆశ నిరాశ అయింది నా వాళ్ళు నన్ను ఆదరిస్తారన్న నమ్మకం వుంది ఇంక నీ బ్రతుకు సంగతి నాకు అనవసరం అన్నాడు

సుజాతకు దుఃఖం పొరలుకు వచ్చింది



# కనువిప్పు

మీరింత కఠినంగా అంటారని అనుకోలేదు పొరపాటే! మీరు చేసిన పని తప్పుకాదు మీ సంగతి తెలిసి కూడా మిమ్మల్ని అవమానించాను నేను సంకుచితం గానే ఆలోచించాను నేనే సాటి స్త్రీ, పరిస్థితి గురించి యోచించకుండా నా స్వార్థం చూసుకున్నాను నన్ను మన్నించండి మీకు నామీద కోపం లేదుకదూ? ఇదంతా నటనేకదూ? చెప్పండి' సుజాత శేఖరం చేతులు పట్టుకుంది

సుజా! నటనా జీవితం వేరు వేరుకావు నటనలోనే జీవిస్తాడు జీవిస్తూనే నటిస్తాడు మనిషి కొన్ని సిద్ధాంతాలను నమ్ముతాడు వాటిని పాటించడం అతని కర్తవ్యం గోడ మీద పిల్లిలా, ఏ ఎండకాగొడుగు పడుతూ జీవిస్తే అందులో జీవన మధురిమ ఏదీ? సుఖ సంతోషాలలోనే కాదు కష్టాలలోనూ తను నమ్మిన సిద్ధాంతాలను పాటించాలి తనకొక న్యాయమూ - పై వాడి కొక న్యాయమూ పనికిరాదు రాధ విషయంలో నేను తీసుకున్న నిర్ణయం క్షణికావేశంతో తీసుకున్నది కాదు. నీవు హర్షించక పోతే బాధ పడ్డాను తన దాకా వస్తేనే కాని బాధా బాధ్యతా తెలియవు

నిజమేనండి! నాది తొందరపాటే నన్ను క్షమించండి అంది సుజాత

భార్యా భర్తల మధ్య క్షమాపణలకు స్థానం లేదు నీవు చివరికైనా నేను తప్పు పని చేయలేదని గ్రహించావు నారు పోసిన వాడు నీరు పోస్తాడు నవ్వుతూ శేఖరం లేచాడు తేలికైన గుండెతో సుజాత అతన్ని అనుసరించింది

* * * * *

కాలింగ్ బెల్ మ్రోత విని తలుపు తీసింది సుజాత

ఎదురుగా కనుపించిన దృశ్యాన్ని చూసి ఆమె ఆశ్చర్య పోయింది ఇది కలా- నిజమా?

జీవితంలో నీముఖం చూడను నీవేనాడైతే మన కట్టుబాట్లను ప్రతిఘటించి మారు మనువు చేసుకున్నావో ఆనాడే నీవు లేవనుకున్నాము' అని నిష్ఠూరంగా బాంధవ్యాన్ని తెంచుకున్న అన్న, గత అయిదు సంవత్సరాలుగా తన వూసు తలుచుకోని అన్న తన ఇంటికి వచ్చాడా? తన వునికిని తెలుసుకొని వచ్చాడా? ఒంటరిగా కాక భార్యా పిల్లలతో వచ్చాడా?

అన్నయ్యా! ఎన్నాళ్ళకు? అంది ఆనందాశ్చర్యాలతో

రామశాస్త్రి కూడా ఈ హఠాత్పరిణామానికి ఆశ్చర్య పోయాడు తనెవరింటికి వచ్చాడు? ఎంత పొరపాటు జరిగింది!?

ఇది శేఖరం ఇల్లు కాదా?

ఇది శేఖరం గారి యిల్లే నేను వారి ఇల్లాలిని అంది కన్నీళ్ళు వత్తుకుంటూ

"ఇలా నీ గుమ్మం తొక్క వలసి వస్తుందని నేను వూహించలేదు అతనితో పనివుంది రేపు ఒకమారు శేఖరాన్ని ఆఫీసుకి రమ్మనమని చెప్పు' అన్నాడు

"అన్నయ్యా! మా ఇంటిలోకి రాలేవా? అయిదేళ్ళైనా నీలోని కాఠిన్యం కరగ లేదా? వదినా పిల్లలతో వచ్చిన వాడివి ఇలా గుమ్మంలోంచే వెళ్ళిపోతావా? ఆయనకీ సంగతి తెలుస్తే మిమ్మల్ని ఆదరించలేదని నన్ను ఆడిపోసుకోరా? పోనీ నీ చెల్లెలు ఇల్లు కాదనుకో, నీ క్రింది వుద్యోగి ఇల్లే ననుకో నే నిచ్చే చల్లని నీళ్ళు త్రాగి వెళ్ళండి అంది అర్థింపుగా

రామశాస్త్రి భార్యకు పరిస్థితులు అర్థమయ్యాయి ఈ ముక్కు పచ్చలారని పిల్ల మీద తన భర్త కెంత కోపం ఆమె చేసిన తప్పేదం ఏం వుంది? శేఖరం వంటి ఉన్నతు డిని చేపట్టడం ఆమె తప్పా?

ఏమండీ! మరీ ఇంత కరుకు దనం పనికి రాదు పాపం మీ చెల్లెలు చేసిన తప్పేమిటి? మీరు లోనికి రాకున్నా నేను యింత దూరం వచ్చి తిరిగి వెళ్ళలేను అంది

రామశాస్త్రి రెండు క్షణాల పాటు కింకర్తవ్య విమూఢు డయ్యాడు శేఖరాన్ని వదలుకోవడం అతనికి యిష్టం లేదు పాలపొంగులాంటి వయసులో అతడు తొందర పడి తీసుకున్న నిర్ణయం అతన్ని సమాధాన పరచాలనుకున్నాడు అవసరమైతే తనే తన నిర్ణయాన్ని మార్చుకోవాలనుకున్నాడు సుజాత తెలిసీ తెలియని జ్ఞానంతో మళ్ళీ పెళ్ళి అనే గోతిలో దూకు తున్నదని అనుకున్నాడు ఈ వేడి కొంత కాలానికి తగ్గి భార్యా భర్తల మధ్య కలహాలు అంకురించి వారు విడిపోతారు అప్పుడు తన చెల్లెల బ్రతుకు పులివిస్తరాకు అవుతుందనే అనుకున్నాడు అయితే తను చూస్తున్నదేమిటి? శేఖరం నిజంగానే తను నమ్మిన సిద్ధాంతాలను పాటిస్తాడు తన చెల్లి లీనాడు సుఖసంతోషాలతో వుంది తన ఆంక్షలను పాటించి వుంటే ఆమె బ్రతుకు అడవి కాచిన వెన్నెలలా నిరర్థకమై వుండేది

రామశాస్త్రి చిరునవ్వుతో లోనికి నడిచాడు

సుజాత వాళ్ళకు చల్లని పానీయాలు ఇచ్చింది

చెల్లీ! నిన్నిలా కలుస్తా నని అనుకోలేదు ఒక చిన్న పట్టుదల మీద శేఖరం తన వుద్యోగానికి రాజీనామా ఇచ్చాడు నేను స్త్రీలకు వుద్యోగాలు యివ్వడం మంచిది కాదంటూ భావిస్తూ వచ్చాను ఇంతకాలం, ముఖ్యంగా ఆనాడు నీవు తీసుకున్న నిర్ణయంతో స్త్రీ విద్య స్త్రీల వుద్యోగాలపట్ల నాకు సదభిప్రాయం మిగలలేదు నా పట్టుదల వెనుక గల కారణాన్ని అతనికి చెప్పి తిరిగి పనిలో చేరమని అడగాలని వచ్చాను అయితే అతన్ని యిప్పుడు అర్థం చేసుకో గలిగాను నేను మూర్ఖంగా ప్రవర్తించి మిమ్మల్ని యింత కాలం దూరం చేసుకున్నాను నాకు యిప్పుడు కనువిప్పు కలిగింది రాధకు తప్పక వుద్యోగం యిస్తాను శేఖరాన్ని తిరిగి పనిలో చేరమను అంటూ రామశాస్త్రి లేచాడు

అన్నయ్యా! అప్పుడే వెళ్ళి పోతావా? ఈ పూట ఇక్కడ భోజనం చేసి వెళ్ళండి'

రామశాస్త్రి ఏమని జవాబు చెప్పాలనుకున్నా అప్పటి కతని భార్య వంటింటిలోనికి వెళ్ళి పోయింది □

పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## మానవత్వం నశిస్తోంది

'నేటి బాలలే రేపటి పౌరులు అంటూ నాయకులు నినాదాలు చేస్తున్నా, 'నేటి బాలలే రేపటి సమాజ వ్యతిరేక శక్తులుగా మారేటట్టువారే దోహదం చేస్తున్నారు చిన్న పిల్లలతో వెట్టి చాకిరీ చేయించే వారిని కఠినంగా శిక్షించేందుకు ప్రత్యక్షంగా ఏ రాజకీయ పార్టీ నాయకులూ శ్రద్ధ వహించడంలేదు కనీస మానవత్వం కూడా లేకుండా తల్లిదండ్రులు చదువుకొనే వయస్సు పిల్లలను పనుల్లో పెడుతున్నారు కొందరైతే చిన్నప్పుడే తమ పిల్లలకు అంగవైకల్యం కలిగించి, దాన్ని ఆసరాగా తీసుకొని అడుక్కొని బ్రతుకుతున్నారు మన







సమాజం సిగ్గుతో తల వొంచుకొనే ఎన్నో పనులలో ప్రస్తుతం బాలలు మ్రగ్గుతున్నారంటే అతిశయోక్తి కాదేమో

పట్టణాలలో బారుల్లోనూ రెస్టారెంట్లలోనూ కస్టమర్లకు కావలసిన పనులు చేస్తూ, బల్లలు శుభ్రం చేస్తూ ఇంకా వ్యభిచార గృహాల వద్ద విటులకు వెలయాళ్ళకు అవసరమైన వాటిని క్షణాల మీద సప్లై చేస్తూ చెప్పడానికి కూడా వీలుకాని ఎన్నో జుగుప్సాకరమైన పనుల్ని అవేమిటో కూడా తెలియనితనంతో - రాత్రనక పగలనక నిద్రకు కరువై చిన్నతనంలోనే ఎంతో బరువును బాధ్యతలను తలకెత్తుకొని మోస్తూ పని చేస్తున్న ఎందరో బాలలు ఈ సమాజంలో ఉన్నారు

దీనికి కారణం పేదరికం విద్య లేకపోవడమే కాదు - తల్లిదండ్రుల మూర్ఖత్వం, కేవలంపిల్లల శ్రమమీద సంపాదించాలనుకోవడం కూడా చిన్న పిల్లలచేత శ్రమ చేయించ కూడదన్న చట్టాలు ఉన్నా కొందరు యజమానులు చిన్న పిల్లలైతే కూలి తక్కువ ఇవ్వొచ్చున్న ఉద్దేశ్యం తోనూ, కొట్టినా, తిట్టినా పడి ఉంటారన్న ఆలోచనతోనూ చట్టాలను అతిక్రమించి వారిని పనిలోకి తీసుకుంటారు ఇక, ఆ చిన్నారి బాలల్ని తామే పోషిస్తున్నామన్న ఒక రకమైన భావంతో వారిని శారీరకంగా మానసికంగా పని చేయించే పేరిట హింసిస్తూ ఆనందాన్ని పొందుతుంటారు

ఈ రోజుల్లో సైకిలు షాపుల్లో సైకిళ్లను తుడుస్తూ, గాలి పంపుతో టైర్లలో గాలి కొడుతూ పిండి మిల్లుల్లోనూ, రొట్టెలు బిస్కట్లు తయారుచేసే చిన్న చిన్న బేకరీలలోనూ చిన్న పిల్లలు ఎక్కువగా పనిచేస్తూ కనిపిస్తుంటారు

ఇంతకన్నా అతి విషాదకరమయిన ఆలోచించేందుకు దోహదం చేసే ఇటీవల నేను చూసిన ఒక సంఘటన చెబుతాను

బస్సుల్లో కూల్‌డ్రింక్స్ బిస్కట్లు, అరటిపండ్లు పువ్వులు అమ్మే చిన్నారి బాలలు కూడా ఈ దేశంలో ఉన్నారు సాధారణంగా బస్సులు లాంగ్ జర్నీలో ఒక్కో ప్రదేశంలో ఆగుతాయి అవి ఆగడంతో అక్కడ బస్సులలో దిగే ప్రయాణీకుల సౌకర్యార్థం కాకా హోటళ్ళు, చిరు తిండ్ల దుకాణాలు ఏర్పడుతాయి ఇక వాటితో పాటు చలాకీగా ప్రతి బస్సులో ఎక్కి దిగి అమ్మకాలు చేసేందుకు బాలలు కూడా అక్కడ చేర్చబడతారని చెప్ప నక్కర లేదు

అలాంటి సెంటర్లలో ఒక్కోసారి బస్సులు ఆగకుండా వెళ్ళిపోయే సందర్భాలు ఉంటాయి అలాంటి సందర్భాలు ఏర్పడితేఅక్కడ బస్సులు ఆగితేనే, అందులో ప్రయాణీకులు తమ వస్తువులు కొంటేనే జీవితాలు సాగే చిన్నారి బాలలు ఆగకుండా వెళ్ళిపోయే బస్సులకు అడ్డంపడి ఆపిన సంఘటన ఇటీవల నాకు అనుభవమయ్యింది

ఒక కుర్రవాడు చేతిలో కూల్‌డ్రింక్సుతో బస్సుకు అడ్డం పడి ఆపాడు డ్రైవరు చాకచక్యం వల్ల బస్సు ప్రమాదం లేకుండా ఆగింది బస్సులో వాళ్లంతా ఆ కుర్రవాడ్ని తిట్టి, కొట్టేంత పని చేశారు. అయితే వాడిని ఎందుకాపావు బస్సును అంత రిస్క్ చేసి? అని ప్రశ్నించిన నన్ను వాడి సమాధానం ఆలోచింపజేసేదిగా ఉంది

"సార్! మా ఇంట్లో వాళ్లందరినీ నేనూ మా తమ్ముడు పోషించాలి సార్ నాన్న తాగుతాడు అమ్మకు జబ్బు చేసింది తమ్ముడు తర్వాత ఇంకా ముగ్గురు చెల్లెళ్ళున్నారు సార్ చిన్నవాళ్ళు బస్సాపకపోతే, ఈ సరుకులు ఎవరు కొంటారు సార్! 3 రూపాయల కూల్‌డ్రింకు అమ్మితే షావుకారు పావలా ఇస్తాడు రోజుకు



ఇరవై కూల్ డ్రింకులన్నా నేనూ, మా తమ్ముడూ అమ్మితే 5 రూపాయలు వస్తాయి అదే మాకు గంజి నీళ్లకు సరిపోతుంది సార్! అన్నాడు వాడికి తొమ్మిదేళ్ళు వాడి తమ్ముడికి ఏడేళ్ళు' 'ఉంటాయి సినిమా కథలా ఉన్నా, ఇది నిజంగా నిజం

అయితే వీళ్ల కడుపులు కూడా కొట్టే కొందరు ప్రబుద్ధులు బస్సు కదిలే ముందు డ్రింకు త్రాగి డబ్బులు కాదు కదా, త్రాగిన ఖాళీ సీసా కూడాఇవ్వకుండా తాత్సారం చేస్తారు కొందరు ఇవ్వరు కూడా ఆ పరిస్థితుల్లో బస్సు వెనక కేకలు వేస్తూ ఆ పిల్లవాడు పరుగెత్తుతుంటే ఎంత కఠిన హృదయమైనా కరగాలి అలా వాళ్ల కడుపులు కొట్టే వాళ్ళున్నారంటే మానవత్వం మనుషుల్లో నశిస్తున్నట్లే కదా!

-ఎన్ కె నాగేశ్వరరావు,

పెనుగొండ □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

ఎన్‌కోడ్:

# హైదరాబాదు నోట్‌బుక్

## ఆచార్య గోపాలకృష్ణరావు హఠాన్మరణం

జూన్ రెండవ తేదీ సాయంకాలం శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయంలో ఉస్మానియా విశ్వ విద్యాలయం తెలుగు శాఖలో ప్రొఫెసర్ డాక్టర్ కె గోపాలకృష్ణరావు హఠాన్మరణం పట్ల పలువురు వక్తలు సంతాపం ప్రకటించారు ఆచార్య గోపాలకృష్ణరావు నిగర్వి, నిరాడంబరుడు విశేషించి పరిశ్రమశీలుడైన పండితుడు అని వక్తలు ఆయనకు శ్రద్ధాంజలి ఘటించారు శ్రీకృష్ణదేవాంధ్ర భాషానిలయం విశ్వసాహితి వేమనాంధ్ర భాషానిలయం, శ్రీనివాస సాహితీ సమితి నవ్యసాహిత్య సమితి పింగళి కాటూరి సాహిత్యపీఠం యువభారతి మున్నగు సంస్థల పక్షాన ఏర్పాటయిన ఈ సంతాప సభకు కళాప్రపూర్ణ డాక్టర్ దాశరధి అధ్యక్షత వహించారు ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు డాక్టర్ మడుపు కులశేఖరరావు ప్రసంగిస్తూ డాక్టర్ గోపాలకృష్ణరావు నిరంతర సాహిత్య వ్యవసాయ శీలి అని ఆయన పరిశోధన ప్రమాణాలు సామగ్రి సమగ్రంగా ఉంటే తప్ప సంతృప్తి చెందేవాడు కారని నిరంతరం సాహిత్య కృషిలో నిమగ్నులై ఉండేవారని ఆయన శతక సాహిత్యంపై చేసిన పరిశోధన చాల ప్రామాణిక మైనదని విశ్వవిద్యాలయంలోని తెలుగు శాఖలో ఆయన సర్వజన సమాన్యుడని అన్నారు ఇటీవలే యు జి సి వారు ఆయనకు మెకంజీ వ్రాత ప్రతుల పరిష్కరణ ప్రాజెక్టును అప్పగించారని ఆ పనిలో ఆయన నిమగ్నులై యుండగా మృత్యువు హఠాత్తుగా లాక్కు పోయిందని డాక్టర్ కులశేఖరరావు విషాదం ప్రకటించారు డాక్టర్ గోవర్ధన్ ప్రసంగిస్తూ డాక్టర్ గోపాల కృష్ణరావు విద్యార్థులను ఏవిధంగా ప్రోత్సహించే వారో, విద్యా ప్రమాణాల పట్ల ఏవిధమైన మొగమాటమూ లేకుండ తమ వ్యక్తిత్వం నిలుపు కొనే వారో వివరించారు గోపాలకృష్ణరావు సౌమనస్యం తప్ప ఎటువంటి అవాంతర పరిస్థితులలోను అసంతృప్తి కర సన్నివేశాలలోను ఎవరిపట్లా అసంతృప్తి ప్రకటించేవారు కారని ఆయన అన్నారు డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు ప్రసంగిస్తూ గోపాలకృష్ణరావు తాము చేపట్టిన విద్యా కార్య క్రమాలపట్ల అత్యంత శ్రద్ధాసక్తులు కనబరచేవారని ఇటీవల ఆయన తుది మెరుగులు దిద్దుతున్న అన్యదేశ్య నిఘంటువు నిమిత్తం తనను సంప్రదించడానికి తమ కార్యాలయానికి రావడమే కాక తాము నీలగిరి యాత్రాచరిత్రలో కొన్ని అన్య దేశ్యాలు పట్టికగా ఇచ్చారని చెబితే దాని కోసం రాష్ట్ర ప్రభుత్వం అభిలేఖ కార్యానికి వెళ్లి పరిశీలించారని అన్నారు డాక్టర్ రవ్వ శ్రీహరి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి డాక్టర్ ఎన్ గోపి, డాక్టర్ సుమిత్ర ప్రభృతులు తమ ప్రసంగాలలో గోపాలకృష్ణరావు హృదయం మేధ విశిష్ట మైనవని ఆయన జీవితంలో ఆశించిన విద్యా సంబంధమైన విలువలకోసం కృషి చేసిన రంగాలలో ఫలితాల కోసం శ్రద్ధవహించాలని కోరారు డాక్టర్ గోపాలకృష్ణరావు కుటుంబ సభ్యులకు తమ ప్రగాఢ సంతాపం తెలియ జేస్తూ సభ తీర్మానం ఆమోదించి, రెండు నిమిషాలపాటు మౌనం పాటించింది తొలుత శ్రీకృష్ణదేవరాయాంధ్ర బాషా నిలయం కార్యదర్శి శ్రీ ఎం వి ఎల్ నరసింహారావు ప్రసంగిస్తూ సమావేశోద్దేశాన్ని వివరించిన మీదట డాక్టర్ దాశరది గోపాలకృష్ణరావు చిత్ర పటాన్ని పుష్ప మాలలతో అలంకరించారు డాక్టర్ గోపాలకృష్ణరావుపై ఇదివరకే హైదరాబాద్ నోట్‌బుక్ వ్రాసింది

## కె ఎ అబ్బాస్ మృతికి సంతాపం

ప్రముఖ పత్రికా రచయిత రచయిత చిత్రనిర్మాత శ్రీ ఖ్వాజా అహమద్ అబ్బాస్ జూన్ 1వ తేదీన బొంబాయిలో గుండె పోటుతో మరణించినందుకు స్థానిక మఖ్దుం సొసైటీ అధ్యక్ష కార్యదర్శులు డాక్టర్ జీనత్ సాజిదా, శ్రీ రాజ్ బహదూర్‌గౌడ్ సంతాపం తెలుపుతూ జూన్ 2వ తేదీన ఒక ప్రకటన చేశారు అబ్బాస్ ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసి యేషన్ సంస్థాపకులని, ప్రముఖ ఉరుదూకవి మఖ్దుం మొహియుద్దీన్ ఆప్తమిత్రులని అన్నారు అబ్బాస్ మరణం వల్ల దేశంలో అభ్యుదయ సాహిత్యోద్యమం ప్రవర్తకులలో ఒకరిని కోల్పోయిందని ఫిరాక్ ఫియాజ్ వంటి ఉరుదూ మహాకవుల మరణంతో నష్టపడిన సాహిత్యం అబ్బాస్ మరణంతో మరింత నష్టపడిందని వారు తమ ప్రకటనలో తెలిపారు ఫిలిం ఎగ్జిబిటర్స్ ఉసోసియేషన్ అధ్యక్షులు శ్రీ రమేశ్‌చంద్ర లాహోటీ ఒక సంతాప ప్రకటనలో శ్రీ అబ్బాస్ గాఢ జాతీయ వాది అని సాహిత్యంలో విశిష్ట వ్యక్తి అని పత్రికారచనా చలనచిత్ర ప్రపంచంలో ప్రముఖుడని అన్నారు శ్రీ అబ్బాస్ పత్రికా రచయితగా జీవితం ప్రారంభించారు ఆయన 1935లో బొంబాయి క్రానికల్ ఆంగ్ల దినపత్రికలో సబ్ ఎడిటర్‌గా చేరారు చలన చిత్రాల పై విమర్శలూ వ్రాసేవారు ఆ విమర్శలకు చలన చిత్రనిర్మాతలు కుపితులై అతనిని ఉద్యోగం నుంచి తొలగించాలని పత్రికాధిపతులను కోరుతూ తీర్మానించారు కాని పత్రికాధిపతులు ఆయనను తొలగించ డానికి మారు ఆదివారం అనుబంధానికి సహసంపాదకునిగా నియమించారు పిదప అబ్బాస్ 1940లో బ్లిట్జ్ ఆంగ్ల వారపత్రికలో చేరారు అప్పటి నుంచి మరణించే వరకు ఆపత్రిక చివర పుటలో వ్యాసం వ్రాసేవారు ఆయన బుర్ర కథా నిపుణుడు శ్రీ నాజర్‌ను గురించి లాస్ట్ పేజ్‌లో వ్రాసినది ఇంకా నాకు జ్ఞాపకం వుంది ఆయన తొలి చలన చిత్ర కథ నయాసంసార్ దీనిలో అశోక్ కుమార్ నటించారు నగరంలోని అన్యాయాలను బయట పెట్టి నందుకు ఉద్యోగం కోల్పోయిన ఒక పత్రికా రచయిత సొంతంగా పత్రిక పెట్టి నడపడం ఈ చిత్రం ఇతివృత్తం సమసామయిక విషయాలు ఇతివృత్తంగా చలన చిత్ర నిర్మాణం ఆయన ప్రత్యేకత బెంగాల్ కరువు ఆధారంగా దర్తీకె లాల్ చిత్రం నిర్మించారు ఇది ప్రపంచంలోని 100 ఉత్తమ చిత్రాలలో ఒకటని ఒక ఫ్రెంచ్ చలన చిత్ర విమర్శకుడన్నారు పిదప అబ్బాస్ అవారా శ్రీ 420 బాబీ హెన్నా అన్‌హోనీ రాహీ పర్దేశీ చార్‌దిల్ చార్‌రాహేం, సాత్ హిందూస్తానీ ఏక్ ఝుండేల్ కహానీ గునాహ్ కకమత్ ఏక్ ఆద్మీ మున్నగు పెక్కు చలన చిత్రాలకు ఇతి వృత్తాలు వ్రాసి నిర్మించారు ఆయన నిర్మించిన ది నక్సలైట్ చిత్రానికి ఇటలీలో జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో బంగారు పతకం లభించింది అబ్బాస్ ఆంగ్ల ఉరుదూ బాషలలో దాదాపు 70 పుస్తకాలు రచించారు వీటిలో ఇన్‌కిలాబ్ అనే ఉర్దూ నవల ఆత్మకథ సోవియట్ ప్రదాని నికితా కృశ్చేవ్ శ్రీమతి ఇందిరాగాంధీ రష్యా వ్యోమగామి యూరీగగారిన్ జీవిత చరిత్రలు ఉన్నాయి హర్యాణా ప్రభుత్వం సోవియట్ ప్రభుత్వం ఆయన సాహిత్య సేవను సన్మానించాయి బారత ప్రభుత్వం 1969లో ఆయనను పద్మశ్రీ బిరుదంతో సత్కరించింది రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు శ్రీ అబ్బాస్ మరణానికి ప్రగాఢ సంతాపం తెలిపారు శ్రీ అబ్బాస్ చలన చిత్ర నిర్మాత రచయిత దర్శకుడు విమర్శకుడు అని ఆయన అన్నారు శ్రీ అబ్బాస్ నిష్ణాతుడైన పత్రికా రచయిత బహు గ్రంథ రచయిత బాధ్యత గల విమర్శకుడు అన్నిటినీ మించి దేశ చలన చిత్ర పరిశ్రమ జననాటి వృద్ధులతో ముడి పడిన జీవితం గల విశిష్ట వ్యక్తి ఆయన మరణం వల్ల అందరికీ ప్రేరకుడుగా ఉన్న వివేక వంతుడైన సజ్జనుని చలన చిత్ర పరిశ్రమ కోల్పోయింది అని ముఖ్య మంత్రి శ్రీ రామారావు అన్నారు

## ఉపశ్రుతి –

దేశమంతా మతకల్లోలాలు వ్యాపిస్తున్నాయి గదా దీనికి పరిష్కార మేమిటి? – అనడిగారు నన్ను ఒకరు నాకు తోచిన పరిష్కారం ఇది మన సంప్రదాయమేమో సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి అనేది కనుక దేశంలోని హిందువులందరూ మాతం మార్చుకుంటే ఈ సమస్య పరిష్కార మైపోతుంది అప్పుడు అంతా సామరస్యమే – అన్నారు మిత్రులు శ్రీ ఎ వి ప్రసాద్ ఒకే మతస్థులైనా [illegible], [illegible], ఖుర్ద్ మున్నగు వారు కొట్టుకుంటున్నారుగా! అన్నారు మరొకరు అవి మతకలహాలు కావు [illegible] – అన్నారు శ్రీ ప్రసాద్

-తిరుమల రామచంద్ర

# గురువింద

ఏమే అండాలూ ఏమిటీ సంగతులు, నల్ల పూసైనావు, ఇంతకీ కొత్త కోడల పిల్ల ఏమంటున్నది అన్నట్టు ఎవరూ కనపడరేమి!

ఎన్నాళ్ల నుంచో నాకైకన్నైనా తిప్పక పైగా నన్నే మాటలంటున్నావే రాంబాయి' అంటూ మంచము మీద నుంచి లేచి కూర్చున్నది

రాంబాయమ్మ భారీ శరీరాన్ని వూపుకుంటూ వచ్చి అండాలమ్మ ప్రక్కనే కూర్చుంది

ఆఁ పెద్దోడి దగ్గరికి వెళ్లానే ఆ కోడలు ముండ సరిగ్గా చూస్తుందా చస్తుందా దానికి నాకు మొదటి నుంచి పడి చావదు కదా, అయినా నీకు తెలియనిదా, ఏమిటి! దాని దగ్గర ఇమడలేక నిన్ననే చిన్నోడి దగ్గరకు వచ్చా, ఇక వాడికీ పెండ్లి అదీ అట్లానే తగలడితే నా గతేమిటో ఏమో ఇంతకీ నీ కోడలు సంగతి ఏమిటి?'

ఆఁ . దీని సంగతే అడగొచ్చావ్, వచ్చి మూడు నెలలైనా కాలేదు కొమ్ములు మొలిసాయనుకో గాన్ని తోలు బొమ్మలా ఆడిస్తుంది కొంగున కట్టుకుని తిరుగుతుంది తెచ్చింది బోడి కట్నం లక్ష

అదేమిటే అప్పుడు మొత్తం అయిదారు లక్షలు ముట్టాయన్నావు కదూ!'

'వాళ్లమ్మా బాబూ తెలివి తక్కువ వాళ్లను కొన్నావా క్యాష్ అంతా దాని పేరు మీదే బేంక్‌లో తగలేసారు

"పోనీలేవే 'వెధవ డబ్బు నిన్నైనా సరిగా చూస్తుందా?"

"అయ్యో! రాత, నాకంత అదృష్టం



నూతలపాటి పద్మసదాశివరావు





# గురువింద

కూడానా... నీకు తెలుసుగా నా సంగతి ... కుడి కాలికి పక్షవాతం దెబ్బ వచ్చింది, పనిమనుషులు లాభం లేదు. ఏదో మన మనిషిగా వుంటుందనేగా, పసివాడైనా పెండ్లి చేసాను ... ఏం, మందు పెట్టిందో ఏమోగాని, 'నా సంగతే మరచాడనుకో ...' 'దాని మత్తులో పడిపోయ్యాడు' ..."

"ఆc ... మామూలేనే అండాలూ, నేను చెప్పానుగా నా కోడలు గురించి ఇన్నాళ్ళు, ఇప్పుడిక నీవు ... మన కాలంలో అత్తయ్యలను ఎంత గౌరవించేవాళ్ళం ... ఎలా చూసుకొనే వాళ్ళం ... కాకపోతే నాకా అదృష్టం లేకనే కాపురానికి వెళ్ళిన రెండో రోజే మా అత్తగారు కాలధర్మం చేసారు కాని ..." అంటూ వాపోయింది రాంబాయమ్మ .

ఇంతలో ఆటో ఆగిన శబ్దం విని ... ఇద్దరూ గేటు వైపు చూసారు ...

అండాలమ్మ ఏకైక ముద్దుల కూతురు సూట్‌కేసుతో ధుమ, ధుమలాడుతూ ... గేటును విసురుగా నెట్టుకుంటూ పెద్ద పెద్ద అంగలతో అండాలమ్మను చేరి సూట్‌కేస్ మూలకు గిరాటేసి ఏడ్చుందుకున్నది.

"ఏందమ్మా ... జయా, ఏమైయిందే ... ఏమిటీ ఈ ఏడుపు ..."

"అమ్మా ఇక నేను ఆ ఇంట్లో ఉండనే, ఆ చచ్చు దద్దమ్మతో కాపురం చెయ్యలేను ... ప్రతి చిన్నదానికి అమ్మ, అమ్మ అంటాడు, ప్రతి దానికి ఆమెనే వెనకేసుకొస్తున్నాడు ... అందుకే అలిగి, చెప్పా పెట్టకుండా వచ్చేసానే ..."

"మంచి పని చేశావ్ తల్లి ... లేకపోతే ఆ రాక్షసి ముండ చేతిలో పడి చచ్చేదానివే ... రెండు లక్షలు పోసి కొన్నాం, చచ్చు వెధవని, తల్లి చాటు బిడ్డడని తెలిస్తే చిల్లి గవ్వన్నా ఇచ్చేదాన్ని కాదు. చీపిరి తిరగేసేదాన్ని ... ఎన్ని దొంగ కబుర్లు చెప్పి నా బిడ్డను చేసుకొన్నారో ..."

"పోనీలేవే ... లేమ్మాలే ... నా బంగారు తల్లివి కదూ, ఎలా చిక్కిపోయావో చూడు, నల్ల కోప్పేసి వజ్రంలా వుండేదానివి 'పెంకులా' అయ్యావ్ ...

లే తల్లి ... స్నానం చేసి ఎంగిలిపడు. లంకణాలు చేసిన దానిలా వున్నావ్ ... 'అవసరం వస్తే వాడే మనింట్లో పడి వుంటాడులే ..."

రాంబాయమ్మ బుగ్గమీద వేలు వేసుకొని మరీ వింటున్నది.

"ఏం చెప్పమంటావే రాంబాయి ... ఆడపిల్ల తల్లి కష్టాలు ... నీకిద్దరూ మొగపిల్లలే ..."

రాంబాయమ్మకు ఏం ... చెప్పాలో అర్థంకాలేదు .

అప్పుడుదాకా వీళ్ల సంభాషణ ఆలకిస్తూ కూర్చున్న కుక్క మాత్రం అర్థమైనదానిలా చెవులు విదిల్చి అక్కడ నుంచి కదిలింది □



# దూరదర్శనం

లత

## ఆగదు ఉదయం

కథ మాటలు దివ్య ప్రబాకర్ రచనా- కథా సంవిదానం- డైలాగులూ- డైరెక్షనూ- నటనా- అన్నీ బాగున్నాయి ఈ బాగంలో పల్లెటూరి అబ్బాయిలు బస్తీ వ్యాపారస్తులుగా- పైరవీదార్లుగా- బ్లాక్ మెయిలర్సుగా మారారు ఒక బార్య ననుమానించే బర్తా- బర్త మాటవిని మారిపోయిన అమాయకురాలూ- మరో అమాయకుడూ- ఇప్పటికి పాకంలో పడ్డది కథ

## స్వయం సిద్ధ

-అంతిమకడీ- అంటే చివరి బాగం- పహిలేకడిలో ఏంత అర్థమయిందో అంతిమకడిలోనూ అంతే డైవోర్సు ఇచ్చిన బర్త చెల్లెలు పెళ్లికి వెళ్లి వడ్డించి- చీర పెట్టించుకొని అది పేదవాళ్లకిచ్చి విశ్వ కుటుంబిని అవుతుంది ఈ స్వయంసిద్ధ ప్రముఖ జర్నలిస్టు అమితామాలిక్ చెప్పినట్లు ఇదొక అర్థంలేని కథ

## వార్తలు

ఉద్యోగులకు కరువుబత్యం ఇస్తారు మరి జీతాల మాట? నీటి సమస్యకి ఇంకా రైల్వే వాగన్ల కోసం రైల్వే మంత్రికి ఉత్తరం వ్రాశారుట తక్షణ నీటి సమస్య మీద ఉత్తరమా? ఢిల్లీ వెళ్ళి కాంగ్రెసేతర పార్టీలతో మాట్లాడటం కన్నా రైల్వేమంత్రితో నీటి వాగన్ల గురించి మాట్లాడితే కాలం వృదా అవుతుందనుకొన్నారా?

## చక్రవర్తి

సౌజన్యలాగే ఉండే దొంగ ఆ ఇంట్లో అప్పలమ్మ పేరుతో ప్రవేశించి ఇల్లు దోచి నేనే సౌజన్య నంటుంది అయితే ప్రేమ్ అనేవాడు అప్పలమ్మని పట్టుకుంటాడు ఏం నాటికో ఏమిటో?

## వార్తాదర్శిని

మూడు నెలల పిల్లకి ఇంకా పెళ్ళిళ్ళు చేస్తున్నారు బట్టలు లేకుండా ఆడుకునే నాలుగేళ్ళ పిల్ల మెళ్లో మంగళసూత్రాలు చూడటం అదీ ఈ కాలంలో ఒక వింత కన్యాశుల్కంలో పాత్రల్ని సాక్షాత్తూ చూస్తున్నట్లున్నది- తల్లీ చిన్నారి చెల్లీ ఏమిటమ్మా ఈ నీ కథ మారదా? ఇంతేనా? యానాం దగ్గిర పల్లె పాలం కొమరకోలు లాటి చోట్లు ఈ భూగోళం మీద బారతదేశపు అన్నపూర్ణ అయిన ఆంధ్రదేశంలో ఇంకా ఉన్నాయి వీరేశలింగం గురజాడ చలం శాశ్వతంగా సమాధి కాబడ్డారు డాక్టర్ల సమ్మె న్యాయమా- అన్యాయమా అని తీరిగ్గా విచారిస్తున్నారు కాని అసలే వైద్య సదుపాయం అంతంత మాత్రమైన మన దేశంలో వైద్యులకు కావల్సిన సౌకర్యాలిచ్చి తక్షణ వైద్య సౌకర్యం ప్రజల కివ్వటం ధర్మం ప్రజల ప్రాణాల్ని గాలిలో వదిలి తప్పు డాక్టర్ల దనటం ధర్మం కాదు- హాస్పటల్లో మందులు లేవు అన్నిటికీ అయిదు పైసలకి దొరికే విటమిన్ మాత్రలు తప్ప మరి ఉండవు ఎక్కువ గంటలు పని చేయాలనే విషయం వృత్తిలో ప్రవేశించే ముందే తెలుసు కోవాలి అన్నారు మంత్రిగారు అలాగే నిపుణులైన డాక్టర్లు హాస్పటల్లో ఎన్ని రోగాలకి ఎటెండ్ అవగలరన్నది ప్రశ్న డాక్టరు ఇరవయి నాలుగు గంటలూ పని చేయాలని ఒక పక్క చెపుతూ ఇళ్ళ దగ్గర ప్రాక్టీసు మాన మనటంలో అర్థం లేదు అందరు డాక్టర్లూ డబ్బు మనుషు లనుకోరాదు

అమెరికాలో లాగా మనకి వృద్ధుల సమస్య సమిష్టి కుటుంబంలో ఉన్నప్పుడు సమస్య కానేకాదు కాని వృద్ధుల హోమ్సులో స్వయం ఉపాది కల్పించినా వారు చేయగలరా? కాకపోతే పోరు ఉండదేమో?

## కష్మాకష్

కొంత మంది బర్తలు ఇతరుల ఎదట బార్యని గౌరవిస్తున్నట్లూ ప్రేమిస్తున్నట్లూ నటించి ఏకాంతంలో నరకం చూపిస్తారు ఆమెని కొడతారు ఆమె ఎదటే పరాయి స్త్రీలతో కులుకుతారు ఆమె గట్టిగా అంటే ఈ ఇల్లు నాది నువ్వెవరివి? అంటారు అలాటి సందర్భంలో పుట్టిన రోజు వస్తుంది నలుగుర్నీ పిల్చి భార్యకి నెక్లెసు బహూకరిస్తారు ఆమె విసగి నలుగురి ముందూ అతని నిజ స్వరూపాన్ని తెలియపరిచి ఆ ఇంటి వంక తిరిగి చూడకుండా వెళ్ళి పోగలిగితే ఆమె స్త్రీ ఈ కథే నేడు చూపించారు తమిళ కథలాగుంది యధాప్రకారం రచయిత్రి పేరు చెప్పలేను

'కష్మాకష్'లో శశిపురి, ప్రేమానారాయణ్



## స్వరరాగసుధ

రీతిగౌళరాగం హాయిగా ఉంది- ఆర్తి, బక్తి ఈ రాగంలో వినిపిస్తాయని మహా గాయకుల బావం బాలమురళీ గారి పాట మధురం అయితే ఘంటసాల వారి పాట వాగ్దేవి 'అధరం- నాగయ్య గారు పాడిన నన్ను విడిచీ పాడారు పై ముగ్గురులో శాస్త్రీయపు కట్టు నాగయ్య గారిలోనే ఉందంటే- సంగీత వేత్తలు నాది తప్పయితే క్షమింతురు గాక

## ఇల్లు చేరిచూడు

ఈ నాటిక బాగుంది- డైలాగులు- నటనా బాగున్నాయి ఈ విధంగా సాగితే బాగానే ఉంటుంది- ఇద్దరు బ్రహ్మచారులు పెళ్ళి అయిందని ఒక ఇంట్లో అద్దెకి చేరతారు ఇల్లు దొరక్క కథ బాగానే ఉంది చక్కని పద్యాలు రెండు వినిపించారు రచయిత ఎవరు? సస్పెన్స్

## రధచక్ర

దర్శకత్వం కమలాకర్ సారంగ్ ఒక సమిష్టి కుటుంబంలో ముగ్గురు అన్నదమ్ముల్లో ఒకతను సన్యాసి అయి వెళ్ళిపోతాడు అతని కొడుక్కి చదువు చెప్పించరు పినతండ్రులు తల్లి ఆరాటపడుతుంది కాని లాబం లేదు ఇంతలో ఒక బంధువు వాళ్ళని నిగ్గదీసి- మీ అన్నదమ్ముడి పొలంమీద ఒచ్చే ఆదాయం ఏమయింది అంటాడు అక్కడి నుంచి పోట్లాట అవుతుంది బంధువు ఆ పొలంలో తోటల్లో బాగం పంచమంటాడు పిల్లవాడు దు ఖపడతాడు పిన తండ్రుల మాటలు విని తల్లి ఓదారుస్తుంది ఇంతవరకూ అది కథ నాటకం మొదటి నించీ బాగా లేదు ఇది రచయిత తప్పూకాదు నటీనటుల అసమర్థతా కాదు ఈ సమస్య ఔట్ డేటెడ్ అయింది

## విద్యేశరణం గచ్ఛామి

అలా అనే ఎనౌన్సరు అన్నట్లుంది తెర మీద టైటిల్సు లేవు గనక ఎనౌన్సరు ఏమన్నదో నాకేం వినబడ్డదో అదే వ్రాస్తున్నాను క్లోజింగ్ ఎనౌన్స్‌మెంటు లేదు పల్లెటూరి రౌడీని తన్నబోవటం ఈ నాటి కథ

## కాలాజల్

సీరియల్ నాటిక మొదటి బాగం మధ్యప్రదేశ్‌లో జగదల్‌పూర్ ఒక చిన్న పట్టణం అది బస్తరు నానుకుంది అదీ కథా స్థానం రచయిత ఎవరని అడగద్దు - ఎప్పుడయినా టైటిల్సు వేగంగా తియ్యకుండా ఉంటే చెపుతాను కాలాజల్ అంటే నల్లనీరు అని మక్కీ అనువాదం కాదు మురికి నీరు అనవచ్చును ఒక దారోగా అంటే మేనేజరు ఒక స్త్రీని ప్రేమిస్తాడు అతనంటే పగ వున్న కొందరు గ్రామస్తులు పోలీసుల దాకా పోయి వాళ్ళిద్దర్నీ పట్టిస్తారు దారోగా ఇజ్జత్ పోతుంది అదీ మొదటి బాగం □

# ప్రపంచ గుర్రపుపందాలరంగంలో సంచలనం

## షేర్‌గార్ అపహరణ!

ప్రపంచ గుర్రపు పందాల పోటీ రంగములో అగ్రగామి జాతి అశ్వములను ప్రత్యేక శిక్షణ యిచ్చి, ఎంతో జాగ్రత్తగా పెంచి తయారు చేస్తారు. ఈ గములకు లభించు సుఖ సౌకర్యములు, ము చూచి అనేక మంది ధనవంతులు ను యీర్ష్య చెందుతూ ఉంటారు. ప్రసిద్ధి గుర్రపు పందెములలో పాల్గొనే యీ ం కొన్ని వందల మంది జీవితాలని యమారు చేస్తాయి. అలాంటి అశ్వ పరుగు టీలలో పాల్గొని అనేక విజయాలు సాధించిన అగ్రగామి అశ్వంగా ఖ్యాతి నొందిన 'షేర్‌గార్' గుర్రమును కొందరు దుండగులు మాయం చేయటం ప్రపంచములో గుఃరపు పందెముల




'షేర్‌గార్' అపహరణని ప్రముఖంగా ప్రచురించిన పత్రికలు

అభిమానులలో సంచలనం సృష్టించినది. నాలుగు ఏళ్ళ క్రితం అదృశ్యం అయిన యీ గుర్రము గురించి ప్రత్యేక పోలీసు సిబ్బంది యిప్పటికీ వెతుకుతూనే ఉన్నది. షుమారు ముప్పై మిలియన్ పౌండ్ల (సుమారు 60 కోట్ల రూపాయల) విలువ చేసే యీ అగ్రశ్రేణి గుర్రము ఐర్లాండులో డబ్లిన్‌కు 30 మైళ్ళ దూరమున కిల్‌డేర్‌లో గల బ్యాలిమనీలో ఆగా ఖాన్ గుర్రపు శాలకు చెందినది. 1983లో దుండగుల బృందముచే మాయం చేయబడిన యీ గుర్రం గురించి అనేక ప్రత్యేక పోలీసు, నిఘా బృందాలు పరిశోధన జరిపి ఐ. ఆర్. ఎ గ్యాంగ్‌చే చంపబడిన' దన్న నిర్ణయానికి వచ్చాయి. ఈ గ్యాంగ్ అడిగిన రెండు మిలియన్‌లు గుర్రపు యజమానులు యివ్వనందుకు దొంగిలించి చంప వేశారు అని పరిశీలకుల భావన. ఈ గుర్రమును మాయం చేయటం గుర్రపు పందాల రంగములో నమ్మ శక్యము కాని యధార్ధము. ఇంతవరకు యిటువంటి అరాచకము జరగలేదు. పోలీసులు యింకా తుది నిర్ణయము తీసుకొనక పరిశోధన జరుపు తున్నారు.

'షేర్‌గార్' ఆగాఖాన్ మరి 34 మంది సిండికేట్‌కు చెందిన అశ్వశాలలో గల అగ్రగామి గుర్రాలలో ఒకటి. ఈ ప్రసిద్ధ అశ్వము యొక్క అదృశ్య కార్యక్రమము అతి జాగ్రత్తగా రూపొందించిన పథకము ప్రకారము జరిగినది. 1983 అగస్టు 8 రాత్రి 9 గంటలకు జరపబడింది. ఒక గుర్రాల రవాణా 'ట్రక్కు' రెండు చిన్న ట్రక్కులు అశ్వశాలల వద్దకు వచ్చాయి. వాటితో అరుగురు ఆయుధములతో వచ్చారు. రివాల్వర్‌లు, రైఫిల్స్, సబ్ మిషిన్ గన్‌లు వారివద్ద ఉన్నాయి. ఆ వాహనముల రాక ఎవరు పట్టించుకొనలేదు. వారు వాహనముల నుండి దిగి సమీపమున గల 'హెడ్ గ్రూమ్' జేమ్స్ ఫిట్జ్ గెరాల్డ్ యింటికి వెళ్ళి అతనిని బల వంతముగా అశ్వశాల వద్దకు బెదిరించి తెచ్చారు. గుర్రాలు క్రొత్త వారి ఉత్తర్వులను వినవు. అందుకే 'హెడ్ గ్రూమ్' ను బెదరించి, ప్రాణ భయం కలగించి 'షేర్‌గార్' ను తమ 'ట్రక్కు'లో నికి ఎక్కించ గలిగారు. ఫిట్జ్‌గెరాల్డ్‌తో సహా వారు కొంత దూరము వెళ్ళి అక్కడ అతనిని పడవేసి, రెండు మిలియనుల పౌనులు యివ్వ వలసినదిగా బెదిరించి వెళ్ళి పోయారు. ఫిట్జ్ గెరాల్డ్ అశ్వం అపహరణ గురించి స్టడీ మేనేజరుకు తెలపగా అతను ఆగా ఖానుకు వార్త అందించాడు. ఆగాఖాన్ దొంగల బెదరింపుకు లెక్క చేయక వారు అడిగిన రెండు మిలియన్ పౌనులు పారితోషికముగా యిచ్చి గుర్రము విడిపించు కొనుటకు యిష్టపడక, పోలీసులకు దొంగ తనము గురించి తెల్పాడు.

'షేర్‌గార్' దొంగతనము వార్త మరుసటి రోజు వార్తాపత్రికలలో ప్రముఖంగా వచ్చింది. యావత్తు ఐర్లాండులో దొంగతనము వార్త సంచలనం కలిగించినది. ఐర్లాండు ప్రధాని డా. గ్యారెట్ ఫిట్జ్ జెరాల్డ్ టి. వి లో యితర అశ్వశాల అధిపతులకు హామీ యిస్తూ ప్రకటన చేసాడు షేర్‌గార్‌ను దొంగలించిన వారిని పట్టుకొనుటయే గాక, యిక ముందు యిటు వంటి దొంగతనాలు జరగకుండా రక్షణ కల్పించుటకు హామీ యిచ్చాడు.

'షేర్‌గార్' అన్వేషణలో పోలీసులే గాక, డిటెక్టివ్‌లు, రేసింగ్ జర్నలిష్టులు, క్రైమ్ రిపోర్టర్‌లు, అశ్వశాల అధిపతులు, ఆగాఖాన్‌కు చెందిన ప్రత్యేక నిపుణుల బృందము పాల్గొన్నారు.

క్రైమ్ రిపోర్టర్, అశ్వ నిపుణుడు రాయ్‌డేవిడ్ కథనము ప్రకారం దొంగతనము చేసినవారు ఆశించిన ధనము అందకపోవుట వలన షెర్‌గార్‌ను కాల్చి చంపి వేసి యుండవచ్చును. ఐరిష్ ప్రభుత్వమునకు కూడా యీ విషయం తెలిసినా 'బ్లడ్ స్టాక్', గుర్రాల వ్యాపారస్తులు, అధిపతులు భయభ్రాంతులు కాకుండా, దేశము వదలి పెట్టకుండా ఉండటానికి రహస్యముగా



పందెపు గుర్రాలలో మేటి 'షేర్‌గార్',
జాకీ వాల్టర్ స్విన్‌బర్న్

యుంచినదని అనుమానించ బడుచున్నది. షేర్‌గార్‌ను దక్షిణ అరేబియన్ షేకుకు ఉత్తర ఐర్లాండ్ సరిహద్దుల ద్వారా రహస్యముగా చేర్చబడిన దని కొందరి భావన. షేర్‌గార్‌కు తెల్లరంగు వేసి ఆల్ప్సు కొండలోయలలో రహస్యముగా దాచబడిన దని కొందరి ఆలోచన. షేర్‌గార్ అపహరణతో గుర్రముల యిన్స్యూరెన్స్ రేటు పెరిగినది. గుర్రపు శాలల్లో 'టి. వి. కెమెరాలు అమర్చబడినవి. ఎలక్ట్రానిక్ యంత్రాల ద్వారా గుర్రపు శాలల తలుపులు మూసి వేయుటయే గాక అక్కడకు ఎవరు వెళ్ళకుండా ఏర్పాట్లు జరిగినవి.

'షేర్‌గార్' అపహరణతో ప్రపంచ గుర్రపు పందాల రంగములో ఎన్నో జాగ్రత్తలు తీసుకోబడినవి. •

—ముకరమ్

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor: M. Madhava Rao, Chief Editor: S. Radhakrishna.
Phones: Business: 61247, 61248, 75569 Editorial: 75667


"దొంగగారూ! స్వాగతం!!"లో విజయశాంతి, కృష్ణ


"కృష్ణలీల"లో రమ్యకృష్ణ, కల్యాణచక్రవర్తి

## శరత్ దర్శకత్వంలో "కులాల కురుక్షేత్రం"

"ఆధ్యాత్మికంలో ఉన్న విప్లవ ధోరణి కలిగిన చిత్రమిది. రాజకీయం, మతం కులాల మధ్య చిచ్చు రేపుతోంది. అవగాహనతో, వివేకంతో ప్రజలు చెప్పే తీర్పే ముఖ్య కథాంశం. గోమాత గాయత్రి మూలంగా కథను చెప్పడానికి ప్రయత్నించాం. 'దసరా బుల్లోడు' చిత్రం షూటింగ్ జరిగిన విజయవాడకు 60 కిలో మీటర్ల దూరంలో ఉండే భట్లపెనుమర్రులో ఏప్రిల్ 20 నుంచి మే 4 వరకు జరిగిన షెడ్యూల్‌తో చిత్రం యాభై శాతం తయారైంది. ఏప్రిల్ 30, మే 1న చిత్రీకరించిన పతాక సన్నివేశాలలో నలభై ఎడ్లబండ్లు, నలభై ట్రాక్టర్లతో మూడు వేల మందికి పైగా జనం పాల్గొన్నారు. మిగతా షూటింగును మే 11 నుంచి 25 వరకు మద్రాసులో జరిపాం," అన్నారు వల్లభనేని లక్ష్మీదాసు. ఈయన శ్రీ దత్త సచ్చిదానంద ఫిలిమ్స్ బానర్‌లో నిర్మించిన పై చిత్రంలో నరేష్, దగ్గుబాటిరాజా, శుభలేఖ సుధాకర్, సాయికుమార్, ఏడిద శ్రీరాం, ప్రభాకరరెడ్డి, కోట శ్రీనివాసరావు, జె. వి. సోమయాజులు, రంగనాథ్, వేలు, వీరభద్రరావు, అర్జున, శ్రీ చిత్ర, వై. విజయ, అనిత, కాంచన, తాతినేని రాజేశ్వరి, మాడా, శ్యాంసుందర్, నర్రా వెంకటేశ్వరరావు, ఒక విశిష్టమైన పాత్రలో శివకృష్ణ పాల్గొన్నారు. ఎం. వి. ఎస్. హరనాథరావు కథ, మాటలు రాశారు. టైటిల్

## సినిమా

(43వ పేజీ తరువాయి)

సాంగ్‌ను శ్రీ దత్త సచ్చిదానంద స్వామిజీ, ఇతర గీతాలను వేటూరి, జాలాది రాయగా కె. వి.

"కులాల కురుక్షేత్రం"లో చిత్ర



మహదేవన్ స్వరపరిచారు. శ్రీకాంత్ ఛాయ, బి. నాగరాజన్ శిల్పం, సాహుల్ సాహసాలు, డి. వెంకటరత్నం కూర్పుతో శరత్ దర్శ[illegible]ం వహించారు.

## వంశీ దర్శకత్వంలో "మహర్షి"

"జూన్ 15 నుంచి షూటింగ్. ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ వేమూరి సత్యనారాయణ చక్క[illegible] సమకూర్చారు," అన్నారు వంశీ. ఈయన స్వీ[illegible] దర్శకత్వంలో కె. శారదాదేవి నిర్మిస్తున్న [illegible] మూవీస్ వారి పై చిత్రానికి తనికెళ్ళ భరణి మా[illegible]లు, సీతారామశాస్త్రి పాటలు, ఇళయరాజా సం[illegible]తం, హరి అనుమోలు ఛాయ, తోట యాదు [illegible], తమ్ముడు సత్యం నిర్వహణ, అనిల్ [illegible] కూర్పుతో రవికిశోర్ సమర్పణ.

## "భూత్ బంగ్లా"

"పెంచలకోన అడవుల్లో, గూడూరు పరిసరాలలో షూటింగ్," అన్నారు పి. బాబు. ఈయన దర్శకత్వంలో ఎం. రామరాజు నిర్మించే చెం[illegible]లక్ష్మి పిక్చర్స్ వారి పై చిత్రంలో అనూరాధ, గా[illegible], డిస్కో శాంతి, జానకి, ఫాతిమా, గిరిజ, ఈశ్వ[illegible]రావు, నాగేష్, నవనటులు రవికిరణ్, చంద్రబాబు, [illegible] వి. సుబ్బారావు, రవీంద్రరెడ్డి, రవికుమార్, [illegible] పాత్రధారులు. రోహిణి కృష్ణ మాటలు, [illegible]లాది పాటలు, రాజ్-కోటి సంగీతం, దివాకర్ ఛాయ[illegible] అప్పారావు ప్రొడక్షన్‌తో ఇ. వి. సి. ము[illegible] సమర్పణ.